అపరాధ పరిశోధన అనుబంధం—42

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మర్డర్ కాంట్రాక్ట్

రచన : హుస్సేన్‌బాషా

## ముగ్గురు అనుమానస్థులు

రచన : అజీజ్

## అబద్ధమాడి చూడు

రచన : వసుంధర

## న్యాయమూర్తి?

రచన : డాక్టర్ పెందుర్తి మాస్టర్జీ

'శాన్యోరా' సీరియల్ - ఏడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—42
జూన్, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. పీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# "మర్డర్ కాంట్రాక్ట్"

## హుస్సేన్ బాషా

"నన్ను మిస్టర్ గణేష్ పంపించాడు. నాతో మీకొచ్చిన అవసరమేమిటి?" అడిగాడు రౌడీ మస్తాన్.

"రౌడీ మస్తాన్ నువ్వేనా?" అన్నాడు ఆనంద్, మస్తాన్ వైపు చూస్తూ.

రౌడీ మస్తాన్ ఆరడుగుల ఎత్తుగలిగి, విశాలమైన ఛాతీతో గంభీరంగా వున్నాడు. ముఖంమీద స్ఫోటకపు మచ్చలు, కుడి చెంపమీద కత్తిగాటు వుంది. చేతులు బలంగా యినుపకడ్డీల్లా వున్నాయి. వంకీలు తిరిగిన తల వెంట్రుకలు గంపలా రేగివున్నాయి. మెలితిరిగిన మీసాలు. ఎరుపు రంగు బనీను, గళ్ళ లుంగీ కట్టుకున్నాడు. మెడలో పులిగోర్ల బంగారు నెక్లెస్.

4

రాడీ మస్తాన్ పేరు వింటే మద్రాసు నగరమే గజగజ లాడుతుంది. ఆరితేరిన హంతకుడు కూడాను.

"నేనే మస్తాన్‌ని! నావల్ల మీకేం సహాయం కావాలి?"

"టాప్ సీక్రెట్‌గా నువ్వో పని చేసిపెట్టాలి. అందుకు నువ్వు డిమాండ్ చేసినంత డబ్బు నేను యివ్వడానికి సిద్ధంగా వున్నాను."

"విషయమేమిటో చెప్పండి!" చుట్ట వెలిగించుకుంటూ అడిగాడు మస్తాను.

"మనోరమ అనే యువతిని నువ్వు హత్య చేయాలి?"

"మనోరమ ఎవరు?"

వివరాలు చెప్పాడు ఆనంద్.

"మనోరమ చేసిన నేరమేమిటి?"

"మనోరమ ఈ ప్రపంచంనుండి దూరమైపోవాలి. నీకు ప్రతిఫలం ముట్టాలి. హత్యకు కారణాలు అడక్కు."

"అయితే ఈ పని నేను చెయ్యను."

"కారణం చెప్పకుంటే హత్యలు చెయ్యవా?"

"అది నా అభిమతానికి విరుద్ధమైన పని."

"మిస్టర్ మస్తాన్!_ మనోరమను నేను ప్రేమించాను. ఆమె జగన్మోహన రూపసంపదను స్వంతం చేసుకోవాలని తియ్యని కలలు కన్నాను. ప్రణయ లోకంలో కోరికల మేడలను నిర్మించుకున్నాను. నవయౌవన తేజోరాశియైన మనోరమను నా ప్రణయదేవిగా, హృదయేశ్వరిగా, నా జీవితోద్యానవనంలో పూజాపుష్పంగా చేసుకోవాలని ఆశించాను.

నేను గొప్ప ఐశ్వర్యవంతుడ్నని నీకు తెలుసు. అనుభ వించడానికి లక్షలున్నాయి.

కాని మనోరమ నేనంటేనే మండిపడుతుంది. నన్ను మరిచిపొమ్మని కఠినంగా హెచ్చరించింది. నిన్న నేను చెయ్యి పట్టుకొన్న నేరానికి చెంపమీద కొట్టి నడి బజారులో నన్ను ఘోరంగా అవమానించింది.

బజారులో నన్ను అవమానించేసరికి నా హృదయం మండిపోయింది. నా ప్రేమ ద్వేషంగా మారిపోయింది. నన్ను ద్వేషించి నా ప్రేమను తృణీకరించి నన్ను అవమానపరచిన మనోరమ నాకు దక్కనప్పుడు_మనోరమను నేను బ్రతికుండగా మరెవ్వరికి దక్కనివ్వను. ఇది నా ప్రతిజ్ఞ!

అందుకోసమే మనోరమను ఈలోకం నుండి యమసదనానికి పంపించేవరకు నా హృదయం శాంతించదు. నాకు విశ్రాంతి లభించదు. ఆ అహంకారి చావాలి!_ఆ పని నీతో చేయించాలని నా ప్రాణమిత్రుడైన గణేష్‌తో నిన్ను పిలిపించాను. కారణం అర్థమైందిగా?"

"అర్థమైంది. అందుకు ప్రతిఫలం ఇరవైఅయిదు వేలు!"

"చాలా తక్కువగా అడిగావు. పని ముగిసిన తర్వాత వచ్చి కలుసుకో? అదనంగా, నా సంతోషానికి బహుమానంగా మరో పదివేలు యిస్తాను."

"చాలా సంతోషం! నాకు మూడురోజులు గడువు కావాలి. డబ్బు మొత్తం యిప్పుడే యిచ్చేయండి."

"డబ్బు తీసుకొని పని చెయ్యకపోతే?"

"మీకు నమ్మకముంటేనే ముందుగా డబ్బు యివ్వండి. లేకుంటే ఈ పనికోసం మరెవరినైనా చూసుకోండి!"

"నీ గురించి నేను చాలా విన్నాను. డబ్బు తీసుకొని హత్య చేయకుండా ఉండాయి నేస్తే?"

"మస్తాన్ ఏనాడూ అడితప్పినవాడు కాదు."

"కావచ్చు. కాని నేను మొత్తం ముందుగా యివ్వను."

"అయితే ఈ హత్య జరుగదు."

"నీవల్ల జరుగకుంటే నావల్లే జరుగుతుంది. మనోరమను నేనే హత్యచేసి నా కసి తీర్చుకుంటాను."

ఆ మాటకు మస్తాన్ వికటంగా నవ్వాడు.

"మీరా హత్య చెయ్యలేరు."

"నీతో అయ్యే పని నాకు ఎందుకు కాదు."

"నేను జరగనివ్వను."

"నిన్ను పిలిపించి వట్టి చేతులతో పంపించటం నా కిష్టంలేదు. ఈ వెయ్యి తీసుకొని ఈ విషయం యింతటితో మర్చిపో!"

"అక్కర్లేదు. శ్రమపడకుండా మీ బక్షీషులు తీసుకో డానికి ఈ మస్తాన్ డబ్బుకు మొగమాచి లేడు. డబ్బు సంపాదించే మార్గాలు నాకు అనేకం తెలుసు. గుడ్ బై!... శెలవ్." అంటూ మస్తాన్ విసవిసా వెళ్లాడు.

"ఆనంద్! మస్తాన్ కోపంగా వెళ్ళిపోతున్నాడు. మర్డర్ కాంట్రాక్ట్ కుదరలేదా?" అన్నాడు గణేష్ అప్పుడే అక్కడికి వచ్చి.

"డబ్బు ముందే అడిగాడు. పని జరిగిన తర్వాత యిస్తా నన్నాను. కుదరదని వెళ్ళిపోయాడు రాస్కెల్!" అన్నాడు ఆనంద్.

"ఆనంద్! నీ పనులేమిటో నాకు నచ్చడంలేదు. మనో రమ హత్య విషయం అతనితో కాంట్రాక్ట్ చేసి వదిలేశా వంటే అంతకంటే మూర్ఖత్వమైన పనిలేదు. రౌడీ మస్తాన్ సామాన్యమైన వాడు కాదు. అసాధ్యుడు. మనోరమను హత్యచేసి నీ పీలకమీదికి తెస్తే నీ బాధ ఆ దేవుడుకూడా

తీర్చలేదు. ఆనంద్ మిత్రుడివైన నీవు నేనిస్తున్న సలహా ఒక్కటే! జరిగిందంతా మరిచిపో! మనోరమ గురించి నువ్వింకేమీ ఆలోచించకు!"

"గణేష్! ప్రాణమిత్రుడివై నా హృదయంలో దావానలాన్ని నువ్వర్థం చేసుకోవడం లేదంటే అది నా దురదృష్టం! డియర్ గణేష్! మనోరమ విషయంలో నాకు నువ్వేమీ సలహాలు యివ్వద్దని కోరుతున్నాను ఎక్స్-క్యూజ్ మీ!—"

గణేష్ యింకేమీ చెప్పలేకపోయాడు.

## 2

రాత్రి 9 గంటలు దాటింది.

ఆనంద్‌కు నిద్ర రావడంలేదు. అనుక్షణం మనోరమ గురించే ఆలోచిస్తున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది. సిగరెట్‌ను ఆష్‌ట్రేలో పడేసి రిసీవర్ అందుకున్నాడు. విసుగ్గా "హాలో! ఎవరు?" అని అడిగాడు.

"హల్లో! డియర్ ఆనంద్! నేను మిస్. మనోరమను మాట్లాడుతున్నాను..."

మనోరమ తనకు ఫోన్ చెయ్యటం అతనికి ఆశ్చర్యం వేసింది.

"మిస్. మనోరమా! పిలిస్తే కసరుకొని చెంపదెబ్బ కొట్టావు. నలుగురిలో నన్ను అవమానం చేసి నా హృదయాన్ని క్షోభ పెట్టావు..."

"డియర్ ఆనంద్! నిన్న జరిగిందానికి నేనెంతో చింతిస్తున్నాను. నిన్ను బాధపెట్టినందుకు నేనెంతో కుమిలి

పోతున్నాను. అందుకే క్షమాపణ కోరడానికి వీలు కల్పించుకుని నీకు ఫోన్ చేస్తున్నాను.

ఆనంద్! నన్ను క్షమించు! నువ్వంటే నాకు ప్రేమలేక కాదు. నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. అప్పుడప్పుడు నా వెంటపడవద్దని, పలుకరించవద్దని, కనీసం నా వైపు చూడవద్దని హెచ్చరించడంలో నా ఉద్దేశ్యం - నీవు నన్నెంతగా ప్రేమిస్తున్నావో గ్రహించడానికి మాత్రమే!—

ఆనంద్!—యింట్లో అందరూ సెకండ్ షోకు వెళుతున్నారు. నాకు ఒంట్లో బాగాలేదని నిన్ను కలుసుకునే అవకాశం తీసుకున్నాను ఆనంద్! నీ ప్రియురాలు చేసిన తప్పును క్షమించు? వెంటనే బయలుదేరి వచ్చెయ్! నీ కోసం వాకిలి తెరిచివుంచి నిరీక్షిస్తుంటాను."

ఆనంద్ హృదయం ఆనందంతో పులకించిపోయింది. మనసు ప్రణయ లోకంలో స్వైరవిహారం చేసింది. "డార్లింగ్!... నేను యిప్పుడే రెక్కలు కట్టుకొని నీ ఎదురుగా వాలుతాను." రిసీవర్ క్రెడిల్ చేశాడు.

మనోరమ దివ్యమంగళ సుందర విగ్రహం ఆనంద్ కళ్ళలో నాట్యం చేయసాగింది. నేను ఎంత తొందర పడ్డాను. మనోరమను సరిగా అర్థం చేసుకోలేక ప్రేమను ద్వేషంగా మార్చుకున్నాను. ఆ కోమలి అవమానం చేసిందని డీప్ గా ఫీల్ అయి నా హృదయేశ్వరిని అన్యాయంగా హత్య చేయాలని తీర్మానించుకున్నాను. రౌడీ మస్తాన్ తో మర్డర్ కాంట్రాక్ట్ చేశాను. అదృష్టవంతుడ్ని గనుక కాంట్రాక్ట్ కుదరక రౌడీ మస్తాన్ వెళ్ళిపోయాడు.

ఆనంద్ వెంటనే మనోరమ ఇంటికి బయలుదేరాడు.

మనోరమ మంచంమీద పడుకొని వుంది.

"మనోరమా!—" ఆనంద్ ఆమె పడగ్గదిలో అడుగు పెడుతూ పిలిచాడు.

మనోరమ పలుకలేదు. కుడివైపుకు తిరిగి పడుకొనివుంది. పైకాలు ముడుచుకొని వుండటంవల్ల చీరకుచ్చెళ్లు మోకాళ్ళను ముద్దుపెట్టుకుంటున్నాయి. పిక్కలు పచ్చగా మెరుస్తున్నాయి. ఆమె జడలో తురుముకున్న మల్లెపూల సౌరభం గదిలో గుబాళిస్తోంది.

"మనోరమా! మై స్వీట్ హార్ట్!—" అంటూ ప్రేమోన్మత్తుడై మంచం దగ్గరికి వెళ్ళబోయాడు. కాని—

ఎర్రని రక్తం మంచం క్రిందనుండి కాలవై వస్తోంది. పచ్చి నెత్తురు! ఆ రక్తం చూసేసరికి అతని కళ్ళు తిరిగినట్లయింది.

"మనోరమా!...మనూ!!..." అంటూ కంగారుగా దగ్గరికి వెళ్ళాడు.

మనోరమ పలుకలేదు.

ఆమె భుజం పట్టుకొని యిటు త్రిప్పాడు. అంతే!—అదిరిపడ్డాడు ఆనంద్.

మనోరమలో చలనం లేదు. ఆమెను ఎవరో హత్య చేశారు. గుండెలో కత్తి పిడివరకు దిగబడి వుంది.

మనోరమ అప్పుడే హత్య చేయబడినట్లు అనిపించి అనాలోచితంగా కత్తిపిడిని పట్టుకొని పైకి లాగి ప్రక్కన పారేశాడు. చెయ్యి పట్టుకొని నాడి చూశాడు. మనోరమ ప్రాణాలు పోయాయి.

అతని ఆనందం పటాపంచలైంది. అనుకున్నదొకటి, జరిగిందొకటి! ఎవరైనా చూస్తే ఆ హత్య తనే చేసినట్లు

భావిస్తారు. అతనిలో కంగారు అధికమైంది. భయంతో అతనికి ముచ్చెమటలు పోశాయి.

ఆనంద్‌కు పిచ్చిపట్టినట్లయింది. అక్కడ వుండడం ప్రమాదం అనుకొని ఎలా లోపలికి వచ్చాడో అలాగే తిరిగి వెళ్ళిపోయాడు.

# 3

ఆనంద్‌కు నిద్ర పట్టడంలేదు. అనుక్షణం మనోరమ రూపం అతని కళ్ళముందు సాక్షాత్కరించి అతన్ని కలవర పెట్టసాగింది. మనసు వ్యధాపూరితమైంది.

తను మనోరమ విషయంలో చాలా తొందరగా ఒక నిర్ణయానికి వచ్చి ఆమెను హత్య చేయాలని రౌడీ మస్తాన్‌తో సంప్రదించడం చాలా పొరపాటనిపించింది. చేతులు కాలింతరువాత ఆకులు చుట్టుకొని ప్రయోజనం లేదు.

తను చెప్పినందువల్ల మస్తాన్ హత్య చేశాడనుకోడానికి అతను కాంట్రాక్ట్ రిఫ్యూజ్ చేసి వెళ్ళిపోయాడు. తను అతనికి డబ్బు ఇవ్వలేదన్న కోపంతో తనమీద ఆ నేరాన్ని త్రోసి జైలుకు పంపించి కక్ష సాధించాలని చేశాడా?

రాత్రి 1 గంట దాటింది. ఆనంద్‌కు కునుకు పట్టలేదు' అతని గది తలుపులు కిర్రుమన్నాయి.

తలెత్తి చూశాడు.

ఎదురుగా రౌడీ మస్తాన్ నిలుచున్నాడు.

అతని రౌద్రరూపం చూసి అదిరిపడి లేచి కూర్చున్నాడు ఆనంద్.

అతని గుండెలు ఎందుకో భయంతో దడదడలాడసాగాయి.

# 11

"మ...స్తా...న్! నువ్వా?"

"నేను యిక్కడికి ఎందుకొచ్చానని ఆశ్చర్యపడు తున్నావా? ఎలా వచ్చానని అబ్బుర పడుతున్నావా?... నీకీ రాత్రి నిద్ర పట్టదని నాకు తెలుసు. మనోరమ హత్య నిన్ను భయకంపితుడ్ని చేసివుంటుందని నేనూహించాను. ప్రియురాలి మరణం నిన్ను దుఃఖసంద్రంలో ముంచడం లేదు. ఆమె హత్య జరిగిన సమయం నువ్వక్కడికి ఎందుకు వెళ్ళావా అని భయపడుతున్నావ్. ఆనంద్!—రౌడీ మస్తాన్ ఎలాంటి మనిషో అర్థమైందా?"

"మనోరమను హత్యచేసి పారితోషికం తీసుకుపోవ డానికి వచ్చావా!"

"హత్యకు పారితోషికం!" అతను వికటంగా నవ్వాడు. "మనోరమను హత్యచేస్తే నేను అడిగిన ఇరవైఅయిదు వేలు కాక అదనంగా పదివేలు యిస్తానన్నావ్. నీ దుర దృష్టానికో, నా మంచికో డబ్బు యివ్వడానికి నిరాక రించావ్. ఈ మస్తానుని అవమానించి కోపం తెప్పిం చడం—కొరివితో తల గోక్కోవడమే అవుతుందని నీకు తెలియదు.

"ఆనంద్!—నేనెందుకు వచ్చానో చెబుతాను విను.

"మనోరమను నేనే హత్యచేసాను. ఎందుకు తెలుసా? మనోరమను నేనూ ప్రేమించాను. నా ప్రేమను నిరాక రించిన మనోరమను ఈ లోకంనుండి తప్పించడం మొదటి కారణం. ఆమెను హత్యచేసి, ఆ హత్యను నువ్వే చేశా వని ఎలిబీలు సృష్టించి నిన్ను హంతకుడ్ని చేయాలని రెండవ కారణం.

"కాని, నువ్వు హంతకుడివిగా ప్రపంచం ముందు, పోలీసులముందు నేరస్థుడిగా నిలువకుండా నేను చేస్తాను.

వెంటనే ఒక లక్షరూపాయలు యిచ్చెయ్! అన్ని ఏర్పాట్లు చేస్తాను.''

ఆనంద్ నివ్వెరబోయాడు.

''లక్షరూపాయలు నీకెందుకివ్వాలి!''

''నీ రహస్యం దాచినందుకు.''

''నేను మనోరమను హత్య చెయ్యలేదు. మనోరమను హత్య చేసిన హంతకుడివి నువ్వు. నువ్వే ఆ హత్యను చేశావని యిప్పుడే నిన్ను పోలీసులకు పట్టివ్వగలను. ఆ రిస్క్ నేను తీసుకోదలచలేదు. మర్యాదగా వెళ్ళు యిక్కడ్నించి.''

''ఆనంద్!_'' గది ప్రతిధ్వనించేలా అరిచాడు మస్తాన్. అతని నేత్రాలు కోపంతో చింతనిప్పులే అయ్యాయి. ఉద్రేకంతో ఒక్క దూకులో వచ్చి ఆనంద్ ముందు నిలుచున్నాడు.

''మర్యాద అనే పదానికి నీకు అర్థం తెలియదు. మర్యాదస్తులు ఎన్నటికీ నాలాంటి వాళ్ళతో మర్డర్ కాంట్రాక్ట్ చెయ్యరు. మర్యాద గురించి తర్వాత ఆలోచిద్దాం. ఇప్పుడు నాలో ఆగ్రహం తెప్పించినందుకు శిక్ష ఏమిటో తెలుసా? లక్షరూపాయలు. మొత్తం రెండు లక్షలకు ఒక పైసా తక్కువైనా తీసుకోను. లేకుంటే?—''

''లేకుంటే?''

''ఈ ఉద్రేకంలో నిన్ను గొంతు పిసికి చంపేసే శక్తి నాకుంది. నిన్ను చంపడంవల్ల నేను హంతకుడిగా పోలీసులకు చిక్కుతాననే భయం లేదు. కాని, నాకు రెండు లక్షలు నష్టమవుతుంది. నేను యింతా చేసింది డబ్బు కోసమే?''

"రెండులక్షలు కాదు; ఒక్క నయాపైసా నీకివ్వను. వెళ్ళు యిక్కడ్నుంచి!"

"నువ్వు నాకు యివ్వకపోయినా నాకు బాధలేదు. వెళ్ళేముందు నేను దాచిన రహస్యం ఏమిటో చెప్పి వెళ్తాను. తర్వాత ఈ రౌడీ మస్తాన్ ఎక్కడున్నాడోనని నన్ను వెతుక్కుంటూ నువ్వే వస్తావు."

"నీ దగ్గర నేనింకెప్పుడూ ఎటువంటి పరిస్థితిల్లోనూ రావడానికి ప్రయత్నించను. మనోరమను నేను హత్య చేయలేదు. ఆ హత్య గురించి భయపడవలసిన అవసరం నాకెంత మాత్రమూ లేదు. నేను మనోరమ యింటికి వెళ్ళి వచ్చానని ఆ హత్య నేనే చేసివుంటానని పోలీసులకు చెబుతావు. నేరం చేయని వాడు ఎవరికీ భయపడడు.

"ఆనంద్ అసలు విషయం తెలుసుకోక ముందే తొందరపడి మాట్లాడుతున్నావ్. ముందు ఈ పాకెట్ టేప్ రికార్డ్ ఆన్ చేస్తాను విను" అంటూ జేబులోంచి ఒక చిన్న టేప్ రికార్డర్‌ను బయటికి తీసి స్విచ్ నొక్కాడు అందులో—

'మస్తాన్ ఏనాడూ ఆడి తప్పినవాడు కాదు' అది మస్తాన్ కంఠస్వరం.

'కావచ్చు. కాని, నేను మొత్తం ముందుగా యివ్వను' ఆనంద్ స్వరం.

'అయితే ఈ హత్య జరగదు.'

'నీవల్ల జరకపోంటే నావల్లే జరుగుతుంది. మనోరమను నేనే హత్యచేసి నాకసి తీర్చుకుంటాను.'

టేప్ రికార్డర్ ఆఫ్ చేశాడు.

కంగారు పడిపోయాడు ఆనంద్.

"మిస్టర్! ఆనంద్! నీ భవిష్యత్తు నాశనం కావడానికి ఈ నాలుగు మాటలు చాలు. మనోరమను నేనే హత్య చేశాను. నేనే ఆ హత్య చేశానని పోలీసులు ఆధారాలు సంపాదించలేరు. మనోరమ గుండెలో దింపిన కత్తి పిడి మీద నా వ్రేలిముద్రలను శుభ్రంగా తుడిచేశాను. ఇప్పుడా కత్తి హత్యా ప్రదేశంలో పోలీసులకు దొరికింది. ఆ కత్తి పిడిమీద పోలీసులకు నీ వేలిముద్రలు దొరుకుతాయి.

నువ్వు హంతకుడివని ఋజువు కావడానికి వేరే సాక్ష్యం అక్కర్లేదు. ఈ టేప్... వేలిముద్రలు నిన్ను ఉరికంబం ఎక్కిస్తాయనడంలో సందేహంలేదు. నువ్వు నన్ను మనోరమను హత్య చెయ్యమని పంపించినట్లు నీ ప్రియమిత్రుడు గణేష్ సాక్ష్యం యివ్వగలడు.

"ఆనంద్! యిప్పుడు పోలీసులు మనోరమ యింటివద్ద మర్డర్ రిపోర్ట్ తయారుచేస్తున్నారు. హంతకుడి ఆచూకీ వారికి తెలియదు. నువ్వు మనోరమను హత్యచేసి ఎవరికీ కనబడకుండా పారిపోయివచ్చావని నేను వెళ్ళి ఫోన్ చేస్తాను. వెంటనే పోలీసులు వచ్చి నిన్ను అరెస్ట్ చేస్తారు. నీ గౌరవం, పరువు-మర్యాదలు మట్టిపాలవుతాయి. ఆల్ రైట్! నేను వెళ్ళొస్తాను" రౌడీ మస్తాన్ వెనక్కి తిరిగాడు.

ఆనంద్ కాళ్ళక్రింద నేల పాతాళానికి జారిపోతున్నట్లయింది.

భయాందోళనలతో ఒణికిపోయాడు.

"మస్తాన్!—అంతపని చెయ్యకు. నీకు రెండులక్షలు యిస్తాను. నా గురించి పోలీసులకు తెలుపకు. ఆ టేప్ నాకు యిచ్చెయ్!"

"ఇస్తాను. రెండు లక్షలు!...

"బ్యాంక్ చెక్ వ్రాసి యిస్తాను."

"ఆ పిచ్చి వేషాలు కట్టిపెట్టు. నాకు కాష్ కావాలి."

"అంత డబ్బు నాదగ్గర లేదు. ఒక్క రోజు గడువు చాలు బ్యాంక్‌నుండి డ్రాచేసి రేపు యిస్తాను."

"అయితే రేపే నిన్ను కలుస్తాను."

"అలాగే!"

"కాని ఒక్కమాట జ్ఞాపకముంచుకో! నా గురించి పోలీసులకుగాని, డిటెక్టివ్‌లకుగాని తెలియపరచి సహాయం అర్థించావంటే నీకు నీవై ఆపదలను కొని తెచ్చుకొన్న వాడివి అవుతావు. నా కోసం పోలీసులు అన్వేషిస్తున్నారనిగాని, డిటెక్టివ్‌లు పరిశోధిస్తున్నారనిగాని తెలిసిందంటే నిన్ను నిర్దాక్షిణ్యంగా ఖైమా చేస్తాను."

"అలా మూర్ఖంగా ప్రవర్తించి నా పీకలమీదికి తెచ్చుకోను. నీకు డబ్బు ముఖ్యం. నాకు ఆ లేవ్ ముఖ్యం."

"దట్స్ ఆర్ రైట్! రేపు రాత్రి 12 గంటలకు నేనే వచ్చి యిక్కడ నిన్ను కలుసుకుంటాను. కాష్ రెడీగా వుంచు" అని రౌడీ మస్తాన్ అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

# 4

"నా పేరు సుమతి. అజంతా యిండస్ట్రియల్ ఎస్టేట్ ప్రొప్రైటర్ ఆనంద్ భార్యను" అంది మిసెస్ సుమతి కన్నీళ్ళు తుడుచుకుంటూ.

ఇన్‌స్పెక్టర్ మనోహర్, సుమతి ముఖంకేసి చూశాడు.

సుమతి—ముఖం నిండా స్ఫోటకపు మచ్చలున్నాయి. అందవిహీనంగా కన్పిస్తోంది. సన్నగా, పొడుగ్గావుంది.

నూలు బట్టలు ధరించింది. శరీరంమీద బంగారు ఆభరణా లేవీ లేవు. ఒక ఐశ్వర్యవంతుని భార్య. మరీ సాధారణ స్త్రీగా కనిపించడం మనోహర్‌కు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

"కూర్చోండి! మీరెందుకు వచ్చారో చెప్పండి!" అన్నాడు మనోహర్.

"మీరు నా భర్తను కాపాడాలి."

"మీ భర్తకు వచ్చిన ఆపద ఏమిటి?"

"రౌడీ మస్తాన్ నా భర్తను బెదిరించి రెండు లక్షలు యివ్వమని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు."

"ఏ విషయం గురించి?"

"మిస్ మనోరమ హత్య గురించి."

మనోహర్ ఆశ్చర్యచకితుడయ్యాడు. ఆసక్తిగా ముందుకు వంగి సుమతికేసి చూస్తూ "మిస్ మనోరమ హత్యగురించి రౌడీ మస్తాన్ బ్లాక్ మెయిల్ చేయడమేమిటి? ఒక హత్యకేసులో అతనికి సంబంధం వుందని తెలిసి నిన్న మధ్యాహ్నం నేను అరెస్ట్ చేశాను! రౌడీ మస్తాన్ యిప్పుడు నా కస్టడీలోనే వున్నాడు. జరిగిందేమిటో అంతా వివరంగా చెప్పండి!" అన్నాడు మనోహర్ సిగరెట్ వెలిగించుకుంటూ.

"అజంతా ఇండస్ట్రియల్ ఎస్టేట్ మేనేజరు పరంధామయ్య కూతుర్ని నేను. ఆనంద్—నా సౌందర్యానికి ముగ్ధుడై నన్ను ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. నా దురదృష్టంవల్ల రెండు సంవత్సరాలక్రితం నాకు స్ఫోటకం పోసింది. ముఖంనిండా నల్లని మచ్చలు ఏర్పడి నన్ను అంద విహీనను చేశాయి.

"నా రూపం మారిపోవడంతో నా భర్త హృదయం-మనసు మారిపోయాయి. నన్ను అసహ్యించుకొని నన్ను అంటరానిదానిగా చేసి నాకు దూరంగా వుండసాగాడు. నాతో మాట్లాడ్డం మానివేశాడు. నా పడగ్గది వేరు చేశాడు. నావైపు కన్నెత్తి చూడ్డం మానివేశాడు. కట్టుకున్న భార్యను గనుక నాకు ఏ లోటు రాకుండా పోషిస్తున్నాడు.

"అప్పట్నుంచి ఆనంద్ స్త్రీ లోలుడుగా మారిపోయాడు. మిస్. మనోరమను ప్రేమించాడు. మనోరమ అందం ఆయనను పిచ్చివాడ్ని చేసింది. కాని, మనోరమ ఆనంద్ ను ప్రేమించలేదు. అతని ప్రేమను తృణీకరించింది. ఒకనాడు ఆనంద్ సాహసించి మనోరమ చెయ్యి పట్టుకున్నాడట. ఫలితం మనోరమ మా వారి చెంప ఛెళ్ మనిపించింది.

"దాంతో తనకు దక్కని మనోరమ మరెవ్వరికీ దక్క కూడదని, ఆమె చేసిన అవమానానికి ప్రతీకారంగా రౌడీ మస్తాన్ తో హత్య చేయించదలిచాడు. ఆనంద్ ఫ్రెండ్ గణేష్ రౌడీ మస్తాన్ ను పిలుచుకు వచ్చాడు. మర్డర్ కాంట్రాక్ట్ కుదరలేదు. నీతో కాకుంటే నేనే మనోరమను హత్య చేస్తానని ఆనంద్ చెప్పిన మాటలను రౌడీ మస్తాన్ టేప్ రికార్డ్ చేశాడు.

"ఆ రాత్రే మనోరమ నా భర్తను యింటికి రమ్మని ఫోన్ చేసింది. అవమానం చేసినందుకు క్షమాపణ కోరింది.

"ఆమె రమ్మని ఫోన్ చెయ్యగానే మనోరమ యింటికి వెళ్ళారు. కాని, మనోరమను రౌడీ మస్తాన్ హత్యచేసి పారిపోయాడు. కత్తిమీద వ్రేలిముద్రలను శుభ్రంగా

లియని ఆనంద్ ఆమె గుండె
రేశాడు. ప్రాణముందేమో
రణించిందని తెలిసి కంగా

ా!— ఆనంద్ వచ్చి పడు
మస్తాన్ ఆనంద్ దగ్గరికి
హత్య చేశానని చెప్పి ఆ
వు చెయ్యడానికి-క త్తిమీది
హత్య చేస్తానని చెప్పిన
—టేప్ రికార్డర్ ఆన్ చేసి

లినట్లయింది. ఆ రహస్యం
క్షులు యివ్వమని కోరాడు

అంత శాప్ లేక ఈ రోజు
రాడు."

చెయ్యాలో అర్థంగాక
గాథ, ఆవేదన నేను చూడ
న్ను ప్రేమించి ఆదరించక
బాంధవ్యాలు ఉంచుకోక
అతని క్షేమం కోరడం
గోసం ఆనంద్ కు తెలియ
తో చెప్పి నా భర్తను
అని చెప్పడం ముగించింది

ంతకు దెవడో అంతుచిక్క

లేదు మనోహర్ కు. కత్తిమీద వేలిముద్రలు ఎవరివో అను కున్నాడు. అనుమానించదగ్గ మనుషులెవరూ లేరు. అలాంటి తరుణంలో సుమతి మనోరమ హత్య గురించి చెప్పగానే మనోహర్ కు ఆశ్చర్యంతోబాటు కుతూహలం కలిగింది.

"మిసెస్ సుమతీ!—మీ భర్త మీతో మాట్లాడ్డం లేదన్నారు. ఈ చరిత్రంతా మీకెలా తెలిసింది?"

"రాడీ మస్తాన్ - మావారి మధ్య జరిగిన సంభాష ణంతా నేను చాటుగా వుండి విన్నాను."

"సరే—ఆ విషయం గురించి మీరేమీ దిగులు పెట్టుకో కండి. నేను అసలు హంతకుడ్ని పట్టుకోడానికి ప్రయత్ని స్తాను. మీరిక యింటికి వెళ్ళి నిశ్చింతగా వుండండి!"

"చాలా థ్యాంక్స్!" అంటూ సుమతి వెళ్ళిపోయింది.

## 5

"హంతకుడ్ని పట్టుకోడానికి మాకు సరియైన ఆధా రాలు లభించలేదు. కత్తిమీద వేలిముద్రలు దొరికాయి. కాని, ఆ వేలిముద్రలెవరివో తెలుసుకుంటే హంతకుడ్ని పట్టుకోవచ్చు! మీకు యెవరిమీదైనా అనుమానముంటే భయపడకుండా చెప్పండి!" అని అడిగాడు ఇన్ స్పెక్టర్ మనోహర్ మనోరమ తండ్రి శివకామయ్యను.

"నాకు యెవరిమీదా అనుమానం లేదు."

"హత్యకు కారణం?"

"తెలియదు. మీరే తెల్సుకోవాలి."

"మీ కూతురు హత్య కాబడిన రాత్రి మీరెక్కడ వున్నారు?"

"సెకండ్ షోకు వెళ్ళాను."

అంతలో ఓ అందమైన యువతి అక్కడికి వచ్చింది.
ఆ యువతిని చూసి ఆశ్చర్య చకితుడయ్యాడు మనోహర్. ఆ యువతి అంతా మనోరమలాగే వుంది. యెవరైనా మనోరమ హత్య కాబడలేదని ఆమె మనోరమ అని పొరబడ్డంలో సందేహం ఉండదు.

"నా కూతురు మంగళ. మనోరమ, మంగళ కవల పిల్లలు! మనోరమ పెద్దది" అని పరిచయం చేశాడు శివ రామయ్య.

"ఐ.సీ! చనిపోయిన మనోరమ బ్రతికొచ్చిందా అని పించింది నాకు. మంగళను చూస్తే మనోరమ హత్య కాబడ లేదనిపిస్తుందెవరికైనా. శివరామయ్యగారూ!_నేను నిన్న ఇక్కడికి వచ్చినప్పుడు మంగళ కనిపించలేదు. ఇంట్లో మనోరమ, మీరు తప్ప యెవ్వరూ లేరని నాతో చెప్పారు. మంగళ గురించి నాతో ఎందుకు చెప్పలేదు?"
"మంగళ నా దగ్గర లేదు, అరక్కోణంలో నా తమ్ముడు శివరామయ్య ఉన్నాడు. వాడికి పిల్లలు లేరు. అయిదేళ్ళ వయసులో మంగళను తీసుకువెళ్ళి పెంచు కుంటున్నాడు."

మంగళ కళ్ళల్లోంచి కన్నీళ్ళు కారుతున్నాయి.
"ఇన్‌స్పెక్టర్ గారూ! మా అక్కను యెవరో దారు ణంగా హత్యచేశారు. హంతకుణ్ణి పట్టుకుని ఉరికంబ మెక్కించాలి మీరు"అంది మంగళ గాద్గదికమైనస్వరంతో.

"నేను ఆ ప్రయత్నంలోనే ఉన్నానమ్మా. మీ అక్క హత్యకు కారణం మీరైనా ఊహించి చెప్పగలరా?"
"నేను ఊర్లోలేను. నాకేమి తెలియదు."
ఆనంద్ గురించి ఏమి చెప్పలేదు మనోహర్. ఆలోచిస్తూ

యింటి బయటికి వచ్చాడు. నిలబడి చూశాడు. శివరామయ్య ఇంటి ఎదురుగా ఓ వేపచెట్టు వుంది. ఆ చెట్టుక్రింద ఒక వృద్ధుడు కూర్చుని పాతకోటుకు అతుకులు కుట్టుతున్నాడు. చెట్టుకు ఆనుకొని పాత గుడ్డలు వుంచిన గోనెసంచి దాని ప్రక్కన మట్టికుండ, సిల్వర్ పళ్లెంవుంది.

శివరామయ్యకూడా బయటికి వచ్చి నిలుచున్నాడు. తండ్రివెంట మంగళ వచ్చింది. "శివరామయ్యగారూ! ఆ చెట్టుక్రిందవున్న ఆ వృద్ధుడు ఎవడు?" అని అడిగాడు సిగరెట్ వెలిగించుకుంటూ.

"ఎవరో ముష్టివాడు. పగలంతా ఎక్కడెక్కడో అడుక్కుంటూ రాత్రయ్యేసరికి ఆ చెట్టుక్రింద చేరుతాడు. ఆ చెట్టుక్రింద రాత్రంతా నిద్రపోయి ఉదయమే భుజానికి జోలె తగిలించుకొని భిక్షాటనకు బయలుదేరుతాడు. ఆగోనె సంచి, మట్టికుండ అక్కడే వుంటుంది."

"అతను ఆ చెట్టుక్రింద వుండబట్టి ఎన్ని రోజులైంది?"

"నాలుగైదు నెలలు కావస్తోంది."

"మరి ఈ రోజు భిక్షాటనకు వెళ్ళలేదేం?"

"ఒకొక్కసారి వెళ్లడు. ప్రొద్దుగ్రుంకిన తర్వాత ఆ కుండలో యిన్ని గింజలువేసి అన్నం ఉడుకబెట్టుకుని తిని అక్కడే పడుకుంటాడు."

మనోహర్ యింకేమీ అడుగలేదు. గేటు తెరుచుకొని బయటికి వచ్చాడు. నేరుగా వృద్ధుని దగ్గర వచ్చి నిలబడ్డాడు.

బూట్ల శబ్దం విని తలెత్తి చూశాడు వృద్ధుడు. అతనెదురుగా నిలుచున్నది పోలీసు ఇన్స్పెక్టర్ అని గ్రహిం

చాడు. కట్టుతున్న కోటును ప్రక్కన పడేసి దిగ్గున లేచి నిలుచున్నాడు. ఇన్‌స్పెక్టర్ తన దగ్గరికి ఎందుకొచ్చాడో నని భయపడుతూ చూడసాగాడు ఏమీ అర్థం కాక.

"నేనేం తప్పు చేయలేదు బాబూ!"

"నువ్వు తప్పు చేశావని ఎవరన్నారు? నీ పేరేమిటి?"

"మద్దయ్య."

"ఈ చెట్టు క్రింద నువ్వెన్ని రోజుల నుంచి నివాస ముంటున్నావ్?"

"నాలుగైదు మాసాలు కావస్తుంది బాబూ?"

"రాత్రిళ్ళు నువ్వు యిక్కడే పడుకుంటావా?"

"పడుకుంటాను బాబూ! కాని, చలికి, ఈగల బాధకు సరిగా నిద్రపట్టదు."

"నిన్న రాత్రి ఈ యింట్లో మనోరమ అనే అమ్మాయి హత్య కాబడింది."

"అవును బాబూ! ఆ అమ్మాయిగారు చాలా మంచిది. బయటికి వెళుతూ అప్పుడప్పుడు నాకు చిల్లర డబ్బులు యిచ్చిపోతుండేది. మంచివాళ్ళకు చావు త్వరగా వస్తుం దంటారు. అందుకే నేమో ననిపించింది బాబూ! నిజంగా నేను ఏడ్చాను బాబూ!"

"నిన్న రాత్రి 12 గంటల సమయంలో శివరామయ్య యింట్లోకి యెవరైనా వెళ్ళడంగాని, యింట్లోంచి బయటికి పరుగెత్తి వెళ్ళడంగాని చూశావా?"

"చూశాను... లేదు. నేను ఎవరినీ చూడలేదు" అన్నాడు కంగారుగా.

"మనోరమ మంచితనం గురించి చెప్పిన వాడివి ఆమె చావుకు కారణమెవరో చెప్పడం నీ ధర్మం. నిజం

చెప్పడంవల్ల నీకు వచ్చే ఆపద ఏమీలేదు. నిజం చెప్ప కుంటే నిన్ను తీసుకెళ్ళి జైల్లో వేస్తాను.''

''బా...బూ!?__'' కంగారుగా అన్నాడు మద్దయ్య. ''అంతపని చెయ్యకండి. నేను నిజమే చెబుతాను బాబూ మొదట యెవరో స్త్రీ—కళ్ళకు నల్లని గంతలు కట్టుకుని వచ్చి యింట్లోకి వెళ్ళింది, ఆమె యెవరో నాకు తెలియదు. నల్లని చీర కట్టుకుంది. అదేరంగు జాకెట్ వేసుకుంది. యింట్లోకి వెళ్ళి పదిహేను నిమిషాల్లో కంగారుగా బయ టికి తిరిగివచ్చింది. ఆమె తిరిగి వచ్చేసరికి ఒక టాక్సీ రోడ్ మీద రెడీగా నిలబడుంది. ఆమె నేరుగా వెళ్ళి టాక్సీ ఎక్కి కూర్చుంది. టాక్సీ డ్రైవరు ఆమెతో ఏమీ మాట్లాడకుండా స్టార్ట్ చేసుకుపోయాడు బాబూ!''

''నల్లని బట్టలు ధరించిన మనిషి స్త్రీ—అయ్యుంటుం దని నువ్వెలా గుర్తించావ్? నల్లటి డ్రస్ వేసుకుని మగాడే వచ్చాడేమో?''

''మగవాళ్ళు చీరకట్టుకొని జాకెట్ వేసుకోరు కదా బాబూ!''

''మనోరమ వేసిన చావుకేక నీకు వినిపించి వుండా లిగా?''

''లేదు బాబూ! నాకు కేకలేవీ విన్పించలేదు.''

''టాక్సీ నెంబరు చూశావా?''

''నంబరు చెప్పలేను బాబూ!''

''సరే తర్వాత నువ్వేం చూశావో చెప్పు!''

''అరగంట తర్వాత నల్లని సూటు వేసుకున్న మనిషి వచ్చాడు. గేటు త్రోసుకొని నేరుగా యింట్లోకి వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు మనిషి బాగా హుషారుగా కనిపించాడు.

పదినిముషాల్లో కంగారుగా బయటికి పరిగెత్తుకొచ్చాడు. అతని ముఖంమీద మునుపటి సంతోషం లేదు.''

అతను ఆనంద్ అయివుంటాడని భావించాడు మనోహర్.

''అతను కారులో వచ్చాడా?''

''అవును బాబూ! ఎర్రరంగు కారు. ఈ చెట్టుక్రిందే వుంచాడు. ఇంట్లోంచి వచ్చి కారు దగ్గరికి వచ్చాడు. నేను మేలుకొని ఉన్నానేమో వంగి నా ముఖంలోకి చూశాడు. అతను కారు దగ్గరికి వస్తున్నప్పుడే నేను మేలుకొని తనను చూసినట్లు అతను గమనిస్తే ఏం చేస్తాడోనన్న భయంతో కళ్ళకు చెయ్యి అడ్డం వుంచుకొని పడుకున్నాను. భగవంతుడు రక్షించాడు. నన్ను ఎవరూ చూడలేదు. అనుకుంటూ కారెక్కి వెళ్ళిపోయాడు బాబూ!''

మద్దయ్య చెప్పిన మాటలను బట్టి మనోరమను హత్య చేసింది ఒక స్త్రీ అయ్యుంటుందనే నిర్ధారణకు వచ్చాడు మనోహర్. మరి రౌడీ మస్తాన్ హత్యచేశానని చెప్పినట్లు సుమతి ఎందుకు చెప్పింది?

శివరామయ్య వచ్చాడు అక్కడికి.

''ఈ ముసలాడు ఏమైనా చెప్పాడా యిన్‌స్పెక్టర్ గారూ?''

''అతను నిద్రపోయాడట. తనకేమీ తెలియదంటున్నాడు.''

''ఏరా! నిజంగా నీకేమీ తెలియదా?'' శివరామయ్య అడిగాడు.

తను చెప్పిన వివరాలు ఎందుకు శివరామయ్యకు తెలియకూడదని యిన్‌స్పెక్టర్ అలా చెప్పాడని అర్థంచేసుకున్న మద్దయ్య—

"నాకేమీ తెలియదు బాబూ నేను నిద్రపోయాను. నాకేదైనా తెలిసివుంటే మీతో చెప్పనా బాబూ?" అన్నాడు ఎంతో వినయంగా మద్దయ్య.

# 6

ఇన్‌స్పెక్టర్ మనోహర్ శివరామయ్య యింటినుండి మోటర్‌బైక్ మీద బయలుదేరి ఆనంద్ బంగళాకు వచ్చాడు. ఆనంద్ యింట్లో లేడని తెలిసుకొని తిరిగి స్టేషన్‌కు బయలుదేరబోయాడు.

అప్పుడే బయట ఒక ఎర్రరంగు కారువచ్చి పోర్టికోలో ఆగింది.

ఆనంద్ కారు దిగి బంగళాలోకి ప్రవేశించబోయేసరికి అక్కడ ఎదురుపడ్డ ఇన్‌స్పెక్టర్ మనోహర్‌ను చూసి కాస్త కంగారుపడ్డాడు.

"ఇన్‌స్పెక్టర్! మీరు ఎవరికోసం యిక్కడ వెయిట్ చేస్తున్నారు" కంగారును కప్పిపుచ్చుకుంటూ కాస్త ధైర్యం తెచ్చుకొని అడిగాడు—మనోహర్‌కేసి ఆశ్చర్యంగా చూస్తూ.

"నేను మీకోసమే వచ్చాను. నేను ఎందుకు వచ్చానో చెబుతాను. ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పండి! మీరు యిప్పుడు ఎక్కడ్నించి వస్తున్నారు?"

"ఎస్టేట్ నుండి వస్తున్నాను."

"కాదు. మీరు బాంక్ నుండి వస్తున్నారు. బాంక్ నుండి రెండు లక్షలు డ్రాచేసి తెస్తున్నారు. మీచేతులో నున్న బ్రీఫ్ కేసులో రెండులక్షలుంది. అవునా?"

ప్రక్కలో బాంబు ప్రేలినట్లు అదిరిపడ్డాడు ఆనంద్.

"ఈ విషయం మీకెలా తెలుసు?"

"నేను క్రైం బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్‌ని. మీలాంటి వారు మా దృష్టిపథం నుండి తప్పించుకోలేరు. నాకా విషయం యెలా తెలుసన్న విషయం అప్రస్తుతం. మీరు రెండు లక్షలు ఎందుకు కాష్ చేసి తెచ్చారు?"

"మా ఎస్టేట్ వర్కర్స్‌కి జీతాలు యివ్వాలి."

"ఈరోజు ఫస్టు తారీఖు కాదు—జీతాలు యివ్వటానికి. ఈ దినం తేదీ 23. 23న తేదీని మీరు ఎస్టేట్ వర్కర్స్‌కు జీతాలిస్తారా?"

"ఫెస్టివల్ అడ్వాన్సు అడిగారు వర్కర్లు."

"అబద్ధమాడితే అతికినట్లుండాలి. మరో నెలదాకా ఏ ఫెస్టివల్స్ లేవు. అబద్ధాలు విడిచిపెట్టి అంత డబ్బు ఎందుకు కాష్ చేశారో చెప్పండి!"

ఆనంద్ వెంటనే సమాధానం యివ్వలేదు.

"మిస్టర్ ఆనంద్! మీరంత డబ్బు ఎందుకు తెచ్చారో నాకు తెలుసు. రెండు లక్షలు కాదు; రెండు కోట్లు మీరు ఖర్చుపెట్టినా 'నేను నిర్దోషిని!'—అన్న ధీమాతో మీరు బ్రతకలేరు. నేరపరిశోధకుల చేతులు చాలా పొడవైనవి, దోషులు ఎక్కడ ఏ రూపంలో దాగినా వెడలి పట్టుకుంటాయని మీకు తెలియదు కాబోలు."

"మీ మాటలు నాకేమీ అర్థం కావడంలేదు."

"నా ముందు మీ నటనాచాతుర్యం రాణించదు. మిస్. మనోరమను హత్యచేసిన నేరానికి మిమ్మల్ని అరెస్ట్ చేస్తున్నాను. ఇదిగో! అరెస్ట్ వారంట్!"

ఆనంద్ నెత్తిమీద ఉరుములేని పిడుగు పడినట్లయింది.

"ఇన్‌స్పెక్టర్ గారూ! నేను ఇప్పుడు ఏం చెప్పినా

మీరు వినరని నాకు తెలుసు. హత్యాయుధం మీద నా వేలి ముద్రలు మీకు లభించవచ్చు. కాని, నేను మనోరమను హత్యచేయలేదు. నేను వెళ్ళే సరికి మనోరమను ఎవరో హత్యచేసిపోయారు. మనోరమ గుండెలో కత్తి పిడివరకు దిగబడి నాకు కనబడింది. నేనా ఘోరదృశ్యాన్ని చూడ లేకపోయాను. మనోరమ ప్రాణాలు పోయాయని తెలిసి యుంటే ఆ కత్తిని ముట్టుకునే వాడిని కాదు."

"మిస్టర్ ఆనంద్!_మీ మిసెస్‌తో నేను మాట్లాడాలి' పిలిపించండి."

"అలాగే!__అప్పన్నా! అప్పన్నా!"

"ఏమిటి బాబూ!" అప్పన్న వచ్చి అడిగాడు.

"సుమతిని యిన్‌స్పెక్టర్ గారు పిలుస్తున్నారని పిలు చుకురా?"

"అమ్మగారు యింట్లో లేరు బాబూ!"

"ఎక్కడికి వెళ్ళింది?" కోపంగా అడిగాడు ఆనంద్'

"మీరు ఉదయం 10 గంటలకు బాంక్‌కు వెళ్ళగానే అమ్మగారు టాక్సీలో ఎక్కడికో వెళ్ళారు. ఇంతవరకూ రాలేదు బాబూ!"

టైం చూశాడు ఆనంద్. ఆరు గంటలు కావస్తోంది.

"ఎన్నడూ బయటికి వెళ్ళని సుమతి ఈ రోజు యింత సేపు ఎక్కడికి వెళ్ళింది. ఎక్కడికి వెళ్ళిందో నీతో చెప్ప లేదా?"

"ఎవరో స్నేహితురాలు ఫోన్ చేసిందట. అర్జంటుగా వెళ్ళి వెంటనే తిరిగి వస్తానని చెప్పి వెళ్ళారు బాబూ!"

అంతలో డ్రాయింగ్ రూంలోని టెలిఫోన్ మ్రోగింది.

"బాబూ!__ఫోన్ కాల్!" అన్నాడు అప్పన్న.

"ఇన్‌స్పెక్టర్ ప్లీజ్...ఒన్ మినిట్!..." అంటూ ఆనంద్ డ్రాయింగ్ రూంలోకి వెళ్ళి రిసీవర్ ఎత్తి "హలో!...ఆనంద్ హియర్ ... మీ రెవరు?" అని అడిగాడు.

"మిస్టర్ ఆనంద్! రెండు లక్షల విషయం ఏం చేశావ్?"

"నా గుట్టు పోలీసులకు తెలిసింది. నువ్వు చాలా తొందర పడ్డావు. నా గుట్టు బయట వేశాక నీకు నేను డబ్బు ఎందుకివ్వాలి?...నా అదృష్టం ఎలా రాసివుందో అలాగే జరుగుతుంది. నేను డబ్బు యివ్వను."

"ఫూల్! తొందరపడింది నీ విషయం బయట వేసింది నేను కాదురా సన్నాసీ! నీ అర్ధాంగి సుమతి."

"సుమతి అంత పని చేస్తుందంటే నేను నమ్మను. సుమతి అలా ఎందుకు చేస్తుంది?"

"ప్రపంచంలో సుమతికంటే మించిన సౌందర్యవతి లేదని ప్రేమించి పెళ్ళి చేసుకున్నావు. దాని కర్మకాలి దానికి అమ్మవారుపోసి అందం వికృతమైంది. ఆ వికృత స్వరూపిణిని నువ్వు తృణీకరించావ్. ఆ అనాకారితో మాట్లాడడంమాని పరాయి ఆడాళ్ళకోసం ప్రాకులాడావు. ఆమె అందం చెడినా యవ్వనం కరిగిపోలేదు. కోరికలను చంపుకొని ఏ స్త్రీ ఎన్నాళ్ళు సహిస్తుంది? అందుకోసమే — నిన్ను ఎదురుగా వుంచుకొని గుటకలు మింగుతూ జీవితం అడవిగాచిన వెన్నెల చేసుకోవడం కంటే—నిన్ను తన చూపుకు అందనంత దూరంలో పంపించెయ్యాలనే అభిప్రాయంతో నీ గుట్టు పోలీసులకు తెలియజేసింది. అండర్‌స్టాండ్ మిస్టర్!—"

"షటప్! యూ స్కౌండ్రల్! — నా భార్య సుమతి గురించి ఎవరేం చెప్పినా నేను నమ్మను. నేను సుమతిని నిరాదరణ చేసినా నన్నే తన భర్తగా ఆరాధిస్తోంది. నన్ను తన హృదయపీఠంపై అధిష్ఠించి పూజిస్తుందని నాకు తెలుసు. నా బాధను తెలుసుకొని నీలాంటి రాక్షసుల బారినుండి నన్ను రక్షించాలనే ఉద్దేశ్యంతో ఈ విషయాన్ని నాకు తెలియకుండా పోలీసులకు చెప్పి వుంటుందిగాని—దురుద్దేశ్యంతో కాదు.

"పోలీసులు నన్ను అరెస్ట్ చేశారు. ఇక డబ్బుమీద ఆశ వదులుకో!—నా అదృష్టం మంచిదైతే ఏనాటికైనా మనోరమను హత్యచేసిన నిన్ను పోలీసులు పట్టుకోక మానరు."

"మిస్టర్ ఆనంద్!—నీలాంటి వారిని యెలా లొంగదీయాలో నాకు తెలుసు. అందుకోసమే నీ భార్య సుమతిని నా అతిధిగా బంధించాను."

"ఆఁ!!—నా భార్యను బంధించావా?"

"తెల్లారేలోగా నాకు డబ్బు ముట్టకుంటే నీ భార్య వుండదు."

"దుర్మార్గుడా! నా భార్య నీకేం అపకారం చేసింది?"

"నాకు రెండు లక్షలు అందకముందే మనోరమ హత్య రహస్యం యిన్స్పెక్టర్ మనోహర్‌తో చెప్పింది. అందుకే సుమతిని వెంబడించి కిడ్నాప్ చేశాను."

వెనుక నిలబడి సంభాషణంతా విన్న మనోహర్ రిసీవర్ పెట్టెయ్యమని సౌంజ్ఞ చేశాడు.

ఆనంద్ రిసీవర్ పెట్టేశాడు.

"మిస్టర్ ఆనంద్! మీ భార్య సుమతి గురించి మీరేమీ

భయపడకండి. తెల్లారేలోగా మీ భార్యను నేను రక్షిస్తాను. మీరు నా వెంట స్టేషన్‌కు రండి."

"నేను మనోరమను హత్య చెయ్యలేదు. నన్నెందుకు అరెస్టు చేస్తున్నారు?"

"హంతకుడు దొరికేవరకు మీరు మా కస్టడీలోనే వుండాలి. బెయిల్ కోసం ప్రయత్నించకండి! తెల్లారేలోగా ఈ కేసును నేను పరిష్కరిస్తాను."

ఆనంద్ యింకేమీ చెప్పకుండా మనోహర్‌ను అనుసరించాడు.

# 7

మనోహర్ గేటు తెరుచుకుని మనోరమ యింటికి వెళ్ళాడు. ఇంటికి బీగం వేసివుంది.

చెట్టుక్రిందికి వచ్చాడు మనోహర్. మద్దయ్య నిండా కప్పుకొని కూర్చొని బీడీ దమ్ము కొడుతున్నాడు.

"మద్దయ్యా"—

మనోహర్‌ను గుర్తించి త్రాగుతున్న బీడీని అవతల పారేశాడు. "ఏమిటి యిన్‌స్పెక్టర్ బాబూ!" అని అడిగాడు లేవబోతూ.

"ఫరవాలేదు కూర్చో! ఇందా సిగరెట్! కాల్చు!" అని సిగరెట్ తీసియివ్వబోయాడు.

"వద్దు బాబూ!"

"నన్ను చూసి త్రాగుతున్న బీడీని పారేశావుగా! అందుకోసం సిగరెట్ యిస్తున్నాను. మళ్ళీ కాల్చకుందువు గాని" అని సిగరెట్ యిచ్చి "మద్దయ్యా! శివకామయ్య యింటికి బీగం వేసివుంది. ఆమె కూతురు మంగళ కూడా యింట్లో లేనట్లుంది. వీళ్ళిద్దరూ యెక్కడికి వెళ్ళారు?"

"ఎక్కడకు వెళ్ళారో తెలియదు బాబూ!"

"ఎంతసేపయింది వెళ్ళి?"

"అర్ధగంట అయింది బాబూ!"

"టాక్సీలో వెళ్ళారా?"

"ఇద్దరు నడిచే వెళ్ళారు బాబూ!"

అయితే ఆ యిద్దరు ఎక్కడికి వెళ్ళివుంటారు?... అని తనను తాను ప్రశ్నించుకొని సిగరెట్ కాలుస్తూ ఆలోచించసాగాడు మనోహర్.

"బాబుగారూ! మీకో విషయం చెప్పడం మరిచి పోయాను."

"ఏమిటి?"

"చీకటి పడింతరువాత శివరామయ్య ఎక్కడినుండో టాక్సీలో వచ్చాడు. గోనెసంచిలో గట్టిగా బిగించిన మూతను టాక్సీలోంచి దించి తనే యింట్లోకి ఎత్తుకు పోయాడు. మూట కదులుతుంటే అలాగే తంటాలుపడి లోపలికి తీసుకెళ్ళాడు. అప్పుడు నేను చెట్టుక్రింద లేను బాబూ! ఊళ్ళోకి వెళ్ళి అన్నం పెట్టించుకుని వస్తూ ఆ ఇంటి వెనకాలనుంచి గమనించాను. టాక్సీ వెళ్ళిపోయిం తరువాత యిక్కడికి వచ్చాను."

ఆ మూటలో శివరామయ్య ఏం తెచ్చాడో అతనికి అర్థమైంది.

మధ్యాహ్నం తనకు రిపోర్ట్ చేయడానికి వచ్చిన సుమ తిని, తిరిగి ఇంటికి వెళ్ళేటప్పుడు హంతకుడు ఆమెను కిడ్నాప్ చేసి ఎక్కడో దాచివుంచాడు. సాయంత్రం ఆనంద్‌కు ఫోన్ చేసింతరువాత సుమతిని మూటలో బిగించి యిక్కడికి చేర్చి వుంటాడు.

సుమతిని లోపల వుంచి ఇంటికి బీగం వేయడంవల్ల ఆ యింట్లో యెవరూ లేరని అనుకోడానికి సుమతిని ఈ యింట్లో చేర్చి వుంటాడని ఊహించిన మనోహర్ వెంటనే మనోరమ యింటి దగ్గరికి వచ్చాడు.

రివాల్వర్‌తో బీగం బ్రద్దలు కొట్టాడు. లోపలికి ప్రవేశించాడు. గదులన్నీ వెదికాడు. సుమతిగాని, గోనెసంచి మూటగాని కనిపించలేదు.

పడగ్గదిలో మంచం క్రింద మనిషి మూలుగు వినిపించింది. వంగి మంచం క్రిందికి చూశాడు. సుమతి కాళ్ళు చేతులు బంధింపబడి వుంది. నోటికి అంటించిన ప్లాస్టర్ లూజు కావడంతో మూలుగు వినిపించింది.

మంచాన్ని పైకి లేపి సుమతి కట్లు ఊడదీశాడు మనోహర్. నోటికున్న టేప్ పెరికేశాడు.

సుమతి నిస్సహాయంగా మనోహర్ వైపు చూసింది. వెంటనే మాట్లాడలేకపోయింది. మంచినీళ్ళు కావాలంటూ చేత్తో సౌంజ్ఞ చేసింది. అక్కడే కూజాలో వున్న నీళ్ళు గ్లాసులో ఒంచి, తెచ్చి యిచ్చాడు. నీళ్లు త్రాగింది సుమతి.
అయిదు నిమిషాలకు నోరు విప్పి మాట్లాడగలిగింది సుమతి.

* * *

"మిస్టర్ గణేష్!... మనోరమను హత్యచేసింది నీవు, నీ ప్రియురాలు మంగళ. నౌ యు ఆర్ అండర్ అరెస్ట్!" అన్నాడు మనోహర్ గంభీరంగా.

"ఇన్‌స్పెక్టర్! వాట్ ఆర్ యూ టాకింగ్?" దిమ్మెరబోయి అడిగాడు గణేష్.

"నువ్వు హంతకుడివి!... బ్లాక్ మెయిలర్‌వి!!"

“ఆనంద్ నా ప్రాణస్నేహితుడు! నేను అతని ఎస్టేట్‌లో సూపర్‌వైజరుగా పనిచేస్తున్నాను. అతని క్షేమం కోరేవాడిని!... నేను మనోరమను హత్య చేయించి వాడిని బ్లాక్ మెయిల్ చేస్తానా?...

“నిన్ను ప్రాణస్నేహితుడిగా భావించాడు కనుక నీకు తన ఎస్టేట్‌లో ఉద్యోగమిచ్చి ఆదరించాడు. తన రహస్యాలన్నీ నీతో చెప్పాడు. మనోరమమీద కోపంతో ఆమెను హత్య చేయించాలని, ఎవరితో ఆ పని జరుగుతుందని నిన్ను సలహా అడిగాడు.

డబ్బుకోసం గడ్డి కరిచే మనిషివి నువ్వు! అవకాశం దొరికింది కదా అని రహస్యంగా ఒక పాకెట్ సైజు టేప్ రికార్డర్ సంపాదించావ్. మనోరమను హత్య చేయించడానికి రౌడీ మస్తాన్‌ను కాంట్రాక్ట్ చేయించావ్. పని జరిగేవరకు డబ్బు యివ్వనని చెప్పమని ఆనంద్‌తో అన్నావ్. ఆనంద్ మస్తాన్‌తో అదేమాట చెప్పాడు. మస్తాన్ అందుకు అంగీకరించలేదు.

మస్తాన్ నిరాకరించిన తొందర్లో కోపంమీద ఆ హత్య నువ్వు చెయ్యకుంటే నేనే చేస్తానని అన్నాడు ఆనంద్. అమాయకుడైన ఆనంద్‌కు తెలియకుండా ఆ మాటలను టేప్ రికార్డు చేశావ్.

మనోరమ చెల్లెలు మంగళను నువ్వు ప్రేమించావ్. మంగళకు మనోరమ అంటే పడదు. ఆనంద్ రహస్యం మంగళతో చెప్పావు. అక్క మీద కసి తీర్చుకోవడానికి ఆస్థి అంతా పొందడానికి మంగళకు మంచి అవకాశం దొరికింది.

ఆ మధ్యాహ్నమే నేను రౌడీ మస్తాన్‌ను అరెస్ట్ చేసిన విషయం నీకు తెలియదు. మంగళతో ఆ హత్య చేయించావు. వెంటనే రౌడీ మస్తాన్‌లా తయారై ఆనంద్ ఇంట్లో ప్రత్యక్షమయ్యావు. నిన్ను చూసి మనోరమను మస్తాన్ హత్యచేసి తనతో బ్లాక్ మెయిల్ చేస్తున్నాడని ఆనంద్ అనుకున్నాడేగాని-నువ్వే మస్తాన్ వేషంలో వచ్చావని అతనికి తెలియదు.

"మీ సంభాషణంతా చాటుగా వుండి విన్న సుమతి, తన భర్తను కాపాడుకోడానికి అతనికి తెలియకుండా వచ్చి నాకు రిపోర్ట్ ఇచ్చింది. ఆ విషయం నీవు గమనించావు. ఆమె యింటికి వెళుతున్న సమయం చూసి ఎలాగో మోసంచేసి సుమతిని కిడ్నాప్ చేశావ్. సాయంత్రం-రెండులక్షలు యివ్వకుంటే ఆమెను ఈ లోకంనుండి దూరం చేస్తానని ఆనంద్‌కు ఫోన్ చేశావ్. అప్పుడు నేను అక్కడే వున్నాను."

"మస్తాన్ జైల్లో వున్నాడు. ఆనంద్ - మస్తాన్‌తో మర్డర్ కాంట్రాక్ట్ చేసిన విషయం నీకు తప్ప మరెవ్వరికీ తెలియదు. కనుక, బ్లాక్ మెయిలర్ నువ్వే అయివుంటావని భావించాను.

నీమీద నాకు పూర్తిగా అనుమానం కలిగింది. నువ్వు మనోరమ యింటిదగ్గర ప్రియురాలు మంగళతో ఉంటావని అక్కడికి వెళ్ళాను. ఇంటిదగ్గర బీగం వేసుంది. మధ్దయ్య వల్ల నాకు ముఖ్య విషయం తెలిసింది. వెంటనే బీగం బ్రద్దలుచేసి, పడగ్గదిలో కాళ్ళు చేతులు బంధించి, అరవకుండా నోటికి ప్లాస్టర్ అంటించి నిస్సహాయస్థితిలో పడి

వున్న సుమతిని రక్షించాను. అంతేకాదు. మీరు స్టోర్ రూమ్‌లో బంధించిన శివరామయ్యను కూడా రక్షించాను. మిస్టర్ గణేష్!......'' అని మనోహర్ ఏదో చెప్పబోతుంటే మధ్యలో కలుగజేసుకొని గణేష్—

''...ఇన్‌స్పెక్టర్! సుమతిని, శివరామయ్యను మీరు రక్షించారా!''

''అవును. వారిద్దరి సాక్ష్యంవల్ల నే మంగళను అరెస్ట్ చెయ్యడం జరిగింది. రౌడీ మస్తాన్‌లాగా, శివరామయ్యలాగా చాలా చక్కగా నటించావు. ఇక పద'' అంటూ బయటికి నడిచాడు ఇన్‌స్పెక్టర్.

_: ఐ పో యిం ది :-

# ముగ్గురు అనుమానస్థులు!

## అజీజ్

"ఎస్! ఇన్ స్పెక్టర్ రాజారెడ్డి స్పీకింగ్!"

"నమస్తే! నేనండి అపర్ణాదేవిని...గుర్తున్నానా?"

"ఓ, మీరా! నమస్తే, గుర్తులేకేం? అంతా క్షేమమేనా?"

"ఆఁ, వారు పోయేక ఏదో ఇలా బ్రతుకీడుస్తున్నాం. ఉన్న ఒక్క కొడుకూ అప్రయోజకుడయ్యేడు. వాడలా తయారవడానికి ముఖ్యంగా నేనే కారణం లెండి. అతి గారాబం!...

మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలని, క్రయింబ్రాంచ్ హెడ్ క్వార్టర్స్‌కి ఫోన్ జేస్తే, మీరు ప్రస్తుతం డ్యూటీలో లేరనీ, నెల రోజులు సెలవు పెట్టి

ఇంట్లో విశ్రాంతి తీసుకుంటున్నారనీ తెలిసింది. నా అదృష్టం బావున్నట్టుంది. తిన్నగా ఇంటికే వచ్చి మీతో మాట్లాడతాను. తీరిగ్గావున్నారా?"

"ఔను! రండి. ఎదురు చూస్తుంటాను."

"థాంక్స్!" అవతల క్లిక్‌మంది.

రిసీవర్ క్రెడిల్ చేసి, సిగరెట్ అంటించేను. అపర్ణాదేవి కుటుంబంతో నాకు పాతపరిచయం వుంది. ఆవిడ భర్త పేరు జగపతినాయుడు. జమీందారీ వంశం! ఒకప్పుడు వనపర్తి చుట్టుపక్కల వాళ్ళకి పెద్ద జాగీరు ఉండేది. స్వాతంత్రం వచ్చేక జమీందారీ గట్రా పోవడంతో, మద్రాసుకి మకాం మార్చేరు.

మద్రాసు వచ్చేక, కొన్ని పరిశ్రమల్లో భాగస్వామిగా చేరి బాగానే బ్రతికేడు జగపతినాయుడు. నాలుగేళ్ళ క్రితం గుండెజబ్బుతో హఠాత్తుగా కన్ను మూసేడు. దాంతో అతని భార్యాబిడ్డల జీవితాలు కాస్త సపల్చబడ్డాయి. దానికి కారణం, ఉన్న ఒక్క కొడుకూ తండ్రిలా వ్యాపారదక్షుడు కాకపోవడమే...

బైట కారాగిన చప్పుడు వినిపించి, లేచి తలుపువైపు నడిచేను. భుజాలమీద నీలిరంగు కాశ్మీరు శాలువా కప్పుకుంటూ కారు దిగుతోంది అపర్ణాదేవి. నలభైఏళ్ళు దాటి వుంటాయి ఆవిడికి. ఐనా, ఎర్రగా, నిండుగా కనిపిస్తుంది.

నన్ను చూడగానే పలకరింపుగా నవ్వింది. సాదరంగా ఆహ్వానించి లోనికి తీసికెళ్ళాను.

"మీ సెలవు ఇంకా ఎన్నాళ్ళుంది?" అడిగింది సోఫాలో కూర్చుంటూ.

నవ్వి—"పన్నెండు రోజులు మిగిలేయి" అన్నాను.

"హమ్మయ్య! ఇహ పర్వాలేదు. మీమీద పెద్ద భారం వెయ్యబోతున్నాను - కాదనరనే నమ్మకంతో!" అంది అసలు విషయానికి వస్తూ.

"చెప్పండి నాకు పనిలేక తోచడంలేదు," అన్నాను నవ్వుతూ.

అపర్ణాదేవి చెప్పసాగింది. "వారున్నంత కాలం మాకే లోటూ లేకుండా గడిచింది. వారు పోయాక గానీ మా బ్రతుకులు ఎలా వెళ్ళమారతాయో తెలిసిరాలేదు. అడపా దడపా విలువైన వస్తువులు అమ్ముతూ ఇంతవరకూ నెట్టుకొచ్చేను.

ఈ మధ్య డబ్బుకి మరీ కటకట ఏర్పడింది. నా పెళ్ళికి మావాళ్ళు పెట్టిన నగలు యింకా అట్టేవున్నాయి. వాటిలో అత్యంత విలువైన ఒక వజ్రాల హారంవుంది. దాని ఖరీదు పదిలక్షలు.

ఆ హారం అమ్మి, వచ్చే డబ్బుతో పాట్నర్‌షిప్ లేకుండా ఏదైనా మంచి బిజినెస్ ప్రారంభించాలని వుంది. మా వాడు ఇప్పుడిప్పుడే దారికి వస్తున్నట్టున్నాడు. అంత ఖరీదుగల హారం కొనే కస్టమర్ సులభంగా దొరకడు కదా? అందుకే, బ్రోకర్లద్వారా ఆరా తీయించి ఓ కస్టమర్ని పట్టేను.

అతని పేరు సేఠ్ బన్సీలాల్. ఇక్కణ్ణించి ఇరవై మైళ్ళ దూరంలో కన్ననూర్ అనే సిటీ వుంది. అక్కణ్ణించి నాలుగుమైళ్ళ దూరంలో విడంబూర్ అనే చిన్న ఊరు వస్తుంది. అక్కడుంటాడు బన్సీలాల్. అక్కడతనికి అభ్రకం గనులున్నాయి. ఆ పని మాసుకుంటూ అక్కడే నివాసం ఏర్పరచుకున్నాడతను.

బ్రోకర్లద్వారా మా హారం సంగతి విని, దాన్ని చూడ్డానికి ఓ రోజు ఇక్కడికి వచ్చేడు. చూసేడు. బేరం పెడితే, ఎనిమిది లక్షలకి చిల్లికానీ ఎక్కువియ్యనని, కరాకండీగా చెప్పేసేడు. ఎంత అవసరమున్నా చూస్తూ పది లక్షల హారాన్ని ఎనిమిది లక్షలకివ్వడానికి నా మనసొప్పక ఇవ్వనన్నాను. సరేనని వెళ్ళిపోయేడు.

మళ్ళీ ప్రయత్నించేను, మరో కస్టమర్ కోసం. అంత ఖరీదు పెట్టి హారం కొనే నాథుడే కనిపించలేదు. చివరికి విసుగెత్తి, ఎనిమిది లక్షలకి ఆ బన్సీలాల్ కే అమ్మడానికి నిశ్చయించేను.

ఓ రోజు ట్రంకాల్ చేసి, ఆ సంగతే చెప్పేసరికి, తనిప్పుడు పనుల్లో తీరిక లేకుండా ఉన్నాననీ, హారంకోసం మద్రాసు రాలేననీ, నేనే ఎవ్వరితోనైనా హారం పంపి డబ్బు తెప్పించుకోమనీ చెప్పేడు.

ఈ రోజుల్లో ఎవర్ని నమ్మేది? అంత విలువైన వస్తువు ఆ మారుమూలకి ఎవ్వరిచేత పంపాలబ్బా అని తీవ్రంగా ఆలోచించేను. మీరు జ్ఞాపకం వచ్చేరు. మీరే నాకీ సహాయం చేసిపెట్టాలి'' అంది అపర్ణాదేవి ప్రాధేయ పడుతూ.

''మీకు నామీదవున్న నమ్మకానికి థాంక్స్! ఇదేమంత పెద్ద సహాయం కాదు. ఇలా వెళ్ళి అలా తిరిగి రావచ్చు. ఎప్పుడు బైలుదేరమంటారు?''

''ఏ శుభకార్యానికైనా తిథీ, నక్షత్రం చూడాలంటారు. చూసేను. ఈరోజు మంచిదట. సెంట్రల్ స్టేషన్ నించి మధ్యాహ్నం పన్నెండు గంటలకి కన్ననూర్ వెళ్ళే ట్రేన్ వుంది. కన్ననూర్ నించి టాక్సీ తీసుకుని విడంబూర్

వెళ్ళవచ్చు. మళ్ళీ రేపు తిరిగి రావచ్చు. హారంకూడా వెంట తెచ్చేను'' అంటూ కాలువాలోంచి మెత్తని మఖమల్ పెట్టి ఇవతలికి తీసింది అపర్ణాదేవి.

అందుకుని తెరిచిచూసేను.

కళ్ళు జిగేల్‌మన్నాయి!

పాతకాలపు అద్భుతపనితనం గల వజ్రాల హారం అది.

పెట్టెమూస్తూ—''ఆల్ రైట్! వెళతాను మీరు నిశ్చింతగా వుండండి'' అన్నాను.

## 2

మధ్యాహ్నం మూడు గంటలకి కన్ననూర్ స్టేషన్‌లో బండి దిగేను.

బ్రీఫ్‌కేస్ అందుకుని స్టేషన్ బైటపడ్డాను.

ప్రయాణం పొడుగునా తీవ్రంగా ఆలోచించి ఓ నిశ్చయానికి వచ్చేను. ఇక్కణ్ణించి ఏకంగా బన్సీలాల్ దగ్గరకెళ్ళి హారాన్ని అతనికివ్వదలచుకోలేదు.

అటువంటి మారుమూల, ఇంత విలువైన హారంతో ఒంటరిగా ఓ వ్యక్తి వచ్చేడంటే ఆ సేఠ్, లేదా అతని అనుచరులు మోసం జెయ్యకుండా, న్యాయంగా ప్రవర్తిస్తారని ఏమిటి గ్యారంటీ? ఆ బన్సీలాల్ మామూలు స్థితినించి అంతటివాడయ్యేడుట.

నీతిగా, న్యాయబద్ధంగా సంపాదించేవాడెవ్వడూ జీవితాంతం కష్టపడ్డా ఆ స్థాయిజేరుకోలేడు. అడ్డదారులు తొక్కి, సాష్టాంగ పడితేగానీ ధనలక్ష్మి కటాక్షం లభించదు, ఎవ్వడికీ. బన్సీలాల్ కూడా, అటువంటి దారులే ఏవో తొక్కివుంటాడు. మన దేశంలో చప్పున బాగుపడాలంటే అడ్డదారులే కదా దొడ్డదారులు!

ఇవి కేవలం నా అనుమానాలు. పోలీసులు, అనుమానాస్పదులు అన్న అపవాదు వుండనేవుంది. ముందతని వ్యక్తిత్వాన్నీ బేక్‌గ్రౌండ్‌నీ క్షుణ్ణంగా పరిశీలిస్తేనేగానీ నా మనసు తృప్తిపడిచావదు మరి.

ఈ ఊళ్ళో నాకు తెలిసిన ఓ ప్రెస్‌రిపోర్టర్ వుంటాడు. అతని పేరు ప్రదీప్‌కుమార్. తప్పకుండా అతనిద్వారా బన్సీలాల్ గురించి అనేక విషయాలు తెలియవచ్చు. వీలైతే అతన్నే తోడుగా వెంటబెట్టుకుని బన్సీలాల్ ఇంటికి కాస్తేసరి జాగ్రత్తకోసం!

ఆ హారాన్ని బ్రీఫ్‌కేస్‌లో కాక నా కోటు లోపల పదిలంగా కుట్టి భద్రపరిచేను.

ప్రదీప్‌కుమార్ ఇల్లు ఊరుమధ్యవుంది. అదృష్టవశాత్తూ అతను ఇంట్లోనేవున్నాడు. నేనిలా హఠాత్తుగా ఊడిపడ్డంతో ఆశ్చర్యానందాలు వ్యక్తంశేసేడు. కాఫీలవీ పూర్తయ్యేక, నా రాక గురించి పూస గుచ్చినట్లు వివరించేను.

"బన్సీలాల్ గురించి నాకు తెలిసిందల్లా అతనిది రిజర్వ్‌నేచర్. ఎవ్వరితోనూ ఎక్కువగా కలవడు. ఎప్పుడూ తన సంపాదన గొడవల్లో మునిగి తేలుతుంటాడు. అతనికీ లోకంలో ఉన్నదల్లా ఒక్క కూతురే!

ఉన్నదాంతో తృప్తిపడక, ఇంకా సంపాదన కోసం దేనికి దేవిర్లాడతున్నాడో అర్థంకాదు. ఆ కూతురుకూడా యిక్కడలేదు. బెనారస్‌లో చదువుకుంటోంది.

పోతే, అతని బేక్‌గ్రౌండ్ విషయం. ఒకప్పుడు అతి మామూలు మనిషిట. స్వయంకృషితో ఇంతటి వాడయ్యేడుట. ఏ విధంగా కష్టపడ్డాడో, ఏఏ వ్యాపారాలు శేసేడో

ఎలా ఈ స్థితికి వచ్చాడో ఎవ్వరికీ తెలీదు. అవి తెలుసు కుని, వ్యాసరూపంలో పత్రికల్లో ప్రచురించాలని చాలా విలేఖర్లు అతన్ని ఇంటర్వ్యూ చెయ్యడానికి ప్రయత్నించేరు.

పత్రికా విలేఖర్లంటే అతనికి చచ్చేభయం, ఎవ్వర్నీ దగ్గరికి రానివ్వడు. బహుశా, తన గత చరిత్ర ఇతర్లకి తెలి యడం అతని కిష్టంలేదు కాబోలు. ఎలాగైనా అతన్ని ఇంటర్వ్యూ చేసి దాన్ని వ్యాసరూపంలో మా పత్రికలో ప్రచురించాలనే పట్టుదల నాకువుంది...ఆ ఉద్దేశంతోనే ఒకసారి అతనింటికెళ్ళినప్పుడు ఓ విచిత్రమైన సంఘటన జరిగింది.''

''ఏమిటది?'' అడిగేను ఆత్రుతగా.

''మూడు రోజులక్రితం, నా స్కూటర్ మీద అక్కడికెళ్ళాను. రాత్రి ఏడున్నరవుతోందప్పుడు. కాంపౌండ్ బైట స్కూటరాపి, దిగి చూస్తే మూసివున్న యింటి తలుపుకి చెవి ఆనించి లోపల ఏదో వినడానికి ప్రయత్నిస్తూ కనిపించేడు ఓ బికారి.

నన్ను చూడగానే వాడు బెదిరిపోయి, మెరుపులా కాంపౌండ్ గోడదూకి పారిపోయేడు. నేను వరండాలోని కాలింగ్ బెల్ నొక్కగానే, తలుపు తెరుచుకుంది. సేఠ్ బన్సీలాల్ సెక్రెటరీ రాజేంద్రన్ ఇవతలికి వచ్చేడు. నన్ను చూడగానే ఎందుకో అతని కళ్ళల్లో భయం కనిపించింది.

నారాక గురించి తెలుసుకున్న తరవాత, సేఠ్ ఇప్పుడెవ్వర్నీ కలుసుకోరని చాలా అమర్యాదగా మాట్లాడేడు. చేసేదిలేక తిరిగి వచ్చేశాను,'' అంటూ ముగించేడు ప్రదీప్ కుమార్.

"ఈ సంఘటన బట్టి ఆలోచిస్తే, నీవక్కడికి చేరినప్పుడు ఆ యింట్లో ఏదో జరుగుతోందని తెలుస్తోంది. అందుకే బైటికి వచ్చిన బన్సీలాల్ సెక్రటరీ నిన్ను చూసి భయపడ్డట్టు కనిపించేడు. అక్కడ తారట్లాడిన బికారి ఎవ్వరు? మూసివున్న తలుపుగుండా ఏం వినడానికి ప్రయత్నించేడు? నిన్ను చూడగానే దేనికి పారిపోయేడు? అంత ధనవంతుడైన బన్సీలాల్, తన ఇంటి ముందు ఓ కాపలావాణ్ణి పెట్టుకోలేనంత పిసినారా?" అన్నాను అర్థం కాక.

"కాపలా మనిషీ ఉండేవాడు. వాడి పేరు మురుగేషన్ ఏభైయేళ్ళ ముసలాడు. ఆ రాత్రిమాత్రం వాడక్కడ కనిపించలేదు మరి!"

సాలోచనగా తలూపేను. "సరే, నీవు నావెంట రా! నీ స్కూటర్ మీద నన్నక్కడివరకూ దిగబెట్టు, అలాగే నీ ఇంటర్వ్యూప్రయత్నం ఫలిస్తుందేమో చూడు."

"అదీ నిజమే! పదండి" అంటూ లేచాడు ప్రదీప్.

ఇద్దరం విడంబూర్ బైలుదేరాం.

# 3

బన్సీలాల్ ఇల్లుజేరేసరికి ఆరుగంటలయింది. అప్పటికే పరిసరాలన్నీ చీకట్లు చుట్టుముట్టేయి. అది దాదాపు నిర్జన ప్రదేశం అనే చెప్పాలి.

బైటస్కూటర్ ఆపి, కాంపౌండ్‌లోకి నడిచాం. ఇంటి తలుపులు తెరిచేవుంది. బైట ఎవ్వరూలేరు.

ఇద్దరం వరండా మెట్లెక్కుతుండగా—"రండి. రండి దయచేయండి" అన్న మాటలు వినిపించి ఉలిక్కిపడ్డాం.

ఎవరంటున్నారా? అని అటూ ఇటూ చూసేను.

అప్పుడు కనిపించింది. వరండా కుడివైపు చివర కేళాడు

తున్న పంజరం! ఆ పంజరంలోవున్న పంచరంగుల రామ చిలుక మమ్మల్నే చూస్తూ "రండి, రండి, దయచేయండి!" అంది మళ్ళీ.

"ఇదా మాట్లాడుతోంది. అచ్చు మనిషిలాగే పలుకు తోందే!" అన్నాడు ప్రదీప్ ఆశ్చర్యగాడయి. తలుపువైపు చూసేను. ముప్పైఏళ్ళుంటాయతనికి. చామన ఛాయ సన్నగా పొడుగ్గావున్నాడు.

"అతనే రాజేంద్రన్!" అన్నాడు ప్రదీప్ కుమార్ మెల్లిగా.

ప్రదీప్‌ని చూడగానే అతని మొహం రంగులు మారింది. "మిస్టర్! ఆ మధ్య ఒకసారి వస్తే చెప్పాగా, సేఠ్ జీ పత్రికావిలేఖర్లని కలవరని, మళ్ళీ ఏమిటి న్యూసెన్స్?" అన్నాడు తీక్షణంగా.

నేను మధ్యలో కల్పించుకున్నాను. "ఇతను నా స్నేహితుడు నాకీ పరిసరాలు కొత్త గనుక కూడా వచ్చేడు."

"మీరెవ్వరు?" రాజేంద్రన్ కనుబొమలు ముడి పడ్డాయి.

"నన్ను మద్రాసునుంచి అపర్ణాదేవిగారు పంపేరు. నా పేరు ముకుందరావ్!" అపర్ణాదేవి పేరు వినగానే అతని మొహం వికసించింది.

"ఆవిడ పంపుతానన్న మనిషి ఇంకా రాలేదేమిటా అనుకుంటున్నాం. రండి, లోనికి రండి" అన్నాడు సాదరంగా.

ఇద్దరం అతన్ని అనుసరిస్తూ డ్రాయింగ్ రూంలో అడుగు పెట్టాం. ఇంట్లో సూదిపడితే వినిపించే నిశ్శబ్దం ఆవరించివుంది.

"కూర్చోండి, నేవెళ్ళి సేఠ్ జీని పిల్చుకొస్తాను" అని వెళ్ళిపోయేడతను.

ఇద్దరం సోఫాల్లో చతికిలబడ్డాం.

పది నిమిషాల తరవాత డ్రాయింగ్ రూంలో అడుగు పెట్టేడు సేఠ్ బన్సీలాల్. నలభైఏళ్ళు దాటేయతనికి. మనిషి ఆజానుబాహుడు. బట్టతల. నున్నగాగీసుకున్న గడ్డం తెల్లగా ఆరోగ్యంగా వున్నాడు.

అతను రాగానే, ఇద్దరం లేచి చేతులు జోడించాం. సేఠ్ తలతో నమస్కారాలు స్వీకరించి, కూర్చోమన్నట్టు సైగ జేసేడు. కూర్చుంటూ నా గురించి పరిచయం జేసు కున్నాను.

"ఆహారం పంపమని అపర్ణాదేవికి ఎప్పుడో తెలీజేశాం. ఇంత ఎవ్వరూ రాకపోయేసరికి, ఆమె మనసు మార్చు కుందేమో అనుకుంటున్నాం. ఈయనెవరు?" అడిగేడు సేఠ్ ప్రదీప్ కుమార్ని చూస్తూ.

"ఇతను ప్రదీప్ కుమార్! స్థానిక ప్రెస్ రిపోర్టర్, మీ ఇంటర్వ్యూ తీసుకోవాలని ఎంతో ఆశతో నాకు తోడుగా వచ్చేడు" అన్నాను పరిచయం చేస్తూ.

"నేనింతవరకూ ఏ ప్రెస్ రిపోర్టర్ కీ ఇంటర్వ్యూ ఇవ్వ లేదు. నాలో గొప్ప ఏముందని వీళ్ళిలా ఇంటర్వ్యూకోసం ఎగబడుతున్నారు?"

"అలా అనకండి సేఠ్ జీ! ఒక మామూలు వ్యక్తి తన స్వయంకృషితో కోటీశ్వరుడు కావడం గొప్పతనం కాదా? మనిషి తలుచుకుంటే, పట్టుదలతో తన జాతకాన్నే మార్చుకోగలడని మీరు నిరూపించలేదా? లేమితో నిట్టూర్పులతో జీవించే సామాన్యులకు మీరు మార్గదర్శ కులు కారా!

అందుకే మీ ఇంటర్వ్యూ యింత ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. నాకీ మహదవకాశం కలిగించేరంటే పత్రికారంగంలో నాకు మంచి గుర్తింపు వస్తుంది. మీ మేలు ఎన్నటికీ మరిచిపోను. ప్లీజ్! కాదనకండి" అన్నాడు ప్రదీప్ కుమార్ ప్రాధేయపడుతూ.

సేఠ్ వెంటనే పలకలేదు. కాసేపు ఆలోచించి, ఏమనుకున్నాడో ఏమో, తలెత్తి—"ఆల్ రైట్! నా సెక్రెటరీ క్లుప్తంగా నా గత జీవితాన్ని రాసిస్తాడు. రేపు వచ్చి తీసికెళ్ళండి, దానికే ఇంటర్వ్యూ రూపం యిచ్చి ప్రచురించండి" అన్నాడు.

ప్రదీప్ కుమార్ అతనికి మనసారా కృతజ్ఞతలు తెల్పుకున్నాడు.

"హారం తీసుకొచ్చేరా?" అడిగేడు సేఠ్ నా వైపు తిరిగి.

నీళ్ళు నములుతూ "లేదండీ!" అన్నాను.

"ఏం?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అంత విలువైన హారం సరాసరి ఈ మారుమూల పంపడానికి అపర్ణాదేవిగారు సందేహించి, ఇక్కడి లొకేషన్ స్టడీ జెయ్యడానికి ముందు నన్ను పంపేరు. నేను తృప్తిపడి ఫోన్ జేసేక, రేపు మరోవ్యక్తిద్వారా పంపిస్తామన్నారు."

సేఠ్ మొహం జేవురించింది. "ఆఫ్టరాల్, ఎనిమిది లక్షల హారానికి ఇంత ఆర్భాటమా? రేపీపాటికి హారం నా కందితే సరి, లేదా, బేరం కేన్సిల్!" అన్నాడు తీక్షణంగా.

"అంత మాటనకండి సేఠ్ జీ! తెల్లవారిన తక్షణం మద్రాసు ట్రంకాల్ జేస్తాను, హారం పంపమని. మీరు

నిరుత్సాహపడకండి" అన్నాను నక్క వినయం ఒలక బోస్తూ.

సేఠ్ సాలోచనగా తలూపి "సరే! ఈరాత్రి ఇక్కడే గడిపి, ఉదయం వెంటనే ట్రంకాల్ జెయ్యండి..." అన్నాడు.

ప్రదీప్ కుమార్ లేచి మా దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళి పోయేడు.

సేఠ్ నౌకర్ని పిలిచి—"ఈయన ఈ రాత్రి ఇక్కడే ఉంటారు. హాలు పక్క గెస్టురూం చూపించి, భోజనం వగైరా ఏర్పాట్లు చూడు" అని పురమాయించేడు.

నౌకరు నన్ను గెస్టురూంలోకి తీసికెళ్ళేడు. గది బాగా నీటుగా వుంది. అతను తెచ్చిన భోజనం కానిచ్చి, తలుపు మూసి, సిగరెట్ అంటించేను. వెలుగుతున్న లైటార్పి బెడ్ లాంప్ వెలిగించి, గదిలో పచార్లు జెయ్యసాగాను.

రెండేరెండు విషయాలు నాలో చలనం కలిగిస్తున్నాయి మొదటిది — పత్రికా విలేఖర్లంటే మండిపడే సేఠ్, ఎన్నడూ లేంది తన మంకు పట్టువదలి ప్రదీప్ కుమార్ కు ఇంటర్వ్యూ ఇస్తాననడం!

రెండోది—సేఠ్, అతని సెక్రెటరీ ఆ హారంకోసం అవసరానికి మించి ఆరాటాన్ని వ్యక్తం జెయ్యడం! 'ఆఫ్టరాల్ ఎనిమిది లక్షలు' అన్న వ్యక్తి దేనికింత ఆరాట పడుతున్నాడు?

ప్రయాణ బడలికవల్ల నిద్ర ముంచుకువస్తోంది. ఆలోచనలు కట్టిపెట్టి పక్కమీద వాలేను.

## 4

ఏదో కేక వినిపించినట్టయి చటుక్కున కళ్ళు తెరిచేను. గదిలో డిమ్ లైట్ మసక వెలుగు, టీపాయ్ మీద రిస్టువాచి

అందుకని చూసేను. రాత్రి ఒంటిగంట.

నిశ్శబ్దాన్ని చీలుస్తూ హఠాత్తుగా మళ్ళీ వినిపించింది కేక, "రక్షించండి...రక్షించండి...హత్య...హత్య... పిస్తోలు కింద పడేయ్!"

దిగ్గున లేచి కూర్చున్నాను.

హాల్లోంచి వినిపిస్తున్నాయి అరుపులు. దుప్పటి తొలగించి మెరుపులా మంచం దిగేను. శబ్దంకాని అడుగులతో వెళ్ళి తలుపు గడియతీసేను. తిరిగి నిశ్శబ్దం! మెల్లిగా ఓ రెక్క తెరిచి, ఆ సందుగుండా హాల్లోకి చూసేను.

"రక్షించండి ... రక్షించండి...హత్య ... హత్య... పిస్తోలు కింద పడేయ్!"

ఆ కంఠం పోల్చుకున్న నాకు నవ్వాగలేదు.

అది రామచిలుక కంఠం! తలుపు తెరిచి హాల్లో అడుగు పెట్టేను. పంజరం ఓ టేబిల్ మీద పెట్టివుంది. అటూ ఇటూ గెంతుతోంది రామచిలుక! ఇంతలో స్లీపింగ్ గౌన్ చుట్టుకుంటూ హడావిడిగా వచ్చేడు రాజేంద్రన్.

మసకచీకట్లో నన్ను చూసి — "ఎవరక్కడ?" అన్నాడు.

"నేనండీ, ముకుందరావ్‌ని! ఈ చిలక కేకలు విని భయపడి లేచివచ్చేను" అన్నాడు.

"ఒక్కోసారి ఇది ఇలాగే భయపెడుతుంది రాస్కెల్" అంటూ పంజరాన్ని సమీపించేడు.

"రండి, రండి, దయచేయండి!" అంది రామచిలుక.

"షటప్! మంచినిద్ర పాడుజేశావ్. నోరు మూసుకు పడుకో," అన్నాడు రాజేంద్రన్ దాన్ని అదిలిస్తూ.

చిలక నోరు మూసుకుంది.

"ఇది అచ్చు మనిషిలాగే మాట్లాడుతుంది" అన్నాను.

"ఔను. వసపిట్టలా వాగి చచ్చిన ఎవడిదో ఆత్మ దీన్ని ఆశ్రయించివుంటుంది... మీరు వెళ్ళి పడుకోండి. దీన్ని ఏ గదిలోనైనా పెట్టి తలుపు వేస్తాను" అంటూ పంజరాన్ని అందుకుని వెళ్ళిపోయాడు రాజేంద్రన్.

ఆలోచిస్తూ గదిలోకి వచ్చేను.

ఎంత ఆశ్చర్యం ఒక రామచిలక హత్యా, పిస్తోలు గురించీ మాట్లాడుతోంది. కొంపదీసి ఈ ఇంట్లో ఎవ్వరిదైనా హత్య జరగలేదు కదా? ఆ దృశ్యాన్ని కళ్ళారా చూసిన రామచిలక, అది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఇలా, అరవడం లేదుకదా? హంతకుడు పిస్తోలు కాలుస్తుండగా హతుడు పెట్టిన కేకలేనా అవి?

ఇంతకీ, ఆ చంపబడిన వ్యక్తి ఎవ్వరు? అతన్ని ఎవ్వరు చంపేరు?

# 5

ఉదయం లేచి కాలకృత్యాలు తీర్చుకుని, సేఠ్‌తో బ్రేక్‌ఫాస్ట్ కానిచ్చి హాల్లో కూర్చున్నాను. అతని సెక్రటరీ రాజేంద్రన్ ఎక్కడా కనిపించలేదు.

"మద్రాసుకు ట్రంకాల్ బుక్ చేసి, తక్షణం హారం పంపమనండి" అన్నాడు సేఠ్ టీపాయ్ మీది ఫోన్ వైపు చూపిస్తూ.

జేబులోంచి డైరీతీసి, ఫోన్ దగ్గరికి లాక్కున్నాను. డైరీలోని అపర్ణాదేవి ఫోన్ నెంబర్‌కు ట్రంకాల్ బుక్ చేసేను. గంట తర్వాత లైన్ దొరికింది.

"ఎస్! అపర్ణాదేవి స్పీకింగ్," అవతలినించి వినిపించింది.

"నమస్కారమండీ! నేను క్షేమంగా విడంబూర్ చేరు కున్నాను. సేఠ్ బన్సీలాల్ గారి ఇంటినించే మాట్లాడు తున్నాను. ఇక్కడ అంతా సవ్యంగావుంది. మీరు నిర్భయంగా హారాన్ని పంపించవచ్చు. సేఠ్ జీ దానికోసం చాలా కుతూహలపడుతున్నారు" అన్నాను లోలోపల వేయి దేవుళ్ళకి మొక్కుకుంటూ.

హారం నాదగ్గరేవుంచుకుని దేనికిలా మాట్లాడుతున్నానా అని ఆవిడ ఈపాటికి నివ్వెరబోయివుంటుంది. అసలు విషయం చెబుతామంటే సేఠ్ ఇక్కడే కూర్చునున్నాడు.

నేనుకున్నట్టే అపర్ణాదేవి, ఇక్కడేదో తిరకాసుందని గ్రహించింది.

"ఇన్‌స్పెక్టర్ గారూ! ఏమిటి సంగతి? అక్కడేదైనా అవాంఛనీయ పరిస్థితి ఎదురైందా?" అడిగింది స్వరం తగ్గించి.

"ఔను."

"మీ చేరువలో ఎవ్వరైనా వున్నారా? మీ సంభాషణ వింటున్నారా?"

"ఔను."

"పరిస్థితేమిటో చూచాయగానైనా చెప్పలేరా?"

"నో,నో...ఇక్కడ నాకేం ఫరవాలేదు ... మనిషిని త్వరగా పంపిస్తున్నారా? సరే...అతను హారం తేగానే సేఠ్ జీకి దాన్ని అప్పగించి రసీదు పట్టుకొస్తాను. ఉంటాను మరి!" అని రిసీవర్ క్రెడిల్ చేసేను.

సేఠ్ ప్రశ్నార్థకంగా చూసేడు.

"సాధ్యమైనంత త్వరలో మనిషిచేత హారం పంపిస్తానని అన్నారు అపర్ణాదేవి" అన్నాను.

"సరే, అంతవరకూ మీరిక్కడే కాచుకోండి" అని

లోనికెళ్ళిపోయేడు సేర్. లేచి, అటుయిటు పచార్లు చేస్తు నట్లు ఇంటిముందు వరండాలోకి నడిచేను. కాంపౌండ్ లో రకరకాల పూలచెట్లు నాటివున్నాయి.

ఓ మూల పారతో మట్టి తవ్వుతూ కనిపించేడు రాజేంద్రన్, ఆశ్చర్యంగా అతన్ని సమీపించేను.

"గుడ్ మార్నింగ్ మిస్టర్ రాజేంద్రన్! ఉదయంపూట గార్డన్ లో పనిచేయడం మీ హాబీయా?" అడిగేను.

అతను ఉలిక్కిపడి తలెత్తి—"వెరీ బేడ్ మార్నింగ్ మిస్టర్ ముకుందరావ్!" అన్నాడు విచారంగా.

"ఏం?"

"రాత్రి అకస్మాత్తుగా రామచిలక చనిపోయింది!"

"ఎలా? రాత్రి ఒంటిగంట వరకూ బాగానే వుందే?" అన్నాను నివ్వెరబోతూ.

"చావు ఎవరికెలా, ఎప్పుడు వస్తుందే చెప్పగలమా? దాని ఆయుష్షు తీరిపోయింది. వెళ్ళిపోయింది."

"ఓహ్, వెరీ బేడ్ న్యూస్, అచ్చు మనిషిలాగే మాట్లాడేది" అన్నాను విచారంగా.

"ఔను. చాలా తెలివైన పక్షి! ఏంచేస్తాం? దానికి భూమ్మీద నూకలు చెల్లిపోయేయి...దాన్నిక్కడ సమాధి చేద్దామనే ఈ గుంట తవ్వుతున్నాను."

చుట్టూ చూసి—"పంజరం ఏదీ? అన్నాను.

"నా గదిలోవుంది."

"తీసుకురమ్మంటారా?"

"మీకెందుకు శ్రమ. నే తెచ్చుకుంటాగా!"

"సరే!" అంటూ లోనికి నడిచేను. క్షణం వృధా చెయ్యకుండా గబగబ రాజేంద్రన్ గదిలో ప్రవేశించాను.

బల్లమీద కనిపించింది పంజరం!

ఆ పంజరంలో నిర్జీవంగా రెక్కలు చాపుకుపడుంది రామచిలక. పంచరంగుల రామచిలక! పంజరాన్ని సమీపించి పరీక్షగా చూసేను. మనిషికన్నా మధురంగా మాట్లాడే ఆ పక్షి ఇప్పుడు నాలిక వెళ్ళుకు వచ్చి, గుడ్లు బైటికి వచ్చి వికృతంగా కన్పిస్తోంది.

ఎవ్వరో దాని కంఠం నులిమి చంపినట్లు స్పష్టంగా తెలుస్తోంది. ఆ అందమైన అమాయిక ప్రాణిని గొంతు నులిమి చంపడానికి, ఏ కిరాతకుడికి, చేతులు వచ్చేయో?

దీన్నిబట్టి, రాత్రి ఊరికే ఊహాగానాలు జెయ్యలేదనీ, ఈ యింట్లో హత్య నిజంగానే జరిగిందనీ, ఆ దృశ్యాన్ని ఈ పక్షి కళ్ళారా చూసిందనీ, ప్రాణభీతితో హతుడు పెట్టిన కేకల్ని బాగా జ్ఞాపకం పెట్టుకుందనీ రూఢి అవుతోంది.

ఈ పక్షివల్ల తనగుట్టు ఎక్కడ రట్టు అవుతుందోనని భయపడి హంతకుడు దీని నోరు శాశ్వతంగా నొక్కేసేడు. ఆలోచిస్తూ ఏమీ ఎరగనట్టు వెళ్ళి హాల్లో కూర్చున్నాను.

రాజేంద్రన్ లోనికి వచ్చేడు. పంజరం తీసుకుని బైటకెళ్ళేడు.

# 6

"టెలిగ్రాం సార్!" అన్న కేక విని ఉలిక్కిపడి తలుపువైపు చూశాను.

పోస్ట్‌మెన్!

సంతకం జేసి టెలిగ్రాం అందుకున్నాడు సేఠ్.

నేను మౌనంగా కూర్చున్నాను.

టెలిగ్రాం విప్పిచూసిన బన్సీలాల్ మొహం క్షణంలో

వివర్ణమైంది. రాజేంద్రన్ తో తగ్గుస్వరంలో ఏదో అన్నాడు అతని మొహంకూడా వెంటనే రంగులు మారింది. ఇద్దరూ గబగబ ఓ గదిలోకెళ్ళి తలుపు మూసుకున్నారు.

వాళ్ళ ప్రవర్తన చాలా విచిత్రంగా తోచింది నాకు. ఆ టెలిగ్రాం ఎక్కణ్ణించి వచ్చింది? ఎవరిచ్చేరు? ఏముంది అందులో? ఎలా తెలుసుకోవాలి? గదిలోపల వాళ్ళేం మంతనాలు జరుపుతున్నారో వినడానికి ప్రయత్నించే అవకాశం లేదు. ఇంట్లో నౌకర్లు తిరుగుతున్నారు.

సడన్ గా ఓ ఆలోచన వచ్చింది. టీపాయ్ మీద ఫోన్ దగ్గరికి లాక్కుని, గబగబ ప్రదీప్ కుమార్ యింటికి రింగ్ జేసేను.

అతను రిసీవర్ ఎత్తగానే, స్వరం తగ్గించి "నేను రాజారెడ్డిని మాట్లాడుతున్నాను. ఇప్పుడే పోస్ట్ మెన్ సేఠ్ కు టెలిగ్రాం యిచ్చివెళ్ళేడు. టెలిగ్రాం చదివిన సేఠ్ లో తీవ్రమైన కంగారు కనిపించింది. అతనూ అతని సెక్రెటరీ ఇద్దరూ గదిలోకెళ్ళి తలుపు మూసుకున్నారు.

నీవు తక్షణం అక్కడి పోస్టాఫీసుకెళ్ళి, ఆ టెలిగ్రాం ఎక్కణ్ణించి వచ్చిందో, ఎవరిచ్చేరో, అందులో ఏముందో కనుక్కుని నాకు తెలీజెయ్యాలి!" అన్నాను.

"ఆల్ రైట్! మీరు నిశ్చింతగా వుండండి. ఆ పోస్టాఫీస్ లో నాకు తెలిసిన ఇద్దరు స్నేహితులున్నారు. వారి ద్వారా చిటికెలో కనుక్కుంటాను," అవతల క్లిక్ మంది.

రిసీవర్ దించి, ఎదురుచూడసాగేను.

గంట తరవాత ఫోన్ మోగింది.

"ఎస్!" అన్నాను.

"రాజారెడ్డిగారేనా?" అవతలినించి ప్రదీప్ కుమార్ కంఠం.

"ఔను. కనుక్కున్నావా?"

"ఓ యస్! ఆ టెలిగ్రాం, బెనారస్‌నించి సేఠ్ కూతురు మృదుల ఇచ్చింది. ఈ రాత్రిబండికి తను వస్తున్నాననీ, స్టేషన్‌లో రిసీవ్ జేసుకోమనీ! అంతే."

"అలాగా! మెనీ థాంక్స్!" అని రిసీవర్ దించేను.

అంతా అయోమయంగా వుంది. కూతురు అంతదూరం నించి వస్తున్నానని టెలిగ్రాం యిస్తే సంతోషించక, బన్సీలాల్ దేనికంత ఖంగాడు పడుతున్నాడు? ఆమె ఇక్కడికి రావడం అతనికిష్టంలేదా? ఎందుకు?

ఏదో మిస్టరీవుంది. తెలుసుకోవాలి. తెల్సుకు తీరాలి. ఇంత సేపైనా ఇంకా వాళ్ళిద్దరూ గదిలోంచి ఇవతలికి రాలేదు. ఆలోచిస్తూ లేచి బైటికి నడిచేను. పోర్టికోలో ఓ చిన్నసైజు వ్యాన్, ఓ జీపూ, ఓ కారూ పార్క్ జేసి వున్నాయి.

కారు స్కైబ్లూ కలర్‌తో తళతళ మెరిసిపోతోంది. కొత్త మోడల్ కాబోలు. విదేశీ సరకులావుంది. చూద్దామని, డ్రైవింగ్ సీట్ తలుపు తెరిచి, లోన కూర్చున్నాను.

పరికరాలన్నీ అధునాతనంగా, అందంగా డిజైన్ జేసి వున్నాయి. అన్నిటినీ తాకితాకి చూస్తూ కాసేపు కూర్చుని తిరిగి ఇంట్లోకి నడిచేను.

సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో రాజేంద్రన్ ఒక్కడే గదిలోంచి ఇవతలికి వచ్చేడు. పోర్టికోలోవున్న కారెక్కి ఎక్కడికో వెళ్ళిపోయేడు. ఎక్కడికి? కన్నూర్ కా? సేఠ్ కూతుర్ని తీసుకురావడానికా? కావచ్చు అనుకున్నాను.

రాత్రి పదిగంటలైనా అతను తిరిగి రాలేదు!

నాకు నిదుర ముంచుకు రాసాగింది. గదిలోకెళ్ళి తలు పేసుకుని, మంచంమీద వాలబోయేను. సరిగ్గా అప్పుడే వినిపించింది కారు శబ్దం, ఒక్క ఉదుటున మంచం దిగి, కిటికీ దగ్గరికెళ్ళి చూసేను.

రాజేంద్రన్ వెళ్ళిన కారు రివ్వున వచ్చి పోర్టికోలో ఆగింది. మృదుల వచ్చివుంటుదనుకున్న నా అంచనా తారు మారయింది. రాజేంద్రన్ ఒక్కడే కారుదిగి తాళం చెవి ఊపుకుంటూ ఇంట్లోకి వచ్చేడు.

మృదుల ఏమైంది? వస్తానని టెలిగ్రాం యిచ్చి, ఎందుకు రాలేదు? నాలో సవాలక్ష ప్రశ్నలు ఉత్పన్నమయ్యేయి. సడన్‌గా ఏదో జ్ఞాపకం వచ్చి తలుపువైపు నడిచేను. తలుపు కొద్దిగా తెరిచి హాల్లోకి చూసేను ఎవ్వరూ లేరు.

పిల్లిలా బైటకెళ్ళి, పోర్టికోలో ఆగివున్న కారువైపు నడిచేను. డోర్ తెరిచి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాను. లైటర్ వెలిగించి మైలేజ్ మీటర్ చూసేను. ఉదయం నేను చూసినదానికంటే ఇప్పుడు 18 మైళ్ళు ఎక్కువ చూపిస్తోంది మీటర్!

నిజానికి కన్ననూర్ యిక్కణ్ణించి నాలుగు మైళ్ళే, రాను పోను 8 మైళ్ళవుతాయి. మరి కారు 18 మైళ్ళు నడిచినట్టు చూపిస్తోంది మీటర్! రాజేంద్రన్ కన్ననూర్ నించి ఇంకెక్కడికైనా వెళ్ళివచ్చేడా? ఎక్కడికి?

ఆలోచనస్తూ లైటర్ ఆర్పి కారు దిగేను. చడీచప్పుడూ లేకుండా తిరిగి నా గదిలోకెళ్ళి తలుపు మూసుకున్నాను.

## 7

ఉదయం బ్రేక్‌ఫాస్ట్ అయ్యేక సేఠ్ మండిపడసాగేడు.

"ఇంతకీ, మీ ఉద్దేశం ఏమిటి? హారం అమ్మదలచు

కున్నా రాలేదా? అమ్మదలచుకుంటే ఇంకా మనిషి ఎందుకు రాలేదు?''

"నేనూ అదే ఆలోచిస్తున్నాను సేఠ్ జీ, అపర్ణాదేవి స్వయంగా చెప్పేరు. మనిషిచేత పంపిస్తానని.''

"ఇంకా రాలేదేం?''

"ఎనిమిదిలక్షల హారం కదా సేఠ్ జీ, సమయానికి నమ్మకస్థుడైన మనిషి దొరకద్దూ? సాయంత్రంవరకూ కాస్త ఓపికపట్టండి.''

"నాకదేం తెలీదు, సాయంత్రంవరకూ హారం చేతి కందకుంటే బేరం కాన్సిల్ అయినట్టే దేనికైనా మంచిది మరోమారు ఆమెకు ట్రంకాల్ జేసి చెప్పండి!''

"నేను కన్ననూర్ వెళ్ళుతున్నాను. అక్కణ్ణించే ట్రంకాల్ కూడా ఇస్తాను.''

"ఏం?! ఇక్కణ్ణించి ట్రంకాల్.....'' సేఠ్ వాక్యం ఇంకా పూర్తి కాలేదు. ఇంతలో కాలింగ్ బెల్ మోగింది. రాజేంద్రన్ లేచి బైటికెళ్ళాడు. కాసేపు ఏవో మాటలు వినిపించాయి బైటినుంచి. తరవాత రాజేంద్రన్ ఓ వ్యక్తిని వెంటబెట్టుకుని లోనికి వచ్చేడు.

"సర్! వీరు మిమ్మల్ని కలుసుకోడానికి చాలాదూరం నించి వచ్చేరుట!'' అన్నాడు అతన్ని పరిచయంచేస్తూ.

ఆ వ్యక్తి చేతులు జోడించి సేఠ్ కు నమస్కరించాడు. సేఠ్ ప్రతి నమస్కారంచేసి, "కూర్చోండి'' అన్నాడు సోఫా చూపిస్తూ.

ఆ వ్యక్తి కూర్చుని, జేబులోంచి ఓ కవర్ తీసి సేఠ్ ముందుకు చాస్తూ— "నన్ను డాక్టర్ సుందరన్ అంటారు. ఈ చుట్టుప్రక్కల అడవిలో ఒక ప్రత్యేకరకం మొక్కల

గురించి రీసెర్చ్ చెయ్యడానికి వచ్చేను.

మీ స్నేహితుడు ప్రీతమ్‌లాల్ నన్ను పరిచయం చేస్తూ మీకు రాసిన ఉత్తరం ఇది. ఆయన నాకు బాగా తెలును. ఈ చుట్టుప్రక్కల నేను నివసించడానికి అనుకూలమైన వసతి ఏర్పాట్లులేక ఈ విధంగా మిమ్మల్ని ఇబ్బంది పెట్ట వలసి వచ్చింది. నా పని పదీ పదిహేను రోజుల్లో అయి పోతుంది. అంతవరకూ......"

సేఠ్ కళ్ళు భయంతో విప్పారడం గమనించేను. అయిష్టంగానే ఆ కవర్ విప్పి చదివేడు. తరవాత దాన్ని టీపాయ్‌మీద పెడుతూ— "క్షమించండి డాక్టర్! అర్జెంటు పనిమీద మేము రేపు ఊరెళ్ళబోతున్నాం" అన్నాడు.

"ఇంట్లో నౌఖర్లు ఉంటారుగా? నాకు పగలంతా రిసెర్చిలో బైటే గడిచిపోతుంది. కేవలం రాత్రి తలదాచు కోడానికి ఇంత చోటు కావాలి. అంతే!" అతను అంత సులువుగా వదిలేటట్టులేదు.

సేఠ్ వెంటనే పలకలేదు. కాసేపు ఆలోచించి, ఏమను కున్నాడో ఏమో తలెత్తి— "ప్రీతమ్‌లాల్ ఉత్తరం రాసే డంటే, మీకోసం ఏదో ఒక ఏర్పాటు చెయ్యకతప్పదు మరి!" అని రాజేంద్రన్ వైపు చూసి— "వీరికి మేడమీద గది చూపించు" అన్నాడు.

"మీ వెంట సామాను ఉందా?" అడిగేడు రాజేంద్రన్.

డాక్టర్ తలూపి— "బైట నా కార్లో ఉంది!" అన్నాడు.

"నౌఖరు తెస్తాడు. రండి" అన్నాడు రాజేంద్రన్ మేడవైపు నడుస్తూ.

"మెనీ థాంక్స్ సేఠ్ జీ! మీ సహాయం ఎన్నటికీ మర్చిపోను" అంటూ లేచాడు డాక్టర్.

వాళ్ళు మేడమీదికెళ్ళగానే చటుక్కున నావైపు తిరిగేడు సేఠ్.

"మిస్టర్ ముకుందరావ్! వెంటనే మీరొక పని చెయ్యాలి. నేను కొత్తమనుషుల్ని అట్టే నమ్మను. ఈ డాక్టర్ ఎటువంటివాడో తెలీదు. దేనికైనా మంచిది. మీరు తక్షణం కన్ననూర్ వెళ్ళి, అపర్ణాదేవికి ట్రంకాల్ చేసి, ఆమె పంపే మనిషి ఇక్కడికి రాకుండా, కన్ననూర్ లోనే ఏదైనా హోటల్లో దిగి నాకోసం వెయిట్ చెయ్యమనండి. నేనక్కడే హారం తీసుకుంటాను."

"ఆల్ రైట్! మీ ఇష్టం!" అన్నానేగానీ లోలోపల సేఠ్ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

డాక్టర్ సుందరన్ సేఠ్‌కు అపరిచితుడై ఉండి ఉంటే అతన్ని చూడగానే సేఠ్ దేనికి భయపడ్డట్టు కనిపించేడు? అకస్మాత్తుగా హారం ఇక్కడికి తేవద్దని దేనికంటున్నాడు? సుందరన్ సేఠ్‌కు మొదటినుంచీ తెలుసా? నా ముందు ఇలా నటిస్తున్నారా? మొత్తానికి ఏదో గందరగోళంఉంది!

"పోర్టికోలో ఓ వ్యాన్ ఉంటుంది. దాన్ని తీసి కెళ్ళండి." అన్నాడు సేఠ్ ఇగ్నిషియన్ కీ ఇస్తూ.

దాన్ని అందుకుని లేచేను. పోర్టికోలో డాక్టర్ తాలూకు అంబాసిడర్ ఆగిఉంది. వ్యాన్ ఎక్కి బైలు దేరాను.

# 8

కన్ననూర్ చేరగానే, తిన్నగా ప్రదీప్‌కుమార్ ఇంటి ముందు వ్యాన్ ఆపేను. అతను ఇంట్లోనే ఉన్నాడు.

అంతవరకూ జరిగిన విషయాలన్నీ అతనికి వివరించేను.

"మీరు చెప్పిన విషయాల్లో, సేఠ్ కూతురు అక్కడికి రాలేదన్నది నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఎందుకంటే, ఆమె నిన్నరాత్రి స్టేషన్‌లో నా కళ్ళముందే ట్రేన్ దిగింది!"

క్షణం నా నోట మాట పెగల్లేదు.

"నిన్న రాత్రి నేను స్టేషన్‌కెళ్ళడం కాకతాళీయమే అనుకోండి. ఓ ఫ్రెండ్‌ని సెండాఫ్ చెయ్యడానికెళ్ళాను. సేఠ్ కూతురు ట్రేన్ దిగడం, రాజేంద్రన్ వెంట బైటికెళ్ళి కారెక్కడం నా కళ్ళారా చూసేను."

"మరి ఇంటికి రాకుండా ఇద్దరూ ఎక్కడికెళ్ళారు?"

"బహుశా రాజేంద్రన్ ఆమెని ఇంకెక్కడికైనా తీసికెళ్ళాడేమో!"

"అంటే, ఈ చుట్టుప్రక్కల సేఠ్‌కు మరేదైనా ఇల్లుందా?"

ప్రదీప్‌కుమార్ పెదవి విరిచి_"తెలీదు!" అన్నాడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు. రాత్రి మైలేజ్ మీటర్ చూసినప్పుడు కారు 18 మైళ్ళు నడిచినట్టు చూపడం! అదే చెప్పేను అతనికి.

"ఐతే నిస్సందేహంగా వాళ్ళిద్దరూ ఇంకెక్కడికో వెళ్ళుంటారు. వాళ్ళకు ఈ చుట్టుప్రక్కల ఏదైనా ఇల్లుందేమో కనుక్కోవాలి. అదేమంత కష్టమైన పనికాదు. పదండి." అంటూ లేచాడు ప్రదీప్.

ఇద్దరం వ్యాన్‌లో బయలుదేరాం.

బజారుగుండా వ్యాన్ పోతోంది. ప్రదీప్‌కుమార్ హఠాత్తుగా నా భుజంమీద చెయ్యి వేసి_ "ఆపండి!" అన్నాడు.

నాకు తెలీకుండా బ్రేక్ వత్తేను.

రోడ్డు ప్రక్కన పళ్ళ దుకాణంముందు నిల్చుని, ఏదో పండు తింటున్న ఓ బికారిని చూపిస్తూ– "ఆ రోజు సేఠ్ ఇంటిముందు నేను చూసిన బికారి వాడే!" అన్నాడు ప్రదీప్ కుమార్.

నా కళ్ళల్లో మెరుపు మెరిసింది. "ఎలాగైనా వాణ్ని మచ్చిక చేసుకుని తీసుకు రా. ఏదైనా హోటల్ కి తీసి కెళ్దాం!" అన్నాను.

ప్రదీప్ కుమార్ దిగి వాణ్ని సమీపించేడు. అతన్ని ఎగాదిగా చూసేడు వాడు. ప్రదీప్ వాడితో ఏదో అన్నాడు. మరుక్షణం వాడి మొహం వికసించింది. తలూపుతూ అతని వెంట వ్యాన్ దగ్గరికి వచ్చేడు. వాణ్ని వ్యాన్ వెనక భాగం కూర్చోబెట్టి నా దగ్గరికి వచ్చేడు ప్రదీప్.

"నయం, వాడు నిన్ను గుర్తుపట్టలేదు. పట్టివుంటే మన వెంట వచ్చేవాడు కాదు" అన్నాను ఇంజన్ స్టార్ట్ చేస్తూ.

ఓ హోటల్ ముందు వ్యాన్ ఆపి, బికారిని వెంటబెట్టుకుని లోనికెళ్ళి కూర్చున్నాం. ప్రదీప్ కుమార్ వాడికోసం రెండు మూడు టిఫిన్లు ఆర్డరిచ్చి, మాకోసం కాఫీలు తెప్పించేడు.

టిఫిన్లు రాగానే వాటిమీద విరుచుకుపడ్డాడు బికారి.

వాడు తినడం పూర్తయ్యేక, జేబులోంచి పది రూపాయల నోటు తీసి బల్లమీద పెట్టేను. దాన్ని చూడగానే వాడి కళ్ళు తళతళ మన్నాయి.

"ఇది నీ స్వంతం కావాలంటే, మేమడిగే కొన్ని ప్రశ్నలకి జవాబులివ్వాలి" అన్నాను.

వాడి కళ్ళల్లో మెరుపు మాయమైంది. దాని స్థానే

అనుమానం చోటు చేసుకుంది. "ఏమిటి బాబూ?" అన్నాడు భయం భయంగా.

"ఐదారురోజుల క్రితం నీవు విడంబూర్‌లోని సేఠ్ బన్సీలాల్ ఇంటికెళ్ళావు కదూ?" అడిగేను.

మరుక్షణం వాడి కాళ్ళూ, చేతులూ వణకసాగేయి. "నా మాట నమ్మండి బాబూ! సత్తె పెమాణంగా సెప్తున్నా. నేనక్కడేం దొంగతనం సెయ్యేదు. గొప్పోళ్ళు కదా అని అడుక్కోడానికెల్నా! అంతే బాబూ."

"దొంగతనం చేశావని ఎవరన్నారు? ఊరికే భయపడక. ఆ రాత్రి ఆ ఇంట్లో ఏదో జరిగిందని మా అనుమానం. నీకు తెలిసిందల్లా దాచకుండా మాకు చెప్పేవంటే ఈ ఐదు రూపాయలు ఇచ్చి పంపేస్తాం."

"మీరు పోలీసోళ్ళా బాబూ?"

"ఔను. ఆ రాత్రి ఆ ఇంట్లో ఏదో నేరం జరిగింది. అదేమిటో తెలుసుకోడానికి ప్రయత్నిస్తున్నాం. నీవక్కడ ఏం చూసేవో, ఏం విన్నావో నిజం చెబితే సరి, లేదా నిన్నిప్పుడే పోలీస్ స్టేషన్ తీసికెళ్ళి జైల్లో పడేస్తాం!" అన్నాను అస్త్రం ప్రయోగిస్తూ.

దాంతో ఇప్పుడు వాడి ఒళ్ళంతా వేపాకుమల్లే వణకసాగింది.

"మీ కాళ్ళు పట్టుకుంటాను బాబూ! పేదోణ్ని. నన్నేం సెయ్యకండి. నాకు తెల్సిందంతా సెప్పేత్తాను. ఆ రాత్రి అడుక్కోడానికి ఆ ఇంటికెల్నా. తలుపు మూసుంది అరవబోయ్నా. అంతలో, 'రచ్చించండి...రచ్చించండి... అత్య అత్య...పిస్తోలు కిందపడెయ్' అన్న కేకలినిపించేయి.

నేను బెదిరిపోయి, తలుపు సందులోంచి లోపలికి సూస్న. లోపల యిద్దరు దొరలు ఎదురుబొదురుగా నిల్సున్నారు. ఒకాయన సేతిలో పిస్తోలుంది. నేను చూత్తుండగానే ఆ దొర, రెండో దొరను దాంతో రెండు సార్లు కాల్సేడు. ఆయన కేక లెడ్తూ కిందకూలేడు.

ఆ సప్పాడిని, లోపల్నుంచి ఇంకో దొర బైటకొచ్చి, 'ఎందుకు సంపావతన్ని?' అంటూ పిస్తోలు పట్టుకున్నాయన్ని కానా కోప్పడ్డాడు. 'ఈడు పానాలతో ఉంటే మనకు కానా పెమాదం!' అన్నాడాయన.

అంతవరకే సూస్న బాబూ! ఇంతలో నా ఎనక అడుగుల సప్పాడయింది. గబుక్కున ఎదుదిర్గి సూత్తును గందా, ఈ బాబుగారొస్తున్నారు,'' అంటూ ప్రదీప్ కుమార్ని చూపించేడు. ''ఈయన్ని సూడంగానే బయమేసి అక్కణ్ణించి లగెత్తిన!''

''మొత్తానికి నన్ను గుర్తుపట్టేవన్నమాట!'' అన్నాడు ప్రదీప్ నవ్వుతూ.

''మొదట గుర్తు పట్నేదు బాబూ! ఇప్పుడా ఇంటి సంగతి సెప్తే గుర్తొచ్చింది.''

''నువ్వా ఇంట్లో చూసిన ఇద్దరు వ్యక్తుల్ని గుర్తుపట్టగలవా?'' అడిగేను.

''సచ్చినాయన ఈపు నా వైపుంది బాబూ! ఆయన మొహం సూన్నేదు. పిస్తోలు పట్టుకున్నాయన్ని మాత్రం బాగా గుర్తుపడతాను.''

''ఎవ్వరతను?''

''సేఠ్ బన్సీలాల్!''

నేనూ, ప్రదీప్ కుమార్ ఒకరి మొహాలొకరం చూసుకున్నాం.

తరవాత తేరుకుని—"సరే, నీవు నిజం చెప్పేవని మాకు నమ్మకం కుదిరింది. ఈ ఐదురూపాయలు తీసుకుని ఇక వెళ్ళు" అన్నాను నోటు వాడి చేతిలో పెడుతూ.

బికారి చేతులు జోడించి, బ్రతుకు జీవుడా అన్నట్టు అక్కణ్ణించి మాయమయ్యేడు. బిల్ పే జేసి, ఇద్దరం తర్కించుకుంటూ హోటల్ బైటకు వచ్చాం. బైట ఆపి వున్న వ్యాన్ దగ్గర, ఓ వ్యక్తి చేతిలో చిన్న మూట పట్టుకుని వ్యాన్ని ఎగాదిగా చూస్తూ కనిపించేడు.

అతన్ని చూడగానే — "ఏమోయ్ మురుగేషన్! ఇక్కడేం జేస్తున్నావ్?" అన్నాడు ప్రదీప్ కుమార్.

"ఎవ్వరితను?" అడిగేను.

"నీ చెప్పలా? సేఠ్ ఇంటిముందు ఓ కాపలా మనిషి ఉండేవాడని. ఇతనే!" అన్నాడు ప్రదీప్.

ఆ వ్యక్తి మమ్మల్ని చూసి—"నమస్కారం బాబూ! సేఠ్ గారి వ్యాన్ ఇక్కడ కనిపిస్తే ఎవరొచ్చారా అని చూస్తున్నాను" అన్నాడు.

"ఈ మధ్య సేఠ్ ఇంటిదగ్గిర కనిపించడంలేదు. పని మానేసేవా?"

"లేదు బాబూ! అక్కడే పని జేస్తున్నా, వారే కొన్ని రోజులు ఊరెళ్ళి విశ్రాంతి తీసుకోమని సెలవిచ్చారు నాకు. ఊరెళ్ళి చూస్తే మా కోడలు పిల్ల బాగా జబ్బు పడుంది. పట్నం తీసికెళ్ళి చూపించాము. ఆపరేషన్ జెయ్యాలన్నారు. డబ్బు ఖర్చవుద్దన్నారు. సేఠ్ గారు ఏమైనా సాయం జేస్తారేమోనని ఇలా వచ్చేను. ఇప్పుడే బండి దిగి, కాలినడకన ఇలా వస్తుండగా ఈ వ్యాన్ కన్పించింది" అన్నాడతను.

"వీరు సేఠ్ ఇంటికే వెళ్తున్నారు. లోపల కూర్చో" అన్నాడు ప్రదీప్‌కుమార్.

మురుగేషన్ వెనక్కి వెళ్ళి వ్యాన్‌లో కూర్చున్నాడు.

ప్రదీప్‌కుమార్‌ని పక్కకి తీసికెళ్ళి రహస్యంగా చెప్పేను. "నీకు సేఠ్ తాలూకు ఇల్లేదైనా ఈ చుట్టుపక్కలుందేమో కనుక్కొని నాకు ఫోన్ జెయ్. మురుగేషన్ని అడిగి తెలుసుకోవచ్చు. కానీ, వాడిద్వారా సేఠ్ కీవిషయం తెలిస్తే మొదటికే మోసం వస్తుంది."

ప్రదీప్ కుమార్ తలూపి-"నిశ్చింతంగా ఉండండి. సరిగ్గా పన్నెండు గంటలకి మీకు ఫోన్ జేస్తాను. సరిగ్గా ఆ సమయంలో మీరు ఫోన్ దగ్గరుండాలి" అన్నాడు.

తలూపి వ్యాన్ ఎక్కి, ముందుకు పోనిచ్చేను.

కొంచెదూరం వెళ్ళానో లేదో, బజార్లో రోడ్డుపక్క ఆగివున్న ఓ అంబాసిడర్ కారుమీద దృష్టి పడగానే స్పీడ్ స్లో జేసేను. అది డాక్టర్ సుందరన్ కారులావుంది! కారు పక్కనించి పోతూ డ్రైవింగ్ సీట్లోకి చూసేను. స్టీరింగ్ ముందు సుందరన్ కూర్చున్నాడు.

అతనిక్కడేం జేస్తున్నాడు? పనిమీద వచ్చాడా? ఆలోచిస్తూ వ్యాన్ స్పీడ్ హెచ్చించేను.

# 9

సూర్యాస్తమయం వేళకి సేఠ్ ఇంటి పోర్టికోలో వ్యాన్ ఆపి దిగేను. వ్యాన్ శబ్దం విని సేఠ్ బైటకి వచ్చాడు. మురుగేషన్ యింకా దిగలేదు.

"మురుగేషన్! ఇల్లు వచ్చేసింది వ్యాన్ దిగు" అన్నాను గట్టిగా.

"మురుగేషనా? ఇక్కడికెలా వచ్చేడు?" అడిగేడు

సేఠ్ ఆశ్చర్యంగా.

"కన్ననూర్‌లో కనిపించేడు. ఇక్కడికే వస్తున్నా నంటే తీసుకొచ్చాను" అన్నాను.

మురుగేషన్ ఇంకా దిగలేదు.

లోపల పడుకున్నాడా ఏమిటానుకుంటూ, వ్యాన్ వెనక్కి వెళ్ళేను.

అనుకున్నట్టే సీటుమీద పడుకునున్నాడు.

"మురుగేషన్! నిదరబోతున్నావా?" అంటూ కుదిపేను.

ఆ కుదుపుకి కాస్త ఇటు ఒరిగేడు.

నా గుండె ఒక్కసారి ఝల్లుమంది! రోమాలు నిక్కబొడుచుకున్నాయి. మురుగేషన్ కణతమీద రంధ్రం! ఆ రంధ్రంలోంచి ఉబికి, చారలు చారలుగా కారిన రక్తం. ఎవ్వరో అతన్ని పిస్తోలుతో కాల్చి చంపేరు.

"ఏం జరిగింది? మురుగేషన్ ఎక్కడ?" అంటూ వ్యాన్ వెనక్కి వచ్చేడు సేట్. ఇంతలో రాజేంద్రన్ కూడా ఇంట్లోంచి వచ్చేడక్కడికి. ఇద్దరూ ఆ దృశ్యం చూసి నిర్ఘాంతబోయేరు. నా బుర్ర గిరగిర తిరుగుతోంది. మురుగేషన్ని ఎవ్వరు చంపేరు? ఎలా చంపేరు? ఎక్కడ చంపేరు? నాకు శబ్దం వినిపించలేదే?

"ఎలా జరిగింది?" అడిగేడు సేట్ ఆశ్చర్యంగా.

"కన్ననూర్‌లో సజీవంగా వ్యాన్ ఎక్కిన వ్యక్తి, ఇక్కడికి చేరగానే చచ్చిపడున్నాడు. నాకంతా అయోమయంగా వుంది."

"కనీసం పిస్తోలు పేలిన చప్పుడు కూడా వినిపించలేదా మీకు?" అడిగేడు రాజేంద్రన్.

"లేదు మీ వ్యాన్ ఇంజన్ బాగా చప్పుడు జేస్తుంది" నా మాట ఇంకా పూర్తి కాలేదు.

ఇంతలో ఏదో కారు వస్తున్న శబ్దం విని అందరం అటు చూశాం. డాక్టర్ సుందరన్ అంబాసిడర్ కారు కాంపౌండ్ లోకి తిరుగుతోంది. కారు దిగి మమ్మల్ని సమీపించేడతను.

"ఏం జరిగింది? ఎందుకలావున్నారు?" అడిగేడు కుతూహలంగా.

"హత్య జరిగింది!" అంటూ వ్యాన్ లోకి చూపించేను.

"మైగాడ్! హత్యా!" అన్నాడు నోరు తెరిచి చూస్తూ.

"వెంటనే పోలీసులకు ఫోన్ జేసి పిలిపించండి" అన్నాను సేట్ తో.

"ఇది నిజంగా హత్యే అని గ్యారంటీ ఏమిటి?" అన్నాడు సుందరన్.

"లేకుంటే, ఈ ముసలాడు వేన్ లో కూర్చుని ఆత్మహత్య చేసుకున్నాడంటారా?" అన్నాను వ్యంగ్యంగా.

"నేనలా అనడంలేదే! నా అభిప్రాయమల్లా, దారి పొడవునా అడివీ, దిబ్బలూ ఉన్నాయి. అక్కడ పొంచి పొంచి కుందేళ్ళని వేటాడుతూ చాలామంది కనిపించేరు. ఎవ్వరిదో తుపాకి గురితప్పి, గుండు ఇతనికి తగిలి వుండవచ్చుగా? లేకుంటే ఈ పేద ముసలాణ్ని కాల్చి చంపే అవసరం ఎవరికుంది?" అన్నాడు సుందరం తార్కికంగా.

"ఔను. అలాగే జరిగివుంటుంది!" అన్నారు సేట్ రాజేంద్రన్ లు ముక్త కంఠంతో.

నేను పలకలేదు. వాళ్ళతో వాదించడం వ్యర్థం.

ముగ్గురూ తోడు దొంగల్లా కనిపిస్తున్నారు నా కంటికి.

"వెళ్ళి వెంటనే పోలీసులకు ఫోన్ చెయ్!" అన్నాడు సేట్ రాజేంద్రన్ని పురమాయిస్తూ.

అతను గబగబ ఇంట్లోకి నడిచేడు. అతని వెనకే సుందరన్ కూడా వెళ్ళేడు. సేట్ నన్ను సమీపించి—

"అపర్ణాదేవికి ట్రంకాల్ చేసి చెప్పేరా?" అడిగేడు.

"మీరు కోరినట్టే హారం తెచ్చే వ్యక్తి కనన్నూర్‌లోని బృందావన్ హోటల్లో దిగుతాడు. అతని పేరు నారాయణ్!" చెప్పేను.

"వెరీగుడ్ ఉదయం నేనే వెళ్ళి అతన్ని కలుసుకుంటాను. మీరిక్కడే వెయిట్ చేస్తుండండి. నేను రాగానే చెక్ రాసిస్తాను," అన్నాడు సేట్ తృప్తిగా.

చీకటి పడ్డాక వచ్చేరు పోలీసులు. సేట్ ఇచ్చిన స్టేట్‌మెంట్ రాసుకుని, శవాన్ని తీసుకువెళ్ళిపోయేరు.

భోజనాలయ్యేక సిగిరెట్ అంటించి గదిలో పచార్లు చెయ్యసాగేను. ఇక్కడి వ్యవహారమంతా అయోమయంగా వుంది. ఒకదాని వెనక ఒకటిగా అనూహ్యమైన సంఘటనలు ఎదురౌతున్నాయి. ఏదో పనిమీద వచ్చేను. ఇక్కడింకేదో భాగోతం ఎదురైంది.

మురుగేషన్ మరణం ఏదో ప్రమాదవశాత్తూ జరిగిందంటే నా కెందుకో నమ్మబుద్ధి కావడంలేదు. మరి ఎవ్వరు చంపేరతన్ని? ఎటు చూసినా అతన్ని చంపడానికి ఒకే ఒక వ్యక్తికి అవకాశం వున్నట్టు కనిపిస్తోంది.

అతనే డాక్టర్ సుందరన్! కన్ననూర్ నించి వస్తున్నప్పుడు అతనే కనిపించేడు కార్లో. బహుశా మురుగేషన్ వ్యాన్ ఎక్కి బైలుదేరడం చూసి ఉంటాడు.

వ్యాన్ వెనకే తనూ బైలుదేరి, నిర్మానుష్యమైన ప్రదేశంలో గుట్టు చప్పుడు కాకుండా, వెనకనించి పిస్తోలుతో కాల్చివుంటాడు. ఇంజన్ చప్పుడు మధ్య ఆ శబ్దం నాకు వినిపించలేదు.

ఇదే నిజమైతే, ఇక మురుగేషన్ని చంపడానికి గల కారణాలు ఆలోచించాలి. సేట్ బన్సీలాల్ ఈ ఇంట్లో ఎవ్వరో వ్యక్తిని హత్యజేసేడని రూఢి అయింది. అంతే కాదు. డాక్టర్ సుందరన్, సేట్ బన్సీలాల్, అతని సెక్రెటరీ రాజేంద్రన్ కలిసి ఏదో గూడుపుఠాణీ జరుపుతున్నారని నా అనుమానం.

ఆ రహస్యాలేవో మురుగేషన్‌కి తెలిసివుంటాయి. అందుకే అతన్ని కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకురమ్మని ఊరికి పంపించేరు. అతనివల్ల కార్యకలాపానికి ఎక్కడ అంతరాయం కలుగుతుందో అని శాశ్వతంగా అతన్ని దారికి అడ్డు తొలగించేడు సుందరన్.

సేట్ బన్సీలాల్‌కు ఎందుకో సుందరన్ మీదా, రాజేంద్రన్ మీదా నమ్మకం లేనట్టుంది. అందుకే, హారం తీసుకువచ్చే మనిషి, అక్కడికి రాకుండా చెయ్యమని చెప్పేడు.

పోతే, బన్సీలాల్ చంపిన వ్యక్తి ఎవ్వరు? వాళ్ళ అనుచరుడా? అతనూ ఇక్కడే వుండేవాడా? చంపి, శవాన్ని ఏంజేసేరు?ఎక్కడో గొయ్యితవ్వి పాతేసివుంటారు.ముందా వ్యక్తి ఎవ్వరో తెలుసుకోడం చాలా ముఖ్యం. అతనికి సంబంధించిన వస్తువులేవైనా ఈ ఇంట్లో వుండివుంటే, వాటి ఆధారంతో ఏదైన క్లూ దొరకవచ్చు.

రేపుదయం సేట్ కన్ననూర్ వెళతానన్నాడు. రాజేంద్రన్ కూడా ఎక్కడికైనా వెళితే నా పని సులువౌతుంది. తీరిగ్గా ఇల్లంతా వెతకొచ్చు.

# 10

ఉదయం బ్రేక్ ఫాస్ట్ కాగానే—"కారు సిద్ధం చెయ్. కన్ననూర్ వెళ్ళాలి" అన్నాడు సేట్ రాజేంద్రన్‌తో.

"కన్ననూర్ వెళ్తున్నారా? నాకూ చిన్న పనుందక్కడ నా కారు ట్రబుల్ ఇస్తోంది. దయచేసి, కాస్త లిఫ్ట్ ఇవ్వండి" అన్నాడు సుందరన్ వెంటనే.

సేట్ ముఖం చిటపటలాడింది. విధిలేనట్లు "సరే!" అన్నాడు విసుగ్గా.

పది గంటలకి ముగ్గురూ కారుక్కి వెళ్ళిపోయేరు.

తేలిగ్గా ఊపిరి తీసుకున్నాను. ఇంట్లోవున్న యిద్దరు ముగ్గురు నౌకర్లు తమ తమ పనుల్లో ఎక్కడో వున్నారు.

చడీ చప్పుడు కాకుండా మేడమీదకెళ్ళి, ముందు డాక్టర్ సుందరన్ గది పరిశీలించేను. దాంతో అతను వకీలీ డాక్టర్ అని తెలిసిపోయింది. నిజంగా అతను ఏ డాక్టరో అయివుంటే, ఏ రీసెర్చి కోసమో ఇక్కడ వచ్చివుంటే ప్రయోగాలకి సంబంధించిన పరికరాలూ, లేదా పుస్తకాలూ నోట్సూ వెంట వుండితీరాలి.

అవేమీ లేవు. సూట్‌కేస్‌లో రెండుమూడు జతల బట్టలూ, నిత్యావసర వస్తువులూ తప్ప! అక్కణ్ణించి తిన్నగా కిందికి వచ్చి ఒకొక్క గదినీ చూసుకుంటూ స్టోర్ రూంలో అడుగు పెట్టేను.

కింద నూనె డబ్బాలూ, ధాన్యం బస్తాలూ పేర్చి వున్నాయి. అటకమీద విరిగిపోయిన కుర్చీలూ, సామానూ వేసివుంది. మీదకెక్కడానికి చెక్క మెట్లున్నాయి. ఆ మెట్లగుండా అటకమీదికి చేరుకున్నాను. అక్కడి సామానుమీద అంగుళం ఎత్తు దుమ్ము పేరుకుంది.

కానీ, ఓ సూట్‌కేస్‌మీద మాత్రం దుమ్ము అట్టే కని

పించడం లేదు. బహుశా, దాన్ని ఈ మధ్యే అక్కడ వేసి వుంటారు. ఆతృతగా దాన్ని తెరిచి చూసేను. రెండుమూడు పాతసూట్లు కనిపించేయి.

ఓ కోటు జేబులో, పాత మోడల్ గడియారం కనిపించింది. దాన్ని అందుకుని జాగ్రత్తగా పరిశీలించేను. గడియారం వెనక, మిత్రుడు నటరాజన్‌కు జ్ఞాపక చిహ్నంగా కృష్ణ అయ్యర్ అని చెక్కి వుంది.

సాలోచనగా తలూపేను. కృష్ణ అయ్యర్ అనబడే ఎవ్వరో వ్యక్తి ఈ గడియారాన్ని జ్ఞాపక చిహ్నంగా తన మిత్రుడైన నటరాజన్‌కు బహుకరించేడని తెలుస్తోంది. అంటే, ఈ దుస్తులు నటరాజన్‌వన్న మాట.

ఈ పేరు ఎప్పుడో, ఎక్కడో విన్నట్టుంది. ఇంకేమైనా దొరుకుతాయేమోనని మరో కోటు తీసి వెదికేను. జేబులోంచి మడత పెట్టిన పాత కాగితం బైటపడింది. దాన్ని విప్పి చూసేను.

"మై డియర్ నటరాజన్!

ఈ మధ్య నేను ఓ నాటక కంపెనీ స్థాపించేను. తొలి ప్రదర్శన రేపు రాత్రి కళాభారతిలో ఇవ్వబోతున్నాం. ఒకనాటి అగ్రస్టేజీ నటుడివైన నిన్ను ముఖ్య అతిథిగా ఆహ్వానించాలని నిశ్చయించేము. ఇది మా కళాకారుల తరపు అభ్యర్థనగా స్వీకరించి, ప్రదర్శనకు వచ్చి, నాటకం విజయవంతం కావడానికి తోడ్పడతావని ఆశిస్తున్నాను.

కృష్ణ అయ్యర్!"

ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. నటరాజన్ అనబడే ఆ వ్యక్తి ఒకప్పుడు గొప్ప స్టేజీ నటుడు. అనారోగ్యం చేతనో మరెందువల్లో ఏడెనిదేళ్ళనించీ అతను నాటకరంగంనించి

విరమించుకున్నాడు. తరవాత అతని పేరు ఎక్కడా విన పడలేదు.

ఆ వ్యక్తి ఇప్పుడెక్కడెలా తేలాడు? సేఠ్ బన్సీలాల్ అతన్నే హత్యచేసాడా? చంపి అతని సూట్ కేస్ ఇక్కడ పడేసేరా? హత్యకి కారణం? పాత వైషమ్యాలా?

ఆలోచిస్తూ ఆ దుస్తుల్ని పైనించి పరీక్షగా చూడ సాగేను. కోటు కుడివైపు జేబులకంటే ఎడంవైపు జేబులు ఎక్కువ మురికిగా కనిపిస్తున్నాయి. మనం ఎక్కువ ఏ జేబుల్లో చేతులు పెడతామో సాధారణంగా అవే ఎక్కువ మురికి అవుతుంటాయి. దీన్నిబట్టి ఆ నటరాజన్ ఎడంచేతి వాటమై ఉంటాడనిపిస్తోంది.

ఆలోచిస్తూ అటక దిగి హాల్లోకి నడిచేను. తిరిగి మేడ మెట్లెక్కి సేఠ్ గదిలో ప్రవేశించేను. ఒక్కొక్క వస్తువుని జాగ్రత్తగా చెక్ చేస్తూ గోడవారగా వున్న గోద్రెజ్ టేబిల్ దగ్గరికి నడిచేను. టేబిల్ పైన కాగితాలూ, ఫైళ్లూ రైటింగ్ పేడ్ వున్నాయి.

ఒక్కో కాగితాన్ని, ఫైలునీ జాగ్రత్తగా పరిశీలించ సాగేను. అన్నీ బిజినెస్‌కు సంబంధించినవే. నాకు పనికి వచ్చే విషయాలేవీ లేవు. చివరికి రైటింగ్ పేడ్ అందుకున్నాను. దానిమీద బ్లాటింగ్ పేపర్ ఎక్కించి వుంది. క్లిప్‌కు కొన్ని తెల్ల కాగితాలు బిగించివున్నాయి.

పేడ్ వెనక్కితిప్పి చూసేను. బ్లాటింగ్ పేపర్‌కీ పేడ్‌కీ మధ్య ఏదో కాగితం కొస కనిపిస్తోంది. ఇవతలికి లాగేను. అది ఇంకా పూర్తి చెయ్యని ఉత్తరం! ఆతృతగా చదివేను.

"ప్రియమైన కుమార్తెకు!

నీ తండ్రి దీవించి వ్రాయుట. నీవక్కడ క్షేమంగా వున్నావని తెలుస్తున్నాను. రాజేంద్రన్ గురించి నీకిదివరకే రాసేను, ఏడాదినించీ అతని విషయంలో నాకేదో అనుమానం ఉందని. ఈ మధ్య అతని ప్రవర్తనలో విచిత్రమైన మార్పు వచ్చింది. ఇప్పుడతనిమీద నాకు నమ్మకం దాదాపు సన్నగిల్లిందనే చెప్పాలి.

అందుకే, రేపతన్ని ఉద్యోగంనించి తొలగించాలనుకుంటున్నాను. ఒకవేళ అతను నిన్ను బ్రతిమాలడానికి అక్కడికి వస్తే రానివ్వక! నా బిజినెస్ రహస్యాలెన్నో అతనికి తెలుసు. ఐనా, అతన్ని ఉద్యోగంనించి తొలగించడానికే నిశ్చయించేను......"

ఇది సేట్ తన కూతురికి రాసిన ఉత్తరమని తెలుస్తూనే వుంది. ఉత్తరం పూర్తి చెయ్యకుండా, పోస్టు చెయ్యకుండా ఎందుకుంచేడు? బహుశా, అతనీఉత్తరం రాస్తున్న సమయంలో గదిలోకి రాజేంద్రన్ వచ్చివుంటాడు. అతని కంట పడకుండా ఉత్తరాన్ని పేడ్ కింద దాచి వుంటాడు సేట్. తరవాత దాని సంగతి మరచిపోయుంటాడు.

లేదా, అదే రాత్రి ఏవో బలీయమైన కారణాలు ఎదురై, నటరాజన్‌ని పిస్తోలుతో కాల్చి చంపి వుంటాడు. ఆ దృశ్యం చూసిన రాజేంద్రన్ సేట్‌ని బ్లాక్ మెయిల్ చేసివుంటాడు. అందుకే అతన్ని ఇంతవరకూ ఉద్యోగంలోంచి తొలగించలేదు బన్సీలాల్!

దాంతో, కూతురికి ఈ ఉత్తరం పోస్ట్ చేసే అవసరం తీరిపోయింది.

ఇంతలో కింద ఫోన్ మోగుతున్న శబ్దం విని ఉలిక్కి పడి, రిస్టువాచీ చూసుకున్నాను. పన్నెండు గంటలు.

ప్రదీప్‌కుమార్ ఫోన్ చేస్తున్నాడేమో అనుకుంటూ గబ గబ కిందికెళ్ళి రిసీవర్ అందుకున్నాను.

"ప్రదీప్‌కుమార్ స్పీకింగ్!" అవతలినించి వినిపించింది.

"ఆ, నేనే మాట్లాడుతున్నాను. కనుక్కున్నావా?" అడిగేను.

"ఓ యస్! ఇక్కడికి ఐదుమైళ్ళదూరంలో చిన్న ఊరుంది. ఆ ఊరి పొలిమేరల్లో సేట్‌కు సంబంధించిన ఓ పాత మేడ ఉంది. బహుశా రాజేంద్రన్ సేట్ కూతుర్ని అక్కడికే తీసికెళ్ళివుంటాడని నా అనుమానం!"

"ఆల్ రైట్. ఇప్పుడే వస్తున్నాను. నాకోసం వెయిట్ చెయ్" అని రిసీవర్ దించి బైటికి నడిచేను.

పోర్టికోలో ఉన్న వ్యాన్ ఎక్కి బైలుదేరేను.

## 11

కన్ననూర్‌నించి ప్రదీప్‌కుమార్ని వెంటబెట్టుకుని, దారి వెదుక్కుంటూ ఆ మేడని చేరుకునేసరికి సూర్యుడు అస్తమించేడు.

చుట్టుప్రక్కల మనుష్య సంచారంలేదు. ఊరికి దూరంగా విసిరివేసినట్టుంది మేడ. గోడలన్నీ రంగు వెలసి నాచు పేరుకున్నాయి. అక్కడక్కడా పెచ్చులూడిన చిన్న పిట్ట కాంపౌండ్. సగం విరిగి, మూసివున్న చెక్క గేటు.

కొద్దిదూరంలో వ్యాన్ ఆపి, దిగి ఇంటిని సమీపించాం. చెక్క గేటు తోసుకుంటూ కాంపౌండ్‌లోకి నడిచాం. అక్కడంతా గజం ఎత్తు గడ్డి మొలిచి ఉంది.

ఇంటి తలుపులు మూసివుంది. గడియకి పెద్ద సైజు తాళం కప్ప వేళ్ళాడుతోంది. వరండా మెట్లెక్కి తలుపుని సమీపించాం.

"తాళం వేసుందే! లోనికెలా వెళ్ళడం?" అన్నాడు ప్రదీప్ కుమార్.

నవ్వి— "తాళం తెరిచే కిటుకు నా దగ్గిరుంది" అంటూ జేబులో చెయ్యి పెట్టేను.

"ఇద్దరూ బుద్ధిగా చేతులెత్తండి!" అన్న కంఠం విని ఉలిక్కిపడి వెనుదిరిగాం.

ముప్ఫైఏళ్ళుంటాయతనికి. కండలు తిరిగిన ఒళ్ళు. మొహంమీద స్ఫోటకం మచ్చలు. చేతిలో నల్లగా నిగనిగ మెరుస్తోన్న పిస్తోలు!

"ఇన్ స్పెక్టర్ రాజారెడ్డిగారా! మద్రాసునుంచి ఇక్కడికెలా దయచేసేరు?" అన్నాడు నన్ను చూస్తూ.

వీడెవడో పాత కేడీ అయ్యుంటాడు. అందుకే నన్ను గుర్తుపట్టేడు. తాళం తెరిచే పనిముట్టుకోసం నేను జేబులో చెయ్యి పెట్టడం మంచిదే అయింది. ఆ జేబులోనే గుళ్ళు నిండిన పిస్తోలు ఉంది.

"శిల్లంకొట్టిన రాయిల్లా చూస్తారేం? చేతులెత్తండి!" అన్నాడతను కరుగ్గా.

నా చెయ్యి ఇవతలికి రావడం, పిస్తోలు పేలడం, గుండు వాడి జబ్బలో దిగడం అంతా అరక్షణంలో జరిగిపోయేయి.

జబ్బ పట్టుకుని అరుస్తూ కింద కూలేడు. ఆ షాక్ లోంచి తేరుకోకముందే ఇద్దరం వాడి దగ్గరికి పరిగెత్తాం. ప్రదీప్ కుమార్ మెరుపులా వాడి చేతిలోంచి పిస్తోలు లాక్కున్నాడు.

నా టై విప్పి వాడి చేతులు వెనక్కి విరిచి కట్టేసేను. ప్రదీప్ కుమార్ తన టైతో వాడి కాళ్ళు బిగించి కట్టేడు. నేను జేబులు వెదికి తాళం చెవులు తీసుకున్నాను.

ఇద్దరం తలుపు దగ్గరికెళ్ళి-తాళం తెరిచి ఇంట్లో అడుగు పెట్టాం. హాలు మధ్య కుర్చీలో చేతులు వెనక్కి విరిచి కట్టేయబడుంది ఓ పద్దెనిమిదేళ్ళ యువతి! అరవకుండా నోటికి టేప్ అంటించేరు.

"సేట్ బన్సీలాల్ కూతురు ఈమే!" అన్నాడు ప్రదీప్ కుమార్.

ఇద్దరం ఆ యువతిని సమీపించాం.

# 12

బన్సీలాల్ ఇంటి పోర్టికోలో వ్యాన్ ఆపి, రిస్టువాచీ చూసుకున్నాను. రాత్రి ఏడుగంటలు. ఈ పాటికి వాళ్ళు కన్ననూర్ నించి తిరిగి వచ్చివుంటారు. వ్యాన్ దిగి ఇంట్లోకి నడిచేను.

అనుకున్నట్టే ముగ్గురూ హాల్లో కూర్చున్నారు.

సేట్ నన్ను చూడగానే "మిస్టర్ ముకుందరావ్! ఏమిటీ మోసం? ఆ హోటల్లో మీరు చెప్పిన పేరుగల వ్యక్తి ఎవ్వరూ ఇంకా రాలేదు. నాలుగ్గంటల వరకూ చూసి చూసి విసుగెత్తి వచ్చేశాం. మీకసలు ఆ హారం అమ్మాలనుందా లేదా?" అన్నాడు మండిపడుతూ.

"అనవసరంగా మిమ్మల్ని శ్రమపెట్టినందుకు క్షమించండి సేట్ జీ. ఇదుగో, ఇప్పుడే వచ్చింది హారం! స్వీకరించి రసీదూ, చెక్కూ రాసివ్వండి" అన్నాను జేబులోంచి హారం తీసి అందిస్తూ.

హారాన్ని చూడగానే సేట్ కళ్ళు తళతళ మన్నాయి.

దాన్ని అటూ ఇటూ తిప్పి పరిశీలించి "చెక్ బుక్ తీసుకు రా!" అన్నాడు రాజేంద్రన్ తో. అతను లేచివెళ్ళి చెక్ బుక్, రసీదు పుస్తకం పట్టుకొచ్చేడు. సేట్ హారాన్ని టీపాయ్ మీద పెట్టి రసీదూ, చెక్కూ రాసిచ్చేడు.

వాటిని జేబులో పెట్టుకుని చటుక్కున టీపాయ్ మీద హారం అందుకోబోయేను. సేట్ గబుక్కున దాన్నిలాక్కోడానికి చెయ్యిచాపేడు. పిడికిలి బిగించి అతని మొహం మీద ఒక్కటి ఇవ్వబోయేను. సేట్ అనాయాచితంగా ఎడం చేత్తో ఆ దెబ్బని ఆపడానికి ప్రయత్నించేడు.

నాకు నవ్వాగలేదు.

"ఏమిటీ న్యూసెన్స్? నీకేమైనా పిచ్చి పట్టిందా?" అరిచేడు సేట్.

"నీ అద్భుత నటన ఇక చాలు మిస్టర్ నటరాజన్!" అన్నాను.

'నటరాజన్' అనగానే ఆ ముగ్గురూ అదిరిపడ్డారు.

సేట్ పక్కలో పిడుగుపడ్డట్టు అదిరిపడి, వెంటనే తమాయించుకుని "ఏమిటీ పిచ్చిప్రేలాపన? గెటవుట్!" అన్నాడు అరుస్తూ.

"ఎంత నటించినా ఇహ లాభంలేదు నటరాజన్! నీవు అసలు సేట్ వి కావు. అసలు సేట్ ని హత్యచేసి, అతనిలా మేకప్ జేసుకుని, నీ నటనాకౌశలంతో అందర్నీ నమ్మిస్తున్నావ్, కాని, విధిని నమ్మించడం అంత సులభతరం కాదు.

నీ బండారం కాకతాళీయంగా నా ద్వారా బద్దలైంది. నేనెవర్నో నీకు తెలుసా? నాపేరు రాజారెడ్డి! మద్రాసు క్రయింబ్రాంచ్ ఇన్ స్పెక్టర్ని. మీరు ముగ్గురూ పథకం

వేసి, సేట్ బన్సీలాల్ నూ, ముసలి కాపలాదారు మురు గేషన్నూ దారుణంగా చంపేరు. పథకంవేసి జేసిన హాత్యలకి శిక్ష ఏమిటో తెలుసా? మరణశిక్ష!

ఎంత పథకంవేసి నేరంచేసినా, నేరస్థులు పట్టుబడక తప్పదని తెలిసీ మీలాంటి మనుషులు మరణం కోరి తెచ్చు కుంటారు...'' అన్నాను జేబులో చెయ్యిపెడుతూ.

అప్పటికే రాజేంద్రన్, సుందరన్ లో చలనం వచ్చింది. చటుక్కున జేబులోంచి చెయ్యి బైటికి తీసేను. నా చేతిలో నిగనిగ మెరుస్తున్న పిస్తోలు చూడగానే, ఇద్దరూ తిరిగి సోఫాలోకి అతుక్కుపోయేరు.

''మీలో ఏ ఒక్కరు కదిలినా, కుక్కను కాల్చినట్టు కాల్చిపారేస్తాను'' అంటూ నోటితో ఈల వేసేను.

బైట వ్యాన్ లో కూర్చుని దానికోసమే ఎదురు చూస్తున్న ప్రదీప్ కుమార్, సేట్ కూతురు మృదులా, స్థానిక పోలీసులూ తక్షణం అక్కడికి వచ్చేరు. వాళ్ళని చూడగానే ఆ త్రిమూర్తులు కొయ్యబారిపోయేరు.

''ఇన్ స్పెక్టర్ గారూ! వీడెవ్వడో మా నాన్న వేషంలో వున్నా నాన్న మాత్రం కాడు!'' అంది మృదుల వెంటనే.

''ఔను ఇన్ స్పెక్టర్! ఆ అమ్మాయి చెప్పింది నిజమే. నేను సేట్ బన్సీలాల్ ని కాదు. ఇందులో నా తప్పేం లేదు. తప్పంతా ఈ రాజేంద్రన్ దే! వీడివల్లే నేనీ రొంపిలో ఇరుక్కున్నాను.

సేట్ బన్సీలాల్ కూ, నాకూ ఆకారంలోనూ, రూపం లోనూ దగ్గరిపోలికలున్నాయి. అందుకే ఈ రాజేంద్రన్ నన్నిక్కడికి తీసుకువచ్చేడు. తనీ ఉద్యోగంలోంచి తీసి వెయ్యబడక ముందే, అసలు సేట్ ని ఎక్కడో బంధించి,

నా ద్వారా ఈ హారాన్నీ, ఇంట్లోవున్న నగానట్రనీ కాజేసి పారిపోవాలని పథకం వేసేడు.

ముందుగా నేనీ పథకంలో పాల్గొనడానికి నిరాకరించేను. దాంతో వీడి కిరాయి హంతకుణ్ణి నామీద నియమించేడు'' అంటూ సుందరన్ వైపు చూపించేడు నటరాజన్.

''నేను తను చెప్పినట్లు వినకుంటే, ఈ కిరాయి హంతకుడిచేత హత్య చేయిస్తానని బెదిరించాడు. దాంతో, విధి లేక ఒప్పుకున్నాను.

సేట్‌లావున్న నా రూపాన్ని మేకప్‌తో ఇంకా స్త మెరుగులు దిద్దుకుని ఈ ఇంట్లో ప్రవేశించేను. అప్పుడే సేట్ నన్ను చూసేడు. గొడవ జరిగింది. అతన్ని కేవలం బంధించి మా పని చేసుకుపోవాలన్న పథకం దాంతో తారుమారయింది. నేను భయపడి సేట్‌ని కాల్చేశాను.

అతని శవాన్ని ఓ చోట పూడ్చేసి, నా బట్టలూ అవీ వున్న సూట్‌కేస్ స్టోర్‌రూం అటకమీద దాచి, మర్నాటి నించీ సేట్ స్థానంలో అతనిలా నటించసాగేను... ఇంతలో బెనారస్‌నించి సేట్ కూతురు వస్తున్నట్టు టెలిగ్రాం రావడంతో నేను భయపడ్డాను.

ఎంత మేకప్ చేసుకున్నా, కన్నకూతురు తండ్రి స్వరూపాన్ని గుర్తుపట్టకపోతుందా? అందుకే, ఆమె ఇక్కడికి రాకుండా అడ్డుపడమని రాజేంద్రన్ని కన్ననూర్ పంపేను. అతనామెని కార్లో ఇంకెక్కడికో తీసికెళ్ళి బంధించి వచ్చేడు...

తరవాత, కాకతాళీయంగా కన్ననూర్ బజార్లో సుందరన్‌కు కాపలాదారు మురుగేషన్ కనిపించాడు'

వాడిక్కడ ఎన్నో ఏళ్ళనించి పని చేస్తున్నాడు. నన్ను చూసేడంటే, నేను అసలు సేట్ ని కానని పసిగట్టేస్తాడు. అందుకే సుందరన్ దార్లో వాణ్ణి చంపేసేడు.

ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నా, ఇంతటి బలమైన పథకం వేసుకున్నా చివరికి ఏమీ సాధించలేకపోయాం!" అన్నాడు నటరాజన్ తల దించుకుంటూ.

కన్నతండ్రి ఇప్పుడీలోకంలో లేడని తెలీగానే, మృదుల చేతుల్లో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడవ సాగింది.

—: ఐ పో యిం ది :—

# అబద్ధమాడి చూడు!

వసుంధర

బాబాకి శ్రీనివాసు వ్యవహారం నచ్చలేదు. వాల్తేర్లో ట్రయినెక్కినప్పట్నించీ శ్రీనివాసు ఏకదీక్షతో పేపరు చదివేస్తున్నాడు. ట్రయినిప్పుడే తుని చేర బోతోంది కానీ శ్రీనివాసు పేపరు చదవడం పూర్తి కాలేదు.

"నేరకపోయి నీతో బయల్దేరాను. ఓ కాలక్షేపం లేదు. పాడూలేదు. పేపరు ముందేసుకుని కూర్చున్నావ్" అన్నాడు బాబా చిరాగ్గా.

"ఏమిట్రా నీ గోల ఎప్పుడూ పేపరు చదవని వెధవ్వి అందులో మజా నీకేం తెలుస్తుంది. ఎప్పుడో ఇలా ట్రయి నెక్కినప్పుడు తప్పితే తీరుబడిగా పేపరు చదివే అదృష్టం నాకు మాత్రమెక్కడిది?" అన్నాడు శ్రీనివాసు.

"పేపరు చదవడం అదృష్టమంటావ్. నీకు తెలుసో తెలియదో ఒక ప్రముఖ ఇంగ్లీషు రచయిత న్యూస్ పేపర్సు చదవడం గురించి ఏమన్నాడో తెలుసా ఏ పుస్తకమూ చదవని వాడుకూడా నిత్యం న్యూస్ పేపర్సు చదివేవాడి కంటే మెరుగన్నాడు..."

"ఈ ప్రపంచంలో అన్నింటినీ సమర్ధిస్తూ, అన్నింటినీ విమర్శిస్తూ సామెతలున్నాయి. వారివారి అభిరుచులనుబట్టి ఆయాసామెత లుపయోగిస్తూంటారు" అని తీసిపారేశాడు శ్రీనివాసు.

"ఛాలెంజి నువ్విప్పుడు పేపర్లో చదువుతున్న వార్తల్లో ప్రతి ఒక్కదానిగురించీ నీకంటె నాకే ఎక్కువ తెలుసునని ఋజువు చేస్తాను" అన్నాడు బాబా. బాబా వార్తాపత్రికలు బొత్తిగా చదవని బాపతు కాదు. క్రీడారంగం అతని అభిమాన పేజీ. మిగతావన్నీ హెడ్ లైన్సు చూస్తాడు. ఇప్పుడు తను చేసిన ఛాలెంజి తన ప్రతిభ ప్రదర్శించాలనే ఉద్దేశ్యంతో చేసింది కాదు. కాసేపు శ్రీనివాసుని పేపరు చదవకుండాఆపి కబుర్లలో దింపాలని అతని ఉద్దేశ్యం.

బాబా మాటలకు శ్రీనివాసుకి పౌరుషం వచ్చింది. అతను రాజకీయపరమైన కొన్ని వార్తలు గురించి అడిగేడు. వాటికి బాబా తనకు తెలిసినవి, తోచినవి, కల్పించినవి చెప్పేడు. నిజంగానే అతనికి శ్రీనివాసుకంటే ఎక్కువ తెలుసుననిపించేలా మాట్లాడేడు.

బాబా తెలివైనవాడు. చలాకీ ఐనవాడు. తనకి నా అన్నవాళ్ళు లేరు. దూరపు బంధువుల ఇంట్లోవుండి మెట్రిక్

అనిపించుకున్నాడు. పైపూ, పార్టుప్యాండూ వచ్చును. అతనికి ఉద్యోగం లేదు. ఏ రకం పని చేయడానికైనా అతనికి నామోషీ లేదు. డబ్బుకోసం అతను హోటల్లో సర్వింగ్ చేశాడు. బస్సుస్టాండులో బరువులు మోసాడు. మధ్యమధ్యలో ఓ ఉద్యోగానికి అప్లికేషన్ పడేస్తూండే వాడు.

ఇప్పుడతనికి రాజమండ్రిలో ఏదో ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చింది. ఇంటర్వ్యూకింకా రెండ్రోజులు టయిముంది. కానీ ప్రస్తుతం అతను వాల్తేర్లో ఓ పది రోజుల్నించి శ్రీనివాసు ఇంట్లో వుంటున్నాడు. బస్సు స్టాండులో బాబా పరిస్థితి చూసి శ్రీనివాస్ అతన్ని తనింటికి పిల్చుకువెళ్ళాడు.

శ్రీనివాస్, బాబాకు హైస్కూలు స్నేహితుడు. శ్రీనివాస్ మధ్యతరగతి బాబులబిడ్డ. బుద్ధిమంతుడు. తన చదువు, పుస్తకాలు తప్ప రెండో ప్రపంచం అతనికి తెలియదు. సెకండ్ ఫారంనించి ఫోర్త్ ఫారంవరకూ వీళ్ళిద్దరూ క్లాస్ మేట్సు. బాబాది ఫోర్త్ ఫారం పరీక్షపోయింది. వెంటనే అతని బంధువు చదువు మానిపించి మెట్రిక్ కి కట్టించాడు. మెట్రిక్ ఆరో ప్రయత్నంలో ప్యాసయ్యాడు బాబా.

ప్రతివార్త గురించీ తనకంటె బాబా ఎక్కువగా ఏకరువు పెడుతుంటే శ్రీనివాసుకి పౌరుషం వచ్చేస్తోంది.

తెలిగ్గా ఉడికిపోయే స్వభావం అతనిది. అందుకని అడ్డమైన వార్తలగురించీ బాబాని ప్రశ్నించసాగాడతను. అలా మాట్లాడుతూండగా గజదొంగ గంగన్న వార్త వచ్చింది.

"అది సరే గజదొంగ గంగన్న గురించి నీకేం తెలుసో చెప్పు" అన్నాడు శ్రీనివాస్.

బాబా నవ్వి "ఈ మాత్రానికి పేపరు చదవాలా అత గాడు ఒక్కడూ ఒక్క రాత్రిలో పదిమంది నగల వర్తకుల ఇళ్ళు దోపిడి చేశాడు. ఈ సంగతి దేశమంతా తెలుసు" అన్నాడు.

"అంతేనా నీకు తెలిసింది" అన్నాడు శ్రీనివాస్.

"ఇంకా తెలుసు. ఆ తర్వాత పోలీసులకు దొరికి పోయాడు. కానీ అతను దోచిన సొమ్ము మాత్రం ఇంత వరకూ ఎవరికీ దొరకలేదు. పోలీసులు శతవిధాల ప్రయ త్నించి కూడా గంగన్న చేత ఏమీ చెప్పించలేక పోయారు" అన్నాడు.

"అంతేనా నీకు తెలిసింది" అన్నాడు శ్రీనివాస్.

క్షణంకూడా తటపటాయించకుండా "గంగన్న ఆ సొమ్మెక్కడ దాచాడో కూడా నాకు తెలుసు. గంగన్న తర్వాత ఈ ప్రపంచంలో ఆ విషయం తెలిసిన వాడిని నేనొక్కణ్ణే ననుకుంటాను" అన్నాడు బాబా.

అంతేనా అనబోయి ఆగిపోయాడు శ్రీనివాస్. బాబా అన్న మాటలకతను తెల్లబోయాడు. క్షణం తర్వాత తేరు కుని "కోయ్" అన్నాడు.

"కోతలు కాదు నేను నిజమే చెబుతున్నాను" అన్నాడు బాబా.

"ఇంపాజిబుల్" అన్నాడు శ్రీనివాస్.

"నువ్వు నమ్మకపోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. కానీ, దోపిడీ జరిగిన మర్నాడు అనుకోని విచిత్ర పరిస్థితుల్లో గంగన్న, నేను కలుసుకున్నాం" అన్నాడు బాబా.

శ్రీనివాస్ ముఖంలో అనుమానం స్పష్టంగా కనిపిస్తోంది. "అయితే నీకీ కర్మేమిటి? హాయిగా ఆ సొమ్మంతా అనుభవించవచ్చుగా..." అన్నాడు.

"నాకేమీ అభ్యంతరం లేదు. కానీ, అదంతా నగల రూపంలో వుంది. మార్చుకోవడం నాబోటివాడివల్ల కాదు. తర్వాత రెండో భయం ఏమిటంటే గంగన్నను వదిలిపెట్టారంటే అతగాడు తిన్నగా వచ్చి నామీద పడతాడు. అందులో పూచికపుల్లకూడా ముట్టుకోనని వాగ్దానం చేశాను. నా వాగ్దానం నిలబెట్టుకుంటే తిరిగి వచ్చేక తనే సగం వాటా ఇస్తానన్నాడు. నిలబెట్టుకోకపోతే ప్రాణాలు తీస్తానన్నాడు."

"బాగానేవుంది. అయితే గంగన్న ఆ సొమ్ము ఎక్కడ దాచాడంటావ్?"

"అమ్మో—అది చెప్పకూడదు. గోడలకు చెవులుండవచ్చు" అన్నాడు బాబా.

అతనా మాటలన్న సమయానికి ఈ మాటలను శ్రద్ధగా వింటూ పైబెర్తుమీద కూర్చునివున్న ఒక మనిషి చటుక్కున బెర్తుమీంచి క్రిందకురికాడు.

అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. అతనికి పెద్ద మీసాలున్నాయి. నల్లపాంటుమీద తెల్లషర్టు వేసుకునివున్నాడు. వయసు ముప్పైసంవత్సరాలకు మించివుండదు.

అతను బాబావైపు చూసి పలకరింపుగా నవ్వి బాబా ఎదుటి సీట్లలో ఖాళీ చేసుకు కూర్చున్నాడు.

## 2

"ఇంక పెళ్ళివాయిదా వేయడానికి వీల్లేదు" అంది యమున.

"ఏం?" అన్నాడు చంద్రభాను.

"నువ్వు తండ్రివి కాబోతున్నావు" అంది యమున.

"పెళ్ళికాకుండా ఆడది తల్లి అవుతుందేమో కానీ, మగవాడు తండ్రి కాలేడు."

"కానీ నువ్వయ్యావు?"

చంద్రభాను నవ్వి "నేనేనని ఏమిటి సాక్ష్యం?" అన్నాడు.

"నువ్వే?" అంది యమున.

"నా సాక్ష్యాన్ని నువ్వునమ్మే పక్షంలో నేను చెప్పేదిది. నేను నిన్ను ప్రేమించిన మాట వాస్తవం. కానీ, ఎన్నడూ హద్దు మీరలేదు. నీ ప్రవర్తన సరైనది కాదని ఈ రోజే తెలిసింది కాబట్టి నీకూ నాకూ ఈ రోజునించీ ఇంకే సంబంధమూ లేదు..." అని చంద్రభాను క్షణం ఆగకుండా అక్కణ్ణించి విసవిసా నడుచుకుంటూ వెళ్ళి పోయాడు.

యమున కదలలేక అక్కడే అలా ఉండిపోయింది. చంద్రభాను అసలు స్వరూపం గురించి జానకి చెప్పినది నిజమేనన్నమాట!

అదృష్టవశాత్తూ నిన్న తను జానకిని కలుసుకున్నప్పుడు తన ప్రేమ వ్యవహారం చెప్పింది. జానకి ఆశ్చర్యపడి— "ఎవరినీ-నువ్వు ప్రేమిస్తున్నది చంద్రభానునా?" అంది.

"ఏం?" అంది తను.

"వాడు పరమ నీచుడు. మోసగాడు. ఇప్పటికి నలుగు రైదుగురు ఆడపిల్లల్నయినా వాడు మోసగించి వుంటాడు. వివరాలు నన్నడగొద్దు. రేపు కలుసుకున్నప్పుడు తల్లిని కాబోతున్నానని చెప్పు. వాడి నిజ స్వరూపం బయటపడు తుంది—" అంది జానకి.

ఇప్పుడు చంద్రభాను నిజ స్వరూపం బయటపడింది. ఇంతవరకూ దేవుడు తనను కాపాడాడు. కానీ ఇకముందు తన్ను తనే కాపాడుకోవాలి.

కానీ యమున మనసు బాగోలేదు. ఆమె చంద్రభానును మనసారా ప్రేమించింది. అతని మాయ మాటలు నమ్మింది. తన కన్నెవయస్సు అర్పించింది. ఇప్పుడు తను మోసగాడని తెల్సిపోయింది.

కాస్సేపాగి లేచి యమున ఇంటికి వెళ్ళింది. గుమ్మంలోనే ఉరిమి చూసే కళ్ళతో తండ్రి కనిపించాడు. ఆమె లోపలకు రాగానే తలుపులు వేసి_ "అయితే నేను తాతను కాబోతున్నానన్నమాట_" అన్నాడు.

యమున తెల్లబోయింది. ఆమె నోట మాట రాలేదు.

"మీరిద్దరూ పార్కులోకి వెళ్ళడం నేను చూశాను. విషయం తెలుసుకుందామని మీకు తెలియకుండా వెనకాలే వచ్చాను—" అన్నాడు రమణరావు.

కసితీరా తండ్రిని తిట్టనిచ్చి-అప్పుడు నెమ్మదిగా వివరాలు చెప్పింది యమున. తను తల్లిని కాబోతున్న విషయం అబద్ధమని చెప్పింది కానీ కాలుజారిన సంగతిమాత్రం ప్రత్యేకించి చెప్పలేదు.

కూతురు చేసిన తప్పు ప్రమాదానికింకా దారి తీయలేదని_ తెలియగానే రమణరావు ముఖంలో సంతోషం కనబడింది_ "వాడు_ఆ చంద్రభానుగాడు కామయ్య కొడుకు గదూ_..." అన్నాడు.

తలాడించింది యమున.

"రమణరావంటే ఏమిటో కామయ్యకు చెబుతాను" అంటూ ఆక్రోశించి కదిలాడు రమణరావు.

# 3

"ఓహో– ఆ ఇంటర్వ్యూకా మీరు బయల్దేరారు?" అన్నాడు మీసాలతను చిన్నగా నవ్వుతూ.

"మీరూ ఆ ఇంటర్వ్యూకేనా?" అన్నాడు బాబా నీరసంగా.

"ఆ ఇంటర్వ్యూకే– కానీ ఉద్యోగానికి కాదు. అభ్యర్థులను ఎన్నిక చేయడానికి—" అన్నాడు మీసాలు హుందాగా.

బాబాకర్థమైపోయింది. అతను క్షణంసేపు మాట్లాడలేదు. ఏం మాట్లాడాలో తోచలేదు. చూడగానే తెలుస్తోంది– ఈ మీసాలు పెద్ద హోదాలో ఉన్నాడని. అయితే ముఖమే అంత నచ్చుబాటుగాలేదు. విలన్‌లా ఉన్నాడు. కానీ మీసాలు తల్చుకుంటే తనకుద్యోగం వస్తుంది. వస్తే తన జీవితమే మారిపోతుంది.

ట్రయిన్ కడియం దాటుతోంది. "వచ్చేస్తోంది రాజమండ్రి!" అన్నాడు శ్రీనివాస్.

"సార్!" అన్నాడు బాబా –"ఎలా చెప్పాలో నాకు చేతకాదు. సూటిగా అడిగేస్తున్నందుకు మన్నించండి. నాకా ఉద్యోగం వచ్చేలా మీరు చూడాలి..."

మీసాలు నవ్వుతూనే "మీరలాగడగడంలో తప్పులేదు. నేనే స్వయంగా నా గురించి చెప్పకపోతే మీరు నన్నేమీ అడిగివుండేవారు కాదు. కానీ ఉద్యోగమివ్వడం ఒక్క నా చేతుల్లోనే లేదు. ఇంటర్వ్యూబోర్డులో శంకర్రావుగారని ఒక చండశాసనుడున్నాడు. ఆయన అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పనివాడికి ససేమిరా ఉద్యోగం ఇవ్వడానికి వీల్లేదంటాడు. ఎటొచ్చీ కాస్త

ముందుగానే ఆయన్ను కలుసుకుని కష్టం చెప్పుకుంటే మనిషి కరుగుతాడు. తనేం ప్రశ్నలడుగుతాడో చెబుతాడు. నేనిప్పుడు శంకర్రావుగారింటికే వెడుతున్నాను. మీరుకూడా ట్రెయిన్ దిగగానే నాతోపాటు బయల్దేరి వస్తే మిమ్మల్నాయనకు పరిచయం చేస్తాను'' అన్నాడు.

''నాతో ఎందుకు బయల్దేరానా అని ఏడ్చావ్ ఇప్పుడు చూడు. నీగొట్టి విరిగి నేతిలో పడింది'' అన్నాడు శ్రీనివాస్.

బాబా మాట్లాడలేదు. అతని మనసునిండా సంతోషమే ఇప్పుడు. మీసాలుకు థాంక్స్ చెప్పి అతను కలలు కనబోతూ ట్రయిన్ రాజమండ్రి స్టేషన్లో ఆగగానే ఈ లోకంలోకి వచ్చేశాడు.

స్టేషన్ బయటకు రాగానే వీళ్ళ ముగ్గుర్నీ రిక్షావాళ్ళు చుట్టేశారు.

''ప్రకాషనగర్'' అన్నాడు మీసాలు ఒక రిక్షాలో కూర్చుంటూ. అతని పక్కనే బాబా కూర్చున్నాడు. శ్రీనివాస్ ఇల్లు స్టేషన్కు దగ్గర్లోనే ఉంది. బాబాకు సంబంధించిన ఎయిర్ బ్యాగు భుజానికి తగిలించుకుని తన బ్రీఫ్ కేస్ చేత్తో పట్టుకుని అతను రోడ్డుమీదకు నడిచాడు.

రిక్షా ఇన్నీస్ పేట వరకూ వచ్చేక మీసాలు ''అన్నట్లు మనమిప్పుడు వెళ్ళవలసింది శంకర్రావుగారింటికి కదూ అలవాటు ప్రకారం బంధువులుండే పేట చెప్పేశాను'' అని బాబాతో చెప్పి ''ఆ డబ్బులే యిచ్చేస్తాను. రిక్షా మూడు లాంతర్ల జంక్షన్ దగ్గర ఆపుచేసేయ్'' అన్నాడు రిక్షావాడితో.

రిక్షా మూడు లాంతర్ల జంక్షన్ దగ్గర ఆగింది. అక్కడ

నుంచి పక్క సందులోకి తీసుకుపోయాడు బాబాని మీసాలు. ఆ సందులో ఒక చిన్న పెంకుటిల్లు ముందర ఆగి తలుపుతట్టాడు మీసాలు.

తలుపుతీసిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు బాబా. మనిషి లావుగా బలంగావున్నాడు. నున్నగా గీసిన గుండు. తన పక్కనున్న వ్యక్తికంటె పెద్దమీసాలు. ఎర్రనికళ్ళు చూపులు భయంకరంగా ఉన్నాయి. చొక్కా వేసుకో లేదు. పువ్వులలుంగీ దాన్ని పటకాబెల్టుతో బిగించాడు. మీసాలుతోపాటు అతను లోపల అడుగు పెట్టేక— "ఈయన శంకర్రావు" అన్నాడు మీసాలు.

బాబా చుట్టూ చూశాడు. ఆ గుండు భయంకరుడు తప్ప ఇంకెవ్వరూ లేదాగదిలో. ఇంటర్వ్యూ బోర్డు మెంబరు శంకర్రావు అలా వుంటాడంటే బాబాకు మన సొప్పలేదు.

# 4

రమణరావు తలుపుతీసి గదిలోకి వెళ్ళాడు. మళ్ళీ తలుపులు మూశాడు.

ఇంట్లో ఆయన ప్రత్యేకపు గది అది.

ఆ గదికి మూడు గోడల్లో బీరువాలు తాపడం చేయబడి వున్నాయి. చూసి అక్కడ బీరువాలున్నాయని తెలుసుకోవడం సాధ్యం కాదు.

బీరువాకు తాళం పెట్టవలసిన చోట వున్న రంధ్రం కనబడకుండా డెకరేషన్ బొమ్మలు తగిలించారు. ఆబొమ్మ తీస్తే అక్కడ చిన్న మేకువుంటుంది. ఆ మేకు బలంగా వుంటుంది. దాన్ని తిప్పడానికి రెంచివంటి సాధనముంది రమణరావు దగ్గర. ఆ రెంచితో తప్ప ఆ మేకును తిప్పడం

సాధ్యంకాదు. ఆ మేకును ఎడమవైపు కొన్నిసార్లు కుడి వైపుకొన్నిసార్లు అని ఏదో కోడ్ లెక్క వుంది. అప్రకారం తిప్పితే బీరువా తెరుచుకుంటుంది.

రమణరావు మొదటి బీరువా తెరిచి డబ్బు లెక్క పెట్టాడు. అన్నీ వందరూపాయల నోట్లు. పన్నెండు లక్షలున్నాయి. ఆయన నిట్టూర్చి 'ఇంత డబ్బుండీ ఇలా మామూలు జీవితం గడపాల్సి వస్తోంది' అనుకున్నాడు.

ఆ బీరువా మూసేసి రెండో బీరువా తెరిచాడు. దాని నిండా ఏవేవో కాగితాలు, ఫోటోలు వున్నాయి. అవి చూసి రమణరావు అదోలా నవ్వుకున్నాడు.

అవి ఆ నగరంలోని ప్రముఖులకు సంబంధించిన రహస్య పత్రాలు, ఫోటోలు. వీటి సాయంతో రమణరావు బ్లాక్ మెయిల్ చేసి డబ్బు సంపాదిస్తూంటాడు.

రమణరావు స్మగ్లర్ అని చాలామందికి తెలుసును కానీ బ్లాక్ మెయిలర్ అని ఎవరికీ తెలియదు. అందుకు కారణం ఏమీ లేదు. ఆయన తనకు తానై ఎవరినీ బ్లాక్ మెయిల్ చేయలేదు. పోస్టులో ఫోటోలు పంపుతాడు. డబ్బు తీసుకునే విధానం అత్యంత విచిత్రమైనది.

నగరంలో గోదావరి ఒడ్డున ఒక పార్కులో నోరు తెరిచిన రాక్షసుడి విగ్రహం వుంది. ఆ విగ్రహం నోట్లో డబ్బు వేయమని ఆయన రాస్తాడు. ఆ విగ్రహానికి బొడ్డు దగ్గర ఉన్న కన్నంలో తాళం చెవి పెట్టి తిప్పితే పొట్ట మీద తలుపు తెరుచుకుంటుంది. ఏదో అర్ధరాత్రి సమయంలో ఎవరికీ తెలియకుండా తన డబ్బు తను తెచ్చుకుంటాడు.

ఆ విగ్రహాన్ని ఆ పార్కులో పదిహేనేళ్ళ క్రితం ఒక

ప్రముఖుడు ప్రతిష్ఠింపజేశాడు. రమణరావు ఆ విగ్రహాన్ని తయారు చేస్తున్న శిల్పిని కలుసుకుని తన కోరిక మేరకు ఆ విగ్రహాన్నివిధంగా తయారు చేయించాడు. అందుకా శిల్పికి రమణరావునుంచి పదివేలరూపాయలు బహుమతిగా లభించాయి.

కానీ విగ్రహం ప్రతిష్టించిన రెండ్రోజులకా శిల్పి అనుమాన పరిస్థితులలో మరణించాడు. పోలీసులు కేసురిజిస్టర్ చేశారు కానీ ఫైలు ఏమాత్రం ముందుకు నడవలేదు. రమణరావు బ్లాక్ మెయిలింగ్ మాత్రం అద్భుతంగా కొనసాగిపోతోంది.

రమణరావు ఆ బీరువాకూడా మూసేసి మూడోది తెరిచాడు.

అందులో స్మగ్లింగ్ కు సంబంధించిన రకరకాల వస్తువులున్నాయి. వజ్రాలు, ముత్యాలు, నగలు కెమేరాలు వగైరాలు దానినిండావున్నాయి. రమణరావు ఆ బీరువాలోంచి చిన్నపెట్టె ఒకటి తీశాడు. అది తెరిచి అందులో తననుకున్నది వున్నదీ లేనిదీ చూశాడు. ఆ పెట్టె జేబులో వేసుకుని "చమన్ లాల్ తో ఈ రోజు దీని బేరం పైసలు చేసేయాలి. ఓ యాభైవేలు తక్కువైనా సరే—" అనుకున్నాడు.

## 5

కామయ్య టైము చూసుకున్నాడు. టైము ఉదయం పది గంటలైంది.

ఆయన కుర్చీలోంచి లేచి చొక్కా తొడుక్కుని ఇంటికి తాళం పెట్టి గోడ్డుమీదకు వచ్చాడు. చకచకా నడుచుకుంటూ ముందుకుసాగాడు.

దానవాయి పేటలో ఒక సందులోకి తిరిగాడాయన.

ఆ సందులో కామయ్యగారికి ఇంకో ఇల్లుంది. ఆ ఇల్లు అద్దెకిచ్చేశాడాయన. ఒకే ఒక గదిమాత్రం తనకోసం అట్టే పెట్టుకున్నాడు. ఇప్పుడాయన సరాసరి ఆ ఇంట్లోని ఆ గది లోకే వెళ్ళాడు. అది ఆ ఇంటి వీధిగది.

కామయ్య గది తలుపులు వేసుకుని గోడవారగావున్న పెట్టితీసి పక్కన పెట్టాడు. ఆ పెట్టిక్రింద లూజుగా పెట్టి వున్న రాతి పలకను తీశాడు. అక్కడ పడగవిప్పి ఆడు తున్న పామును చేత్తో పట్టుకుని తీసి బయట పెట్టాడు. అది రబ్బరుపాము.

మళ్ళీ ఆ పలక క్రిందస్థలంలో ఆయన చెయ్యి పెట్ట బోతుండగా ఎవరో గది తలుపులు తట్టారు.

కామయ్య కంగారుగా పామునీ, ఆ తర్వాత పలకనీ యథాస్థానంలోకి మార్చేసి దానిమీద పెట్టిపెట్టేసి వెళ్ళి తలుపు తీశాడు. ఆగంతకుడాయనకు పరిచయమైనవాడు కాడు. అతని కళ్ళు ఎర్రగావున్నాయి. అతనికి పెద్ద మీసాలున్నాయి. నల్లపాంటుమీద తెల్లషర్టు వేసుకుని వున్నాడు. వయసు ముప్పై సంవత్సరాలకు మించి వుండదు.

ఆగంతకుడు చటుక్కున లోపలకువచ్చి గది తలుపులు మూసి "కామయ్యగారూ నమస్కారం. మీరు అరవ డానికి ప్రయత్నించవద్దు. నా చేతిలోని రివాల్వర్‌కు సైలెన్సర్ అమర్చబడివుంది. అది మీరు అల్లరిచేసినప్పుడు మాత్రమే పనిచేస్తుంది" అన్నాడు.

కామయ్య తెల్లబోయి అతని వంక చూస్తూంటే అతను తలుపు గడియవేశాడు. "నేనెవరా, ఎందుకు వచ్చానా అని ఆలోచిస్తున్నారు కదూ. మీ సందేహాలు తీర్చవలసిన

అవసరం నాకుంది. ఉపోద్ఘాతాలతో సమయం వృధా చేయడం నాకిష్టంలేదు. గజదొంగ గంగన్న గురించి మీరు వినేవుంటారు. అతను దోచిన సొత్తు పోలీసులకు పట్టుబడేలోగా మీ చేతుల్లో పడిందని నాకు తెలుసు. వెంటనే దాన్ని నాకప్పగించి మీ ప్రాణాలు దక్కించుకోండి."

కామయ్య ఆశ్చర్యంగానూ, భయంగానూ ఆగంతుకుని చూసి "మీరంటున్న మాటల కర్థం నాకు తెలియడం లేదు" అన్నాడు.

"నటనలు కట్టిపెట్టండి. గది తలుపు సందులోంచి నేనంతా చూశాను. అదిగో ఆ పెట్టెక్రింద ఏముందో చూడ నివ్వండి" అన్నాడు ఆగంతకుడు.

ముందు తడబడినా తర్వాత నవ్వేశాడు కామయ్య. "మీరెవరో నాకు తెలియదు. నా దగ్గర దొంగ సొమ్ముందని ఎవరు చెప్పారో నాకు తెలియదు. నేనొక వడ్డీ వ్యాపారిని. అదే నా జీవనోపాధి. ఈ వ్యాపారం చేసుకునే వాళ్ళందరికీ కొన్ని నమ్మకాలుంటాయి. చూసే వాళ్ళకవి మూఢనమ్మకాల్లా కనపడవచ్చు. మా తాతల కాలంనుంచీ లక్ష్మీదేవిని భూమిలో దాచి కాపలాగా నాగుపామును పెట్టడం మా ఇంటి ఆచారంగా వస్తోంది. వినాయకుడి పూజచేసేవారు యథాశక్తి బంగారంలో కానీ, వెండిలో కానీ లేక మట్టిలోకానీ విగ్రహం తయారు చేసి పూజ చేసుకోవచ్చుగదా - నేను లక్ష్మీదేవి పేరిట రెండు ఇనుప గొట్టాలు - వాటికి కాపలాగా ఒక రబ్బరు పామువుంచాను చూడండి" అంటూ ఆగంతకుడిని తీసుకు వెళ్ళి చూపించాడు.

ఆగంతకుడు ఇనుప గొట్టాలను పరిశీలించి చూశాడు.

అవి గట్టిగావున్నాయి, ఒక్కొక్కటి అరంగుళాల పొడ వున్నాయి. సుమారు అంగుళం మందంలోవున్నాయి. వాటిలో అతనికేమీ విశేషం కనబడలేదు.

"మీ దగ్గర ఆ సొమ్ము ఉన్నట్లు నాకు చాలా నమ్మకంగా తెలిసింది. అందుకే ఉదయమే మీ ఇంటివద్ద కాపలా కాశాను. మీరు బయటకురాగానే మిమ్మల్నను సరిస్తూ వచ్చాను. అనుమానపరిస్థితుల్లో మీరిక్కడ కనపడగానే సొమ్ము దొరికిందనే అనుకున్నాను. ఇందులో ఏదో తిరకాసుంది. సొమ్ముదొరికేదాకా మిమ్మల్ని వదిలిపెట్టను" అన్నాడాగంతకుడు.

"సరే అంతా బాగానేవుంది. ఇంతకీ ఆ గజదొంగ గంగన్నెవరు? ఆ సొమ్మేమిటి? అది నా దగ్గర ఉండడమేమిటి? అన్నీ కాస్త వివరంగా చెబుతారా?" అన్నాడు కామయ్య.

అతను చిరాగ్గా కామయ్యవంక చూసి "తెలిసుండీ ప్రశ్నలు వేసేవాళ్ళంటే నాకు చాలా చిరాకు అయినా చెబుతాను వినండి" అంటూ పరిస్థితి వివరించి "మీ అన్నయ్యగారబ్బాయి బాబా చెప్పాడు. ఆ సొమ్ము మీ దగ్గరున్నదనీ మీరు చాలా పిసినారి అనీ ప్రాణాలు పోయినా అసలుసంగతి చెప్పరనీను. ప్రాణాలు తీయడం నాకు కొత్తకాదు. సొమ్ము సంగతి తెలియకపోతే ప్రాణాలు తీయడం ఈ క్షణంలో జరిగినా ఆశ్చర్యంలేదు, మీరింకేం చెప్పినా నేను నమ్మను" అన్నాడు.

అతని మాటల్లో కరకుదనం, చూపుల్లో కర్కశత్వం అన్నంత పనీ చేస్తానని కామయ్యకు తెలియజేసాయి. బాబా ఆయనకు స్వయాన అన్నకొడుకు. అన్నగారు

పోయినప్పుడు బాబా అతని తల్లి తన ఆశ్రయం కోరితే ఆయన నిరాకరించాడు. ఒక్క రూపాయైనా సహాయం చెయ్యడానికి నిరాకరించాడు. బాబా ఆయనమీద పగ బట్టాడు.

అతని తల్లిపోయినప్పుడు మరోసారి వచ్చాడు. సాయానికి వచ్చాడేమో అనుకుని చిల్లిగవ్వ ఇవ్వనుపో అన్నాడు తను.

అప్పుడు బాబా "నువ్వివ్వవని ఎలాగ తెలుసు. నేను వచ్చింది సాయంకోసం కాదు. సమయం వచ్చినప్పుడు నీమీద దారుణంగా పగ తీర్చుకుంటానని చెప్పిపోవడానికి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అప్పుడు వాడి వయసు పదేళ్ళుంటుందేమో! ఎవడో గూండా వెధవకి తప్పుడు సమాచారమందజేసి ఇప్పుడిలా పగ తీర్చుకున్నాడన్న మాట. అయితే తనేనా అంత తెలివితక్కువ వాడు. ఈ ఉపాయాన్నే తన శత్రువు మీదకు మళ్ళించాలి.

"చూడండి బ్రతకవలసినంత కాలం బాగానే బ్రతికాను నేను. జీవితం గురించి నాకట్టే బెంగలేదు. నన్ను నమ్మనని అంటున్నారు. కానీ గజదొంగ గంగన్న దోచిన సొమ్ము ఎక్కడున్నదో నాకు తెలుసు. నన్ను చంపినా మీకా సొత్తు దొరకదు. కానీ నా మాటలు నమ్మితే మీకు సమాచారం తెలుస్తుంది" అన్నాడు కామయ్య తాపీగా.

"ఎక్కడుంది?" అన్నాడాగంతకుడు.

"రమణరావు తెలుసా మీకు?" అన్నాడు కామయ్య.

# 6

నిరుత్సాహంగా పార్కు బెంచిమీద కూర్చున్నాడు బాబా.

తను చాలా దురదృష్టవంతుడు. ఇంటర్వ్యూ అయిపోయేకగానీ తనకా మీసాలు నించి విముక్తి లభించలేదు. అన్నిటికీ చెడ్డవాడయ్యాడు తను.

గంగన్న దోచిన సొమ్ము తన ఉద్యోగం పోగొట్టేసింది. అతను శ్రీనివాస్ ఇంటికి వెళ్ళలేదు. మీసాలు చెప్పిన ప్రకారం ఇలా పార్కులోకి వచ్చేశాడు.

వదిలేముందు మీసాలొక హెచ్చరిక చేశాడు. తనింకా వారంరోజుల పాటు ఈ రాజమండ్రిలోనే వుండాలిట. రోజూ సాయంత్రం ఏడుగంటలకు మీసాలింటికి వెళ్ళి హాజరు వేయించుకోవాలిట. లేకపోతే వెతికి వెతికి ప్రాణాలు తీసేస్తాడట ప్రస్తుతం తను మీసాలు చెప్పిన పని ఒకటి చేయాలి...

గంగన్న సొమ్ముగురించి ఎంత అడిగినా తనకు తెలియదని చెప్పేసరికి మీసాలుకు చాలా కోపం వచ్చింది. వాడింక తనను యమయాతనలు పెట్టబోతున్నాడని తెలిసేక బాబాయి గుర్తుకొచ్చాడు. బాబాయిమీద పగ తీర్చుకునేటందుకిదే మంచి సమయమనిపించింది. అప్పటికప్పుడు ఆలోచించి ఒక కట్టుకథ అల్లాడు. వాడెంత వరకూ అది నమ్మాడో తెలియదు కానీ తనను బాధలు పెట్టలేదు.

బాబా చటుక్కున లేచి నిలబడ్డాడు. తన జేబులోంచి ఫోటోతీసి చూశాడు. అప్పుడే పార్కులో ప్రవేశించి దిగాలుగా కూర్చున్న ఆ అమ్మాయే తనకు కావాలి.

అతను చకచకా నడిచి ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళాడు. ఆమె ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. ఇతన్ని గమనించలేదు.

"మేడమ్—" అన్నాడు బాబా. ఆమె ఉలిక్కిపడి తలెత్తి చూసింది.

"రాధా!" అన్నాడతను అప్రయత్నంగా అన్నట్లు.

"నా పేరు రాధకాదు యమున" అందామె.

"యమునకు రాధకు అవినాభావ సంబంధముంది. యమున ఒడ్డునే రాధ కృష్ణుడిని కలుసుకునేది" అన్నాడు బాబా.

"మిస్టర్—ఎవరు నువ్వు?" అంది యమున.

"అదే కంఠం—నువ్వు రాధవే—" అన్నాడు బాబా.

వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకునేటందుకు ఓ అయిదు నిమిషాలు పట్టింది. బాబా తన విషాద గాథను చెప్పాడు. అతను రాధ అనే అమ్మాయిని ప్రేమించాడు. ప్రేమ వివాహానికి దారితీయకమునుపే టైఫాయిడ్ వచ్చి రాధ మరణించింది. అప్పట్నించీ అతను పిచ్చివాడిలా ఊళ్ళు పట్టి తిరుగుతున్నాడు. ఇన్నాళ్ళకు చనిపోయిన రాధ మళ్ళీ తన కళ్ళ ఎదుట నిలబడింది. కానీ ఆమె రాధను కానంటోంది.

బాబా తన జేబులోని ఫోటో అందించాడు యమునకు. యమున ఫోటో చూసి ఆశ్చర్యపడింది— "ఇది నాదే—" అంది.

"చూశావా నువ్వు రాధవు—" అన్నాడు బాబా.

యమున పరిశీలనగా బాబాను చూసింది—అతని కళ్ళలో గూడుకట్టుకున్న విషాదం ఆమెను కదిలించింది. అతడు చెప్పే కథ నిజమేననిపించిందామెకు.

"నీ రాధకోసమే నువ్విలాగైపోయావా?" — అంది జాలిగా అతన్ని చూస్తూ ఆమె.

"అవును. ఇంకెంతో కాలం బ్రతకను కూడా—" అన్నాడు బాబా.

అతను ప్రేమలో దెబ్బ తిన్నాడు. విధి అతన్ని మోస గించింది. తనూ ప్రేమలో దెబ్బతింది. తననొక మనిషి మోసగించాడు. ఇద్దరూ ప్రస్తుతం ఒకే స్థితిలో ఉన్నారు. ఆమెకు అతనితో తన కథ చెప్పుకోవాలనిపించింది.

బాబా ఆమె కథ విని— "నా రాధ మళ్ళీ కనబడు తుందని నేననుకోలేదు. నీ పేరు యమున కావచ్చు. కానీ నాకు నువ్వు రాధవే. నీ గత చరిత్రతో నాకు సంబంధం లేదు. నిన్ను పెళ్ళి చేసుకుంటాను. ప్రస్తుతం పైపా సంపా దన లేదు. కానీ నువ్వు నాకు భార్యగా మారితే ఆ బాధ్యతను నిర్వహించుకోవడానికెంతైనా సంపాదించ గలను—" అన్నాడు.

అతని మాటలు వింటూ యమున తన్ను తాను నమ్మలేక పోయింది. బాబా చూడ్డానికి చాలా అందంగానే వున్నాడు. తన గత చరిత్ర తెలిసికూడా తననే వరిస్తా నంటున్నాడు. ఇతనిది నిజమైన ప్రేమ!

"ఇక్కడ నా చుట్టాలింట్లో ఉంటున్నాను—రాధతో నేను తీయించుకున్న ఫోటోలన్నీ ఒక ఆల్బంలో పెట్టి ఎక్కడకు వెడితే అక్కడకు తీసుకు వెడుతుంటాను. ఇప్పుడు నాతో వస్తే అవి చూపిస్తాను—" అన్నాడు బాబా.

యమున సందేహించలేదు—"పద!" అంది.

రిక్షాను పిలిచి— "మూడు లాంతర్ల జంక్షన్" అన్నాడు.

ఇద్దరూ మూడు లాంతర్ల జంక్షన్ దగ్గర దిగారు. అక్కడినించి పక్క సందులోకి వెళ్ళారు యమున, బాబా. ఆ సందులో ఒక చిన్న పెంకుటిల్లుముందర ఆగి తలుపు తట్టాడు బాబా.

తలుపులు తెరుచుకున్నాయి కానీ ఎవరు తెరిచినదీ కనిపించలేదు.

"రా...రాధా..." అన్నాడు బాబా. యమున అతన్ననుసరించింది.

లోపల దీపం వెలుగుతోంది. ఇల్లు మామూలు మధ్య తరగతి వాళ్ళ కొంపలా ఉంది.

యమున అనుమానంగా చుట్టూ పరిశీలించి చూసి- "ఇంట్లో జనమున్న అలకిడి ఏమీ లేదే-" అంది.

"నా రాధ నా ప్రాణం. నీకేమీ భయంలేదు-" అన్నాడు బాబా.

సరిగ్గా అప్పుడే ఇంటి తలుపులు మూసుకున్నాయి. అంతవరకూ తలుపుల వెనుకనున్న వ్యక్తిని అప్పుడే చూసిన యమున ఉలిక్కిపడింది.

అతను బాబా ఇదివరలో చూసిన గుండు భయంకరుడు. అతను యమునను చూసి నవ్వుతున్నాడు కానీ – చూపులు మాత్రం భయంకరంగా ఉన్నాయి.

## 7

"నా పేరుతో మీకు నిమిత్తంలేదు. మీ పేరు రమణరావు కదా-మీతో నాకు పని వుంది" అన్నాడతను.

"ఏం పని?" అన్నాడు రమణరావు ఆ వ్యక్తి వంక ఆశ్చర్యంగా చూస్తూ.

"గంగన్న సామ్మ..." అన్నాడాగంతకుడు.

"ఎవరా గంగన్న?"- అన్నాడు రమణరావు చిరాగ్గా.

ఆగంతకుడొకసారి తన మీసాలు దువ్వి- "ప్రస్తుతం జైల్లో మగ్గుతున్నాడు కానీ అతనెందుకైతే జైలుకెళ్ళాడో, ఆ కారణం మీదగ్గరుంది......" అన్నాడు.

"ఓహో-గజదొంగ గంగన్న సంగతా-అతగాడి సొమ్ము కనీసం కొన్ని కోట్లయినా ఉంటుందని చెప్పుకుంటారు. దాంతో మీకేం పని?" అన్నాడు రమణరావు.

"అది నాకు కావాలి?"

"నాకూ కావాలి. ఎక్కడుందో చెప్పండి. ఇద్దరం వెళ్ళి తెచ్చుకుందాం." అన్నాడు రమణరావు.

"మిస్టర్ రమణరావ్-నాతో వేళాకోళాలు వద్దు. నాతో చెలగాటం ప్రాణాలుతీస్తుంది. మీరింకేం చెప్పినా నేను వినను. మీ దగ్గర గంగన్న సొమ్ము ఉన్నదని నాకు రూఢిగా తెలిసింది. వెంటనే చెప్పి మర్యాద, ప్రాణాలు దక్కించుకోండి" అన్నాడతను క్రూరంగా.

"మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?" అన్నాడు రమణరావు.

"తెలుసుకుని ప్రయోజనం లేదు" అన్నాడాగంతకుడు.

"పిలవడానికి పేరు చాలా అవసరం. చెప్పడం మీ కిష్టంలేకపోతే మీ వేషాన్ని బట్టి నాకు తోచిన పేరుతో పిలవాల్సి వుంటుంది-" అన్నాడు రమణరావు.

"అభ్యంతరం లేదు. గంగన్న సొమ్ము ఎక్కడుందో చెప్పండి......"

"అయితే మిస్టర్ మీసాలూ-నాతో రండి. గంగన్న సొమ్ము ఎక్కడుందో చూపిస్తాను. నాతో రావడానికి మీకేమీ భయంలేదు కదా..." అన్నాడు రమణరావు.

"నాకు భయమేందుకూ_సరిగ్గా ఇంకో రెండు గంటలకు నేను ఇల్లు చేరకపోతే మీ అమ్మాయి యమున శవంగా మారి ఇక్కడికి చేరుకుంటుంది..." అన్నాడు మీసాలు తాపీగా.

రమణరావు ఉలిక్కిపడ్డాడు. "ఏమిటి నువ్వనేది?"

"నేను తెలివితక్కువగా ఇక్కడికి రాలేదు_నీ కూతురు ప్రస్తుతం నాకు బందీగా వుంది." అన్నాడు మీసాలు గర్వంగా నవ్వుతూ.

రమణరావు ముఖం దీనంగా మారిపోయింది. "నాకున్నదల్లా ఒకత్తే కూతురు. దానికే ఆపద వచ్చినా నేను సహించలేను. దాన్నేమీ చేయకు..."

"ఏమీ చేయను...కానీ గంగన్న సొమ్ము నాకప్పజెప్పాలి..."

రమణరావు ఆలోచించి_ "అంత డబ్బు ఒక్కసారిగా అప్పజెప్పాలంటే ఎవరికైనా బాధగానే ఉంటుంది. నీ క్కావాలంటే కొంత వాటా ఇస్తాను..." అన్నాడు.

"చాలదు. అంతా కావాలి. అప్పుడే నీ కూతురు సురక్షితంగా నిన్ను చేరుతుంది."

రమణరావు చేసేది లేనట్లు ముఖంపెట్టి_"డబ్బెక్కడున్నదీ నీకు నేను చెబుతాను. అది కాస్తా కూస్తా సొమ్ము కాదు. కాబట్టి నాకు కనీసం పది లక్షలైనా నువ్వివ్వాల్సి వుంటుంది..." అన్నాడు.

"అవన్నీ తర్వాత మాట్లాడుకుందాం. ముందు డబ్బు సంగతి చెప్పు."

"చెబుతాను కానీ_నా కూతురు నీ దగ్గరుందని గ్యారంటీ ఏమిటి? ఉన్నా దాన్ని వదిలిపెడతావనీ

గ్యారంటీ ఏమిటి?'' అన్నాడు రమణరావు.

మీసాలు అసహనంగా– ''మాటలతో కాలయాపన చేద్దామని చూస్తున్నట్లున్నావ్. ఇలాంటివి నాకు కిట్టవు. నేను చెప్పినవన్నీ నువ్వు నమ్మాల్సిందే...'' అన్నాడు.

రమణరావు నవ్వి– ''నేను చాలా మొండి మనిషిని. నా కూతురు నా దగ్గరకు సురక్షితంగా చేరుతుందని నమ్మకం లేకపోతే నేను నీకేమీ చెప్పను. నా ప్రాణాలు తీసినా నువ్వు సాధించేదేమీ లేదు. గంగన్న సొమ్ము గురించి గంగన్న తర్వాత తెలిసినవాడిని నేనొక్కడినే.....'' అన్నాడు.

మీసాలు ఆలోచనలో పడినట్లున్నాడు. యమునను వదిలిపెడితే రమణరావు తనకసలు విషయం చెప్పక పోవచ్చు. వదలకపోతే మొదలే చెప్పనట్టున్నాడు. గంగన్న సొమ్ము గురించి ఇతగాడికి తెలిసినట్లే కనబడు తోంది.

''ఏంచేయాలో నువ్వే చెప్పు...'' అన్నాడు మీసాలు.

''నా కూతురెక్కడుందో అక్కడికి తీసుకువెళ్ళు. విషయం నీకు చెప్పేస్తాను. మమ్మల్నిద్దర్నీ వదిలిపెడుదువు గాని...'' అన్నాడు రమణరావు.

మీసాలు క్షణం ఆలోచించి, ''సరే, అలాగే జరుగు తుంది. సాయంత్రం మళ్ళీ వస్తాను...'' అన్నాడు.

# 8

''నమస్కారం బంగార్రాజుగారూ. మీకు చాలా ముఖ్యమైన సమాచారం అందించడానికి వచ్చాను...'' అన్నాడు రమణరావు.

''ఏమిటది?''– అన్నాడు బంగార్రాజు.

"పార్కులో రాక్షసుడి విగ్రహం మీ ప్రాణాలు తీసేస్తోందనీ—దాన్నక్కడినుంచి తొలగించడానికి మీరు ఛైర్మన్ గారితో ఎన్నో సంప్రదింపులు జరిపాననీ-కానీ బ్లాక్ మెయిలర్ హెచ్చరిక కారణంగా ఆ విగ్రహంజోలికి ఎవ్వరూ వెళ్ళలేకపోతున్నారనీ నాకు తెలిసింది. ఇప్పుడు శుభవార్త ఏమిటంటే నాకా బ్లాక్ మెయిలర్ ఆచూకీ తెలిసిపోయింది. వాడినీ రోజు రాత్రికే రెడ్ హాండెడ్ గా మనం పట్టుకోవచ్చు. ఈ విధంగా ఆ విగ్రహాన్నికూడా అక్కణ్నించి తొలగించే ఏర్పాటు చేయవచ్చు" అన్నాడు రమణరావు.

బంగార్రాజు ముఖం వెలిగింది. "నాలాంటి వాళ్ళం నాకు తెలిసినంతవరకూ ఓ పదిమందిదాకా వున్నాం. అంతా కలిశామంటే..."

"వాడిదగ్గర మీ రహస్యాలు చాలావున్నాయి కాబట్టి ఇందులో పోలీసులజోక్యం ఉండకూడదు" అన్నాడు రమణరావు.

"అసలింతకీ ఏం జరిగింది?"

"వాడు నా కూతుర్ని ఎత్తుకుపోయాడు. తర్వాత నా దగ్గరవచ్చి పార్కులోవున్న రాక్షసుడి విగ్రహానికి తాళం చెవి తన దగ్గర వుందని ఈ రాత్రికి ఆ విగ్రహంలోని డబ్బు తీసుకోవాలనీ అందుకు నా సాయం కావాలనీ చేయని పక్షంలో నా కూతుర్ని చంపేస్తాననీ అన్నాడు..."

"ఎలాగుంటాడు వాడు...?"

వర్ణించి చెప్పాడు రమణరావు. "వాడు నా దగ్గర కొచ్చి ఇలా అనగానే నాకు మతిపోయింది. కాసేపు ఆలో

చించి ముందు నా కూతుర్ని చూపిస్తే ఒప్పుకుంటానన్నాను. సాయంత్రం వస్తానని వెళ్ళిపోయాడు. పోతూపోతూ వీధి తలుపులు వేసిపోయాడు. మీ వాళ్ళెవరైనా ఇద్దరు మనుషుల్నివ్వండి. రహస్యంగా వెంటాడడంలో నేర్పుతో పాటు అవసరమైతే మనుషుల్ని చావుదెబ్బ తీయగలిగేలా వుండాలి.''

బంగార్రాజు తలూపేడు.

రమణరావు ఉత్సాహంగా 'ఒక దెబ్బకు రెండు పిట్టలు!' అనుకున్నాడు.

రాక్షసుడి విగ్రహంమీద గత సంవత్సరంలోనూ నిఘా ఎక్కువైంది. ఇది యిక ఎంతోకాలం సాగదని ఆయనకు తెలిసిపోయింది. తెలివిగా అనుమానాన్ని ఎవరైనా కొత్త వ్యక్తిమీదకు మళ్ళించి తను బ్లాక్ మెయిలింగ్ డబ్బు వసూలుచేసే పద్ధతి మార్చాలని ఆయన అనుకుంటున్నాడు ఇప్పుడిలా అవకాశం వెతుక్కుంటూ వచ్చింది.

# 9

బంగార్రాజు మనుషులిద్దరికీ ''ఒక మీసాలవ్యక్తి ఇప్పుడిక్కడికి వస్తాడు. కొద్ది నిముషాలు మాట్లాడుకుని ఇద్దరం బయటకు వెడతాం. ఎవరికీ అనుమానం రాకుండా మమ్మల్నను సరించండి. మేమిద్దరం ఒక ఇంట్లోకి వెడతాం. అందులోంచి అరగంటలోగా నేను బయటకు రాకపోతే మీరూ ఆ ఇంట్లో ప్రవేశించండి...'' అని చెప్పాడు రమణరావు.

తర్వాత మీసాలు వచ్చాడు. రమణరావుని పద మన్నాడు. ఇద్దరూ రిక్షా ఎక్కారు. రిక్షా మూడు లాంతర్ల జంక్షన్ దగ్గర ఆగింది. ఇద్దరూ దిగి దగ్గర్లో నేవున్న సందు

లోకి నడిచి ఒక పెంకుటింట్లోకి వెళ్ళారు.

రమణరావుకి అక్కడ తన కూతురు యమున కనిపించింది. వాళ్ళతోపాటు అక్కడ బాబా, గుండు భయంకరుడుకూడా వున్నాడు.

రమణరావు తన జేబులోంచి ఒక తాళంచెవి తీసి మీసాలుకిచ్చి పార్కులో రాక్షసుడి విగ్రహం వివరాలు చెప్పాడు. అందులోనే గంగన్న తన డబ్బు దాచాడని కూడా చెప్పాడు.

మీసాలు తన మొలలోంచి ఒక పదునైన చాకు తీశాడు. రమణరావును సమీపించి ఆ చాకు పిడిని గట్టిగా పట్టుకుని వదిలేయమన్నాడు. అతనలా చేశాక "ఇంక నువ్వు నీ కూతురు వెళ్ళవచ్చు. ఈ విషయంలో నన్ను మోసగించినట్లు తెలిసిందంటే మాత్రం ఈ చాకుతో హత్య జరుగుతుంది. హంతకుడివి నువ్వేననడానికి తిరుగులేని బలమైన సాక్ష్యాలుంటాయి" అన్నాడు.

రమణరావు తడబడి "ఈ విగ్రహం గురించి ఊళ్ళో చాలామంది పెద్దలకు చూచాయగా అనుమానాలున్నాయి. దానిమీద చాలా నిఘావుండవచ్చునని నా అనుమానం. ఇంతవరకూ ఒక్కసారికూడా ఆ తాళాన్నుపయోగించే అవకాశం నాకు రాలేదు" అన్నాడు.

రమణరావు, యమున బయటకువచ్చారు. తర్వాత ఆయన తన మనషులతో "మీరీ ఇంటిముందే కాపలా వుండండి. ఈ ఇంట్లోంచి ఒక రాత్రివేళ మీసాలవాడు బయటకువస్తాడు. ఆ తర్వాత మీరా ఇంట్లో జొరబడి ఎవరైనా లోపలుంటే వాళ్ళ నోళ్ళుమూసి ఆ ఇంట్లో ఎక్కడెక్కడేయే ఆయుధాలున్నాయో వెతికి వెతికి

అన్నీ మూటగట్టుకుని నా దగ్గరకు తీసుకురండి'' అని చెప్పాడు.

# 10

మీసాలు, గుండు భయంకరుడు పార్కు దగ్గరకు వచ్చారు.

ఎక్కడా ఏమీ అలికిడి లేదు. పక్కనే ప్రవహిస్తున్న గోదావరి మీదనుంచి చల్లనిగాలి వీస్తోంది. మీసాలు పరిసరాలను బాగా పరిశీలించి చూశాడు. అనుమానించవలసినదేమీ కనపడలేదు. అతను గుండు భయంకరుణ్ణి హెచ్చరించాడు.

“నువ్వు గేటుదగ్గరే వుండు. ఏ మాత్రం అనుమానం కలిగించే పరిస్థితి ఏర్పడినా నీ జేబులోని ఉండనుతీసి నేల మీద కొట్టు.”

తన అనుచరుణ్ణి కాపలా పెట్టి మీసాలు విగ్రహాన్ని సమీపించాడు. చిన్న రాతిపీఠంమీద నిలుచున్న నిలువెత్తు విగ్రహమది. మీసాలు తనవద్దనున్న తాళంచెవి విగ్రహం బొడ్లో పెట్టాడు. రమణరావు చెప్పిన విధంగా తిప్పాడు. తాళం విడింది. లాగగానే తలుపు తెరుచుకుంది.

మీసాలు బ్యాటరీలైట్ వేసి చూశాడు. లోపల వజ్రాలు, నగలు, రత్నాలు, ముత్యాలువున్నాయి. అతని కళ్ళు సంతోషంతో మెరిశాయి. 'రమణరావు నిజమే చెప్పాడు!' అనుకున్నాడు.

అది గజదొంగ గంగన్న దోచినసొమ్ము. ఒక్క రాత్రిలో పదిమంది నగల వర్తకుల ఇళ్ళు దోచేశాడతను. ఈ సొమ్ము విలువ కోట్లలో వుంటుందని చెప్పుకుంటారు. ఇంతసొమ్ము ఈ విగ్రహంలో దాచాడని తెలుసుండీ—

ఆ విగ్రహం తాళం తన దగ్గరనే ఉన్నప్పటికీ రమణ రావీసామ్ము జోలికి వెళ్ళలేదు.

అందుకాక్కారణ మూహించడం పెద్ద కష్టంకాదు. ఇందులోని సొమ్ము ఈ ఊరి పెద్దలది. వారికి రమణరావు అంతరంగికుడని చెప్పుకుంటారు. ఈ నగలు, వజ్రాలు రూపాయలుగా మార్చాలంటే ఊరిపెద్దల సహకారం కావాలి. మరో విధంగా చేసేటంత, చేయగలిగేటంత పెద్దవాడిలా రమణరావు కనపడ్డంలేదు. అతని ఇల్లు తను చూడనేచూశాడు. చాలా సామాన్యంగావుంది.

ఆలోచనలతో మీసాలు సమయం వృధా చేసుకోదల్చ లేదు. అతను తన చేతిలోవున్న బ్రీఫ్‌కేసులోకి అందులో వున్న నగలు వగైరా తరలించాడు. మళ్ళీ విగ్రహం తలుపు మూసి గేటుదగ్గరకు వచ్చాడు.

గుండు భంకరుడతన్ని చూసి నవ్వాడు. మీసాలు విజయసూచకంగా తలాడించాడు. ఇద్దరూ నెమ్మదిగా పార్కు ప్రాంతాలనుంచి బయటపడి ఒక సందులోకి తిరి గారు. హఠాత్తుగా ఇద్దరు మనుషులు వాళ్ళమీద పడి ముక్కులదగ్గర ఏదో బలంగా అదిమారు. అనుకోని ఆ పరిణామానికి మీసాలు, గుండు భయంకరుడు సిద్ధంగా లేరు. క్షణాలమీద వాళ్ళకు స్పృహతప్పింది.

# 11

"చాలా థాంక్స్ బంగార్రాజుగారూ సమాజానికి చీడపురుగులాంటి వాడిని పట్టుకున్నారు" అన్నాడు రమణరావు.

"సమాజానికి చీడపురుగు అన్నప్పుడల్లా నాకదోలా గుంటూంటుంది. దయుంచి నా దగ్గర ఆ వాక్యాన్ననవద్దు.

ఏదో అవసరంకొద్దీ ఈ పని చేశాను. కానీ విగ్రహం దగ్గరకు మీరే వస్తానన్నారు. చివరికి వాడే వచ్చేడేం?'' అన్నాడు బంగార్రాజు పక్కన సూట్ కేసులో మీసాలు దోచిన గిల్టు నగలు, వజ్రాలు వగైరాలను చూసి నవ్వుతూ.

"నామీద వాడికెట్టే నమ్మకం లేకపోయింది. వాడేం చేశాడంటే ఒక బాకు పిడిమీద నా వేలిముద్రలు తీసుకున్నాడు. తనకేదైనా మోసం జరిగితే ఆ బాకుతోనే ఎవర్నయినా హత్యచేసి హత్యానేరం నామీద తోసేస్తానన్నాడు. ఇంతకీ వాడిక్కావలసిందేమిటంటే ఏ కారణం వల్లనైనా తను పట్టుబడితే తనకేమీ తెలియదనీ కిరాయికి నా దగ్గర పనిచేస్తున్నాననీ చెబుతాడట. అందుకు అంగీకరించాలట నేను. అంగీకరించకపోతే నన్ను హంతకుణ్ణి చేస్తాడు. మీకూ, మీబోటి ఇంకా పెద్దలకూ సంబంధించిన కొన్ని ఫోటోలు వాడు నాకు చూపించి అవీ వాటి నెగటీవులూ ఇచ్చి తను పట్టుబడినా ఫోటోలసాయంతో బెదిరించి తన్ను విడిపించాలని చెప్పాడట. అవికూడా తెచ్చాను'' అంటూ రమణరావు అవి బంగార్రాజు కందించి "బంగార్రాజుగారూ మీలో ఇంత రసికత వుందని నాకు నిజంగా తెలియదండీ'' అన్నాడు.

బంగార్రాజు ఆత్రుతగా వాటిని అందుకుని చూశాడు. చటుక్కున జేబులోకి తోసేసి "వాడాగదిలో వున్నాడు వెళ్ళి పలకరించారా'' అన్నాడు.

రమణరావాగదిలోకి వెళ్ళాడు. మీసాలు, గుండు భయంకరుడు మంచాలమీద వెల్లకితలా పడుకునివున్నారు. వాళ్ళని మంచాలకు బలంగా తాళ్ళతో కట్టేశారు. రమణరావు లోపలకు వెళ్ళి తలుపులు వేసి మీసాలును సమీ

పించి "వాళ్ళు చెప్పిన నేరాలన్నీ ఒప్పేసుకో. ఇంకెన్నడూ బ్లాక్ మెయిలింగ్ జోలికి వెళ్ళనని హామీ ఇచ్చేయ్. నిన్ను విడిపిస్తాను."

"అంతా మోసం నాకేమీ తెలియదు" అన్నాడు మీసాలు.

"బాగుంది గంగన్న సొమ్ముగురించి నాకేమీ తెలీదంటే నువ్వు నమ్మావా? నీ విషయంలోనూ అంతే. ఒప్పేసుకుంటే నీకే మంచిది నన్నింకా బ్లాక్ మెయిల్ చేయగలనని అనుకోకు. వేలిముద్రలున్న చాకు నేను వెనక్కి తెప్పించేసుకున్నాను" అన్నాడు రమణరావు.

"ఒప్పేసుకుంటాను కానీ నన్ను వీళ్ళు వదిలిపెడతారా?" అన్నాడు మీసాలు.

"వదులుతారు. కానీ నీ పిలక వాళ్ళ చేతుల్లోవుంచుకుంటారు. నీకు ట్రిక్ ఫోటోగ్రఫీలో సామర్థ్యముందనీ అదుపయోగించి దొంగ ఫోటోలు తీసి బ్లాక్ మెయిలింగ్ డబ్బు సంపాదిస్తున్నావనీ ఇక మీదట అలా చేయననీ కాగితం రాసివ్వాలి. అప్పుడు వదులుతారు" అన్నాడు రమణరావు.

"గంగన్న సొమ్ముకోసం ప్రయత్నించి బ్లాక్ మెయిలర్ గా తేలాను" అన్నాడు మీసాలు బాధగా.

"బాధపడకు ఆసొమ్ము తప్పక దొరుకుతుందిలే" అన్నాడు రమణరావు.

## 12

"రమణరావంటే మజాకా అనుకున్నావ్ కాబోలు పచ్చిరక్తం కళ్ళజూస్తాడు" అన్నాడు రమణరావు.

"మిమ్మల్ని చాలా తక్కువ అంచనా వేశాను..."

అన్నాడు మీసాలు తలవంచుకుని.

"ఏమీ ఫరవాలేదు. అదీ ఒకందుకు మంచిదే అయింది. ఈ రోజునించీ నువ్వు నా అనుచరుడివి. గంగన్న సొమ్ముకోసం మనమిద్దరం ప్రయత్నించేద్దాం. ఇంతకీ దాని గురించి నీకు మొట్టమొదటి ఆచూకీ బాబా దగ్గర్నుంచి కదా వచ్చింది? వాడిప్పుడెక్కడున్నాడు?"

"చాలా మొండివాడు వాడు. నిజం చెబుతున్నాడో తెలీదు, అబద్ధమాడుతున్నాడో తెలీదు. వాడి మాటలు నమ్మి కామయ్యదగ్గరకు వెళ్ళాను. కామయ్య మీదగ్గరకు పంపాడు."

"నేను బంగారాజు చేతుల్లోకి పోతాను. అయితే ఇందులో చిన్న తమాషా ఉంది. మిగతా వాళ్ళందరూ కూడా బెదిరింపుకు లొంగిపోయి తప్పించుకోవడంకోసం గంగన్న సొమ్ముగురించి చెప్పారు. ఏ బెదిరింపూ అక్కర్లేకుండా ఈ సంగతి తెలుసునని ఒప్పుకున్నది బాబా ఒక్కడే! తెలిస్తే అతనొక్కడికే ఈ విషయం తెలిసుండాలి."

"వాడింకా ఈఊళ్ళోనేవున్నాడు. రోజూ సాయంత్రం ఏడు గంటలకు మా ఇంటికి వస్తాడు."

"మా అమ్మాయిని బంధించడానికీ బాబా తెలివితేటలే కదూ నీకుపయోగపడ్డాయని చెప్పావ్."

"అవును!"

"అయితే అట్నుంచి నరుక్కువద్దాం. బాబామీద మా అమ్మాయిని ప్రయోగించి విషయాన్ని లాగుదాం. ఇలాంటి విషయాల్లో ఆడవాళ్ళు పనిచేసినట్లు మరే మంత్రమూ పనిచేయదు" అంటూ రమణరావు ఆలోచనలో

పడ్డాడు. ఆయన బుర్రలో పెద్దఎత్తున పథకమేదో తయారవుతోంది.

మీసాలు వెళ్ళిపోయాక ఆయన తన కూతుర్ని పిలిచి "చూడమ్మా యమునా ఇదివరలో నువ్వు చంద్రభానసే వుడ్రాడిని ప్రేమించిమోసపోయావు. ఈసారింకో వుడ్రాడిని ప్రేమించి మోసగించాలి నీవల్లనవుతుందా?" అన్నాడు.

"ఎవరిని ఎందుకు?" అంది యమున.

"బాబాని. వాడు నన్ను మోసం చేశాడు. మాయ మాటలు చెప్పి నిన్ను దొంగ వెధవలకప్పగించాడు. అందువల్ల నువ్వెన్ని చిక్కుల్లో పడ్డావో నేనెన్ని చిక్కుల్లో పడ్డానో నువ్వే చూశావ్ గదా" అన్నాడు రమణరావు.

"నీకులాగే అతనుకూడా ఆ దొంగ వెధవల చేతిలో పడ్డాడు నాన్నా. గత్యంతరం లేక వాళ్ళ చేతికి నన్నప్పగించాడు కానీ అతనికి నిజంగా నేనంటే ఇష్టం. అక్కడ గుండు భయంకరుడు నామీద చేయి చేసుకోకుండా చాలా కష్టపడ్డాడు. తనకు వాడినెదిరించే బలంలేదని తెలిసికూడా ఊరుకోలేదు" అంది యమున.

"కొంపదీసి మళ్ళీ ప్రేమలోగానీ పడలేదు కదా నువ్వు!" అన్నాడు రమణరావు చిరాగ్గా.

యమున జవాబివ్వలేదు. మళ్ళీ రమణరావే అన్నాడు. "ప్రేమలో పడ్డా పడకపోయినా వాడితో కాస్త పరిచయం ఏర్పడింది గదా_ప్రేమించానని నటించి వాణ్ణి మోసం చేయగలవా?"

"ఎందుకు?"

"కొన్ని కోట్ల రూపాయలకు సంబంధించిన ఆచూకీ వాడికి తెలుసునని నాకు నమ్మకంగా వుంది. కొన్నాళ్ళ

పాటు నువ్వు వాడిని కలుసుకుని ప్రేమ నటించి సమాచారం సేకరించాలి..."

యమున ఆలోచనలో పడింది.

# 13

"ఎలాగుంది మా ఇల్లు!" అంది యమున.

"చాలా రోజుల పరిచయం తర్వాత మీ ఇంటికి తీసుకొచ్చావ్. ఇంతకాలం నువ్వు చాలా డబ్బున్న దానివనని అనుకుంటున్నాను. మీ ఇల్లు చూస్తే అలాగనిపించడం లేదు......" అన్నాడు బాబా.

"ఐశ్వర్యం అనుభవించడానికిగానీ ఆర్భాటానికి కాదు కదా. కొండమీది కోతి కావాలన్నా దిగివస్తుంది నాకు" అంది యమున.

"నీ అభిప్రాయంతో నేను ఏకీభవించను. మనదగ్గర డబ్బున్నా లేకపోయినా నలుగురూ మనదగ్గర డబ్బుందని అనుకోవాలి. దర్జాగా మసలాలి. ఇది నా ఆశయం."

"కాయ్." అంది యమున. "అదే నిజమైతే నువ్వలా గెందుకుండడంలేదు? గజదొంగ గంగన్న దోచిన సొమ్ము ఎక్కడుందో నీకు తెలుసును గదా..."

బాబా నవ్వి, "ఆ డబ్బు ముట్టుకునే ఉద్దేశ్యం నాకు లేదు. ఎందుకంటే అది నాదికాదు సరిగదా-ఒక ప్రమాదకరమైన వ్యక్తిది. ఎప్పుడైనా నేనా డబ్బు కనుక ముట్టుకుంటే అది నా ప్రాణంకంటె విలువైన వ్యక్తులకోసం మాత్రమే అవుతుంది. నా ప్రాణంకంటె విలువైన వ్యక్తులంటే నన్ను ప్రేమించేవారన్నమాట. ఈ ప్రపంచంలో ఇంతవరకూ నాకు ప్రేమాభిమానాలు దొరకలేదు" అన్నాడు.

"నామీద నీ అభిప్రాయమేమిటి?" అంది యమున చటుక్కున.

"మంచి అభిప్రాయమే వుంది కానీ నువ్వు నన్ను ప్రేమిస్తున్నావనుకోను" అన్నాడు బాబా.

"ఎందువల్ల?"

"చాలా సింపుల్. అట్టే చదువు లేదు నాకు. వుద్యోగం లేదు. ఏ పరిస్థితులలోనూ గంగన్న సొమ్ము జోలికి వెళ్ళను. ఇప్పుడు చెప్పు. నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

యమున విషాదంగా నవ్వి, "నా గత చరిత్ర తెలుసు నీకు. చరిత్ర లేని విధవకికూడా పెళ్ళి చేసరికి ఆడదాని చరిత్ర కావాలి. అలాంటి సందర్భంలో నువ్వు నన్ను పెళ్ళాడుతానంటే నాకే ఇబ్బందీ లేదు. హాయిగా అంగీకరిస్తాను. కానీ......" అని ఆగింది.

బాబా ఆశ్చర్యంగా యమున వంక చూసి, "కానీ......" అన్నాడు.

"మా నాన్న బొత్తిగా డబ్బులేనివాడు కాదు. కానీ ఆయన ఒకాయనకి కొంత డబ్బు బాకీ పడ్డాడు. ఎవరికో జామీనుంటే అసలువాడు వ్యాపారంలో దివాళాతీయగా ఆ బాకీ మా నాన్నకు తగులుకుంది. ఆ బాకీ తీర్చడం మా నాన్నవల్ల కాదు. ఇది జామీను బాకీ గదా అన్న జాలిలో ఆయన మా నాన్నతో ఉపాయం చెప్పాడు. 'మీరు నాకేమవుతారని బాకీ కొట్టేస్తాను. మీ బాకీ కొట్టేయాలంటే ఏదైనా బంధుత్వముండాలి' అన్నాట్టాయన. లేని బంధుత్వం హఠాత్తుగా ఎలా పుట్టుకొస్తుందంటే, మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చేస్తే. మీరు నాకు మామగా రాతారు, అన్నాట్ట ఆయన. మా నాన్న ఆవేశపడకుండా

ఇంటికి వచ్చి విషయాన్ని చెప్పాడు. చెప్పడంలో ఆయన ఉద్దేశ్యం—బాకీ తీర్చడంకోసం నన్నీ పెళ్ళికి ఒప్పుకోమని కాదు. నా పెళ్ళికీ ఒక అప్పుకీలంకె వున్నదన్న విషయం నాకు చెప్పడమే......"

"పోనీ ఆయన్ను పెళ్ళి చేసుకోలేకపోయావా?"

"ఆయన ఏభయ్యో పడిలో పడ్డాడు. కనీసం రూప మైనా బాగుండదు. కానీ ఆశకు మాత్రం హద్దులేదు. అందుకే ముప్పై వేలుపెట్టి నన్ను కొనాలని చూశాడు."

"అయితే మీ నాన్న బాకీ ముప్పైవేలన్నమాట!" అన్నాడు బాబా.

"అవును. నా పెళ్ళి నేను ప్రేమించిన వారితో జరిగితే నాన్న ముప్పైవేలు నష్టమైపోతాడు..." అంది యమున.

"బాగుంది. ఆడపిల్లకు కట్నమిస్తేకానీ పెళ్ళికాని ఈ రోజుల్లో, ఎదురిచ్చి చేసుకునే వరుడెక్కడుంటాడు?"—అన్నాడు బాబా.

"నాన్నకు నా అందంమీద నమ్మకం. నాకు నా భవిష్యత్తుమీద నమ్మకం" యమున మాట్లాడుతూ వెళ్ళి అక్కడున్న డ్రెస్సింగ్ టేబుల్ సొరుగు తీసింది. ఆమె వెనకాలే నడిచిన బాబా సొరుగులోవున్న రివాల్వర్ చూసి ఉలిక్కిపడ్డాడు. అయితే యమున సొరుగులోంచి రివాల్వర్ తీయలేదు. చిన్న కుంకుమభరణితీసి బొట్టు పెట్టుకుంది.

"ఇది మామూలు బొట్టుకాదు. ప్రత్యక్షదైవం ప్రసాదించిన బొట్టు. నువ్వుకూడా పెట్టుకో" అంది యమున. ఏదో ఊరిలో దేవుడు మనిషిరూపంలో వెలసి మహిమలు చేస్తున్నాడట. యమున ఆ గ్రామం వెళ్ళి ఆ మనిషిని

స్వయంగా చూసివచ్చింది. ఆయన ఈ కుంకుమభరిణ ఇచ్చి నిత్యమూ బొట్టు పెట్టుకోమనీ మేలు జరుగుతుందనీ అన్నాడుట.

"మరి ఆ రివాల్వర్ కూడా ఆయనే ఇచ్చాడా?" అన్నాడు బాబా.

"అది నీకళ్ళ పడిందీ..." అంది యమున నవ్వుతూ. "ఇది మా నాన్న నాకిచ్చాడు. ఇందులో ప్రాణాలు తీసే గుళ్ళులేవు. ఇది ఏ మనిషికి గురిపెట్టి మీట నొక్కితే ఏమాత్రం చప్పుడు కాదు. ఆ మనిషి మాత్రం సుమారు పదిహేను నిముషాలపాటు నిశ్చలంగా వుండిపోతాడు. దీని ప్రభావం అయిపోయాక ఆ మనిషి తన పనులు మామూలుగా కొనసాగిస్తాడు తప్పితే పదిహేను నిమిషాల సేపు తను నిశ్చలంగా ఉన్న విషయాన్నికూడా గుర్తించడు..."

"దీని ప్రభావం అనుభవపూర్వకంగా తెలుసుకుంటే గానీ నమ్మలేను. నేను నీమీద ప్రయోగించి చూడనా?" అన్నాడు బాబా.

క్షణం తటపటాయించి "అలాగే చెయ్యవచ్చు కానీ, అందుకు నాకు ప్రతిఫలంగా ఏమిస్తావ్?" అంది యమున.

"పేదవాడిని __ఏమివ్వగలను?" అన్నాడు బాబా.

"జీవితమంతా నీకు దాసినైవుంటాను. గంగన్న సొమ్ములోంచి కొంతయినా బయటకు తీసి నా జీవితం ఆ ముసలాడిపరం కాకుండా కాపాడు" కన్నీళ్ళతో అంది యమున.

ఆమె కన్నీళ్ళు బాబాని కదిలించాయి. క్షణంపాటు

అతనికేం మాట్లాడాలో తోచలేదు. తర్వాత నెమ్మదిగా "ఓకే" అని రివాల్వర్ తీసి ఆమెను షూట్ చేశాడు. వెంటనే యమున శిలాప్రతిమలా నిలబడిపోయింది. నిజా నిజాలు పరీక్షించడానికి బాబా ఆమెను మంచంమీద పడుకోబెట్టాడు. ఆమె నటించడం లేదనీ నిజంగానే స్పృహతప్పిపోయిందనీ అతనికి అర్ధమైంది. ఇంతలో వీధి తలుపుల దగ్గర ఏదో అలికిడి కాగా బాబా బట్టలస్టాండు వెనక నక్కాడు.

ఒకటి రెండు నిముషాల్లో రమణరావు ఆ గదిలోకి వచ్చి నిద్రపోతున్న కూతుర్ని చూసి "మరీ చిన్నతనం తగ్గలేదు వీధి తలుపులు జార్లా వేసి నిద్దరోయింది" అనుకుని అక్కణ్ణించి బయటపడ్డాడు. బాబా జాగ్రత్తగా ఆయన్ని ననుసరించాడు.

రమణరావు వీధితలుపులు వేసి తన ప్రత్యేక గదిలోకి వెళ్ళాడు.

గోడకు తగిలించిన ఒక్కొక్క బొమ్మనే తీసి తన జేబు లోని రెంచీతో ఒక్కొక్క మేకునే తీసి బీరువాలు తెరుస్తూంటే బాబా అది చాటుగా చూశాడు.

# 14

"నేను బాబాని పెళ్ళిచేసుకుంటాను" అంది యమున.

తన కెదురుగా ఉన్న ముప్పైవేల వంకా ఆశ్చర్యంగా చూస్తూ రమణరావు "అంటే ఇతగాడికి గంగన్నసొమ్ము సంగతి నిజంగా తెలుసునన్న మాటే!" అన్నాడు.

"కానీ ప్రాణంపోయినా ఆ విషయాన్నతనొప్పుకోడు. నేను చెప్పిన కట్టుకథ నమ్మి నా కన్నీళ్ళకు కరిగిపోయి ఈ మాత్రాన్నతను బయటకు తీశాడు. ఇలాంటి వాడిని

పెళ్ళి చేసుకుంటేనే నేను సుఖపడతాను..." అంది యమున.

యమునకూ, బాబాకూ వివాహం సింపుల్‌గా జరిగి పోయింది.

పెళ్ళికి శ్రీనివాస్ వాల్తేర్‌నించి వచ్చాడు.

పెళ్ళైన వారంరోజులకు బాబా భార్యతో "మీ నాన్న బ్రతుకు నీకు తెలుసా?" అనడిగాడు.

తెలియదంది యమున.

"బ్లాక్ మెయిలింగ్ చేసి బ్రతుకుతున్నాడాయన" అన్నాడు బాబా.

"ఓస్ అంతే కదా అదేం తప్పుకాదు. అందరి తప్పులూ బయటపెట్టేరంటే ఈ దేశాన్నేలడానికి మచ్చలేని మనిషి ఒక్కడుకూడా మిగలడు. మా నాన్న బ్లాక్ మెయిల్ చేస్తాడన్న సంగతి నాకూ తెలుసు..." అని నవ్వింది యమున.

"బ్లాక్ మెయిలింగ్ తప్పు కాదంటావ్" అన్నాడు బాబా.

కాదన్నట్లు తలాడించింది యమున.

"అయితే నేను బ్లాక్ మెయిలింగ్ చేసి డబ్బు సంపాదిస్తే నీకు అభ్యంతరమా?" అన్నాడు బాబా.

"లేదు కానీ మీకా కర్మేంపట్టింది. అంతగా కావాలనుకుంటే గంగన్న సొమ్ముండనే వుంది" అంది యమున.

"బాగుంది. అది వాడి సంపాదన. ఇది నా సంపాదన" అని నవ్వాడు బాబా.

## 15

విశాఖపట్నంనించి రాజమండ్రి వచ్చిన ఒక కూలివాడు తన కళ్ళతో స్వయంగా ఆల్‌కట్ గార్డెన్స్‌లో ఒక

ప్రాంతంలో భూమిలోంచి రామవిగ్రహం చొచ్చుకుంటూ పైకి రావడం చూశాడట. ఆ విగ్రహాన్ని చూడ్డానికి జనం తీర్థప్రజలా వెళ్ళివస్తున్నారు.

విగ్రహం చుట్టూ గుడిసె వెలిసింది. దాన్ని ప్రప్రథమంగా చూసిన కూలివాడు ఆ గుడిసెకు సంరక్షకుడయ్యాడు. అతని బంధువర్గం అక్కడ భక్తకోటిగా మారారు. అప్పుడప్పుడు భక్తులిచ్చే కానుకలను గ్రహించడానికి హుండీ వెలసింది.

కాలక్రమేనా ఆ విషయం ప్రజలలో పాతబడింది.

“నేను రామభక్తుడిని. అన్యాయాన్ని నేను సహించలేను. ఇటీవల లాడ్జిలో నువ్వు చేసిన కేళీ విలాసాలు ఫోటో రూపంలో చూశాక ఏకపత్నీవ్రతుడైన రాముడి భక్తుడిగా నేను సహించలేకపోయాను. ఇది కలియుగం కాబట్టి నీవద్దనుంచి కొంత డబ్బుతీసుకుని నీ నేరాన్ని క్షమించదల్చాను. ఆల్కాట్ తోటలో కొత్తగా వెలిసిన రామాలయం హుండీలో పదివేలు వేసి నీ పాపపరిహారం కావించుకో. రామాలయం గురించి ఎటువంటి ఆరాలు తీయడానికి ప్రయత్నించినా ఈ ఫోటోలు రాజమండ్రి సమాచారమ్‌లో ప్రచురించబడతాయి.”

క్రింద రామభక్తుడి పేర సంతక మొకటుంది. ఈ ఉత్తరం చదివి బంగార్రాజు కలవరపడ్డాడు. రాక్షసుడి విగ్రహం కూలిపోయాక ఆయనకు బ్లాక్ మెయిలింగ్ బాధ లేదు. మళ్ళీ మొదలు కావడంతో ఏం చేయాలో తోచక ఆయన రమణరావుకు కబురుపెట్టాడు.

రమణరావు ఉత్తరం చదివి చాలా కంగారుపడ్డాడు. లాడ్జిలో ఫోటోలు తీయడానికి ఏర్పాటు చేసినది తనే

కానీ ఈ ఉత్తరం తను వ్రాయలేదు. డబ్బు వసూలు చేయ డానికి సులువైన మార్గాలకోసం తను వెతుకుతున్నాడు. కానీ ఎవరో తెలివిగా ఈ రామాలయం ఏర్పాటు చేసు కున్నాడు. ఆ వ్యక్తిని తెలుసుకోవాలి.

రమణరావు తక్షణం వెళ్ళి చంద్రముఖిని కలుసుకున్నాడు ఈ చంద్రముఖినే బంగార్రాజు లాడ్జిలో కలుసుకుని ఫోటోల్లో కెక్కాడు. ఆమె తనకేమీ తెలియదనీ తమ్ముడు రీలు వాష్ చేసి ఇవ్వగానే యధాతధంగా రమణరావు కంద జేశాననీ చెప్పింది.

"ఎవడో పోటీదారు బయల్దేరాడు. వాణ్ణి త్వరగా అంతం చేయాలి..." అనుకుంటూ ఇల్లుచేరిన రమణరావు ఇంటివద్ద ఒక ఉత్తరం ఎదురైంది. ఉత్తరం చదివిన రమణరావుకు బాగా చెమటలు పట్టాయి.

అది రామభక్తుడి ఉత్తరం. రమణరావు పక్కా బ్లాక్ మెయిలర్ అన్న రహస్యం దాచడానికి పదివేలవుతుందట. రామాలయం గురించి అతనేవిధమైన ఆరాలు తీయడానికి ప్రయత్నించినా అతని మూడు బీరువాల రహస్యం బయట పడుతుందట.

రమణరావుకు కాళ్ళూ, చేతులూ ఆడలేదు. ఎవడో తనను మించినవాడీ ఊళ్ళో చేరాడు. రమణరావు మారు మాట్లాడకుండా రాముడిహుండీలో సొమ్ము వేసివచ్చాడు.

దిగాలుగావున్న తండ్రిని చూసి యమున దైవభక్తి అలవర్చుకోమని సలహాయిచ్చింది. ఇటీవల యమునకు భక్తి చాలా ఎక్కువై ప్రతిరోజూ రామాలయానికి వెళ్ళి వస్తోంది.

"నీ మొగుణ్ణి కదిపి గంగన్న సొమ్ము త్వరగా తేల్చు".

అన్నాడు రమణరావు.

అయితే ఆ ఆశకూడా ఆయనకెన్నాళ్ళో నిలవలేదు. మీసాలువచ్చి ఒకరోజు పిడుగులాంటి రహస్యం బయట పెట్టాడు.

గంగన్న దోచినసొమ్ముతో సహా పోలీసులకు దొరికి పోయేడట. అయితే ఆ నగలు, వజ్రాలు అన్నీ ఆయా వర్తకుల బ్లాక్ మనీకి సంబంధించినవి అట. అందువల్లన పోలీసులకు బాగా లంచంవేసి తమ వస్తువులు తిరిగి తీసేసుకుని బయటకుమాత్రం పోయాయనే చెప్పించారట. ఈ విషయాన్ని నిజంగా నిరూపించడానికి సహకరించినందుకు గంగన్న కుటుంబం ఆమాకీ తెలుసుకుని వెళ్ళి వాళ్ళ దగ్గర్నుంచి రాబట్టేడట.

"అయితే ఈ బాబా గాడి మాటేమిటి?" అన్నాడు రమణరావు.

"వాడు చేసిన మోసానికి వాణ్ణి చంపేయాలి" అన్నాడు మీసాలు.

"వాడిప్పుడు నా ఇంటల్లుడు. తొందరపడ్డానికిలేదు" అన్నాడు రమణరావు సాలోచనగా. "అంతకంటె ముందుగా అంతం కావలసిన వాడింకొకడున్నాడు. ఇప్పుడీ ఊళ్ళోకి ఓ కొత్త బ్లాక్ మెయిలర్ వచ్చాడు. వాడెవరో నువ్వు తెలుసుకోవాలి."

# 16

"మీకు గంగన్న సొమ్ముగురించి ఏమీ తెలియదుట గా. అసలు గంగన్నసొమ్మేదీ దాచలేదట గా..." అంది యమున.

బాబా నవ్వి "అవన్నీ నీ కనవసరం. కానీ నేను

నీకిచ్చిన ముప్పైవేలు మాత్రం మీ నాన్న బీరువాలోంచి తెచ్చిచ్చాను. అందుగురించి ఆ రోజు మీ ఇద్దరికీ రెండేసి సార్లు స్పృహ పోగొట్టాల్సివచ్చింది'' అన్నాడు.

యమున ఏదో అనబోయింది. ఎవరో తలుపుతట్టారు.

''నాన్నైవుంటాడు'' అంది యమున.

''రాత్రి కొత్తదంపతులు ఏకాంతంలో ఉన్నప్పుడు తలుపు తట్టినవాడు మీ నాన్నగాక ఎవరౌతారు?'' అన్నాడు బాబా.

యమున బట్టలు సవరించుకుని లేచివెళ్ళి తలుపులు తీసింది.

రమణరావు లోపలకువచ్చి ''నీతో మాట్లాడాలి!'' అన్నాడు బాబాని చూసి.

''మాట్లాడండి'' అన్నాడు బాబా.

''నువ్వు నన్ను మోసం చేశావ్.''

''లేదు. మీరే కావాలని మోసపోయారు.''

''నా కూతుర్ని మరీ ఇంత బికారికిచ్చి వివాహం చేస్తాననుకోలేదు.''

''అదే మీ విచారమైతే మీరేం బాధపడకండి. మీ అల్లుడు బికారి కాడు అడిగిన వెంటనే మీకూతురికి ముప్పై వేలిచ్చి పెళ్ళిచేసుకున్నాడు.''

''నీ మాటలు గదిబైటకు స్పష్టంగా వినబడుతున్నాయి అది నాడబ్బేకదా...''

బాబా నవ్వి ''మీ డబ్బైనా మీకే యిచ్చానుగదా మామగారి దగ్గర డబ్బు తీసుకునేటంత హీనుణ్ణి కాను నేను'' అని ''యమునా బీరులోంచి ఆ పదివేలూ తీసి మీ నాన్నగారికిచ్చేయ్'' అన్నాడు.

"ఏ పదివేలు?" అంది యమున.

"రామాలయం నుంచి నువ్వు తెచ్చిన దాంట్లో వేరే పెట్టమని చెప్పానూ అవి!" అన్నాడు బాబా.

రమణరావు అవాక్కయిపోయాడు. కూతురు పదివేలూ అందించేక కూడా మామూలు మనిషి కావడానికి ఆయనకు పది నిముషాలు పట్టింది.

"నువ్వా రామభక్తుడివి!" అన్నాడాయన ఆశ్చర్యంగా నమ్మలేనట్లు.

"అవును. మీదగ్గరే నేర్చుకున్నాను" అంటూ బాబా వివరించాడు.

విశాఖపట్నం బస్‌స్టాండ్‌లో తనకు పరిచయమైన కొందరు శ్రమజీవుల సహాయంతో అల్కాట్ తోటలో రామాలయం వెలయింపజేశాడు. రామాలయానికి కాస్త పేరు వచ్చేక ప్రత్యేకంగా తయారుచేయించిన హుండీ నక్కడ పెట్టించాడు. హుండీకి నలుగురుకి తెలిసే విధంగా పైమూతవదనే కాక ఎవరూ కనిపెట్టలేని ఒకపక్క తలుపు వుంది. అది తీసే విధానం బాబాకూ యమునకు తెలుసును. దేవుడి పేరిట వచ్చిన డబ్బుమాత్రం అందులో వదిలి బ్లాక్ మెయిలింగ్ డబ్బు యమునచేత తెప్పిస్తుంటాడు బాబా.

నిన్నుగురించి నేను విచారపడనవసరంలేదు. అన్ని విధాలా నాకు తగ్గ అల్లుడివి. మనం ఒకరితో ఒకరం చేతులు కలుపుకుందాం. ఇద్దరి తెలివితేటలు జోడైతే..."

"అయినపక్షంలో బ్లాక్ మెయిలింగ్ ఎప్పటికైనా ప్రమాదం. అది వదిలిపెట్టి వ్యాపారం ఆరంభించాలి" అన్నాడు బాబా.

మర్నాడు రమణరావింటికి నగరంలోని పలువురు వ్యాపార ప్రముఖులు వచ్చేరు బాబాని తమ వ్యాపారంలో భాగస్థుడిగా చేర్చుకునే విషయాన్ని చర్చించడానికి. ఆ సందర్భంలో చర్చలు తప్పుదారితొక్కి సంభాషణ రహస్యాలు దాచడంమీదకు మళ్ళింది. ఒకో వణిక్ప్రముఖుడూ తనకు తెలిసిన గొప్ప రహస్యం గురించి చెబుతూంటే అందరూ ఆయ్యేవరకు ఆగి "కాకినాడలో బ్యాంకు దోపిడి జరిగింది చూశారా ఆ దోపిడీదారుల ఆచూకీ నాకు పూర్తిగా తెలుసు" అన్నాడు బాబా.

అంతా ప్రమాన్పడిపోయారు.

చర్చలు విజయవంతంగా ముగిసి రెండు లక్షల రూపాయల పెట్టుబడితో బాబాని భాగస్థుడిగా చేర్చుకునేందుకు ముగ్గురు వణిక్ప్రముఖులంగీకరించి వెళ్ళిపోయేక రాత్రి యమున గదిలో భర్తను "కాకినాడ బ్యాంకు దోపిడి గురించి నిజంగా మీకు తెలుసా?" అంది.

"సంభాషణలు జరుగుతూన్నప్పుడు అందరి దృష్టి నామీద కేంద్రీకరించబడడంకోసం ఎంత పెద్ద అబద్ధమైనా ఆడతాను. అది నా అలవాటు, బలహీనతకూడా" అన్నాడు బాబా.

—: ఐపోయింది :—

# న్యాయమూర్తి?

## డాక్టరు పెందుర్తి మాస్టర్జీ

"ఎవరు కావాలి?" గేటు దగ్గర గుర్ఖా అడిగాడు.

గేటు దగ్గర ఆగిపోయిన అతను అంతా కలయజూసి "జడ్జి జగన్నాథం కావాలి" అన్నాడు. పెరిగిన జుత్తు, గడ్డం, కళావిహీనమయిన ముఖం మట్టి కొట్టుకుపోయిన బట్టలు.

"ఆయనతో నీకేం పని?" గుర్ఖా ప్రశ్న.

ఆ సంభాషణ విని లాన్‌లో వున్న జడ్జి జగన్నాథం చేతి కర్ర వూపుకుంటూ వచ్చాడు. వయసు నలభైఅయిదు వుంటాయి. నిండుగా, భారీగా వుండే ఆకారం, గంభీర మయిన కంఠస్వరం, చెవి పై భాగంలో నెరిసిన జుత్తు, కళ్ళకు గోల్డ్ ఫ్రేమ్ అద్దాలున్నాయి.

వస్తూనే గేటు దగ్గర మనిషిని నిశితంగా చూశాడు. "పరమేశం" అస్పష్టంగా అన్నాడు. "ఓ! ఇంకా గుర్తున్నానన్నమాట."

"లోపలికి రా."

"రాను. రాలేను. నేను జైలునుండి వచ్చాను. నిన్ను చూసి పోదామని యిలా వచ్చాను. క్షేమమా?" హేళనగా అన్నాడు.

"లోపలికి రా పరమేశం."

"ఒకటి గుర్తుంచుకో జడ్జి జగన్నాథం. నా భార్యను నా చేతులతో చంపాను కాబట్టి జైలుకు వెళ్ళాను. కాని ఏ తప్పూ చేసిందని నా చెల్లెల్ని వదిలి మరొకమ్మాయిని పెళ్ళి జేసుకున్నావు. నీ హోదాకు తగింది కాకపోయినంత మాత్రాన దాన్ని దూరం చేసుకుంటావా?"

"జరిగింది నీకు తెలీదు."

"అవసరంలేదు. ఏం జరిగినా, ఎలా జరిగినా నీ తప్పు కప్పిపుచ్చుకోనటానికి ఒక కథ సృష్టిస్తావ్. యీ పన్నెండేళ్ళు నీవు హాయిగా నిద్రపోయి వుంటావ్. కాని ఇప్పుడు నిద్రపోనివ్వను. నీ అంతం చూస్తాను. నీ కథ ముగింపు నా వల్లే జరగాలి."

"పరమేశం."

అతను ఆగలేదు. గబ గబ వెళ్ళిపోయాడు.

జడ్జి జగన్నాథానికి ఏం చెయ్యాలో అర్థం కాలేదు.

## 2

"ఏమ్మా పార్టీ అప్పుడే అయిపోయిందా?" జడ్జి జగన్నాథ్ ప్రసాద్ అడిగాడు.

మాలిని విసురుగా సోఫాలో కూర్చుంది. "లేదు డాడీ.

చాలా చిరాకు వేసింది. మీరు రానన్నారు కాబట్టి మీ బలవంతంమీద వెళ్ళాను."

"ఎవరూ వెళ్ళకపోతే నొచ్చుకుంటాడని."

"డాడి. పార్టీలో ఎవరో స్త్రీ మిమ్మల్ని అడిగింది."

"ఎవరమ్మా? ఎలా వుంది?"

"నలభై ఏళ్ళ వయసు వుంటుంది. నా గురించి నా ఫ్రెండ్ చంద్రం గురించి కూడా చెప్పింది." జడ్జి సిగర్ వెలిగించి అదోలా నవ్వాడు. "ఆమె ఎవరో చూసిన నీకే తెలియకపోతే నాకెలా తెలుస్తుందమ్మా. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌వి ఎలాగో ఒకలా పేరు చెప్పించాలి."

"అది కోర్టులో. నిజ జీవితంలో కాదు."

అంతలో కారాగిన శబ్దం అయింది. గబ గబ వచ్చాడు జగన్. కోపంగా మాలినివైపు చూశాడు. "అలా పార్టీ మధ్యలో నుండి వస్తే ఏమనుకుంటారు?"

"ఎవరు?"

"వాళ్ళు. కనీసం మాటయినా చెప్పకుండా రావడం నాకేం బాగోలేదు మాలిని" సోఫాలో కూర్చున్నాడు.

"నాకు బాగుంది."

"రేపు పెళ్ళి అయినా అలాగే వస్తావా?"

"అసలు పార్టీలకే రాను."

"మాలిని" కోపంగా అన్నాడు. "కాబోయే భర్తను. భర్త యిష్ట ప్రకారం నడచుకోవడం భారతీయ స్త్రీ ధర్మం."

"కాబోయే భర్త. ఎవరు?"

అప్పటివరకు రామాయణం చదివిన మాధవి వస్తూనే అంది. "ఎవరేమిటమ్మా? జగన్."

మాధవి జగన్ అక్క, మాలిని తల్లి.

"అమ్మా, యీ జన్మలో జరగని పని."

"అంటే?"

"నేను ఇన్స్పెక్టర్ చంద్రాన్ని పెళ్ళి చేసుకోబోతున్నాను."

"మాలిని" దాదాపు అరిచాడు.

"నేను పబ్లిక్ ప్రాసిక్యూటర్ని నా జీవితంలో నా భర్త ఎలా వుండాలో నాకే తెలుసు. నీ అభిప్రాయం మార్చుకోవడం మంచిది."

మాధవి అంగుకుంది. "అది కాదమ్మా చిన్నప్పటి నుండి..."

"కలిసి ఆడుకున్నాం, పాడుకున్నాం. అంతమాత్రాన భార్యను కావాలని లేదు. నన్ను క్షమించమ్మా" అంటూ వెళ్ళిపోయింది.

"మీ అభిప్రాయం అంతేనా మామయ్యా," కోపంగా అడిగాడు జగన్. జగన్నాథ్ప్రసాద్ నీళ్ళు నములుతూ "మైనారిటీ దాటిపోయిన పిల్ల కదా!" అన్నాడు.

"మీరూ అలాగే అనండి. మీరు అలా అలుసు ఇవ్వబట్టే అది నెత్తికెక్కి కూర్చుంది."

"నువ్వుండవే అక్క. వాడు ఇన్స్పెక్టరయినా, యమకింకరుడయినా నన్ను కాదని ఎలా చేసుకుంటుందో చూస్తాను." విస విస వెళ్ళిపోయాడు జగన్. అయోమయంగా చూసింది మాధవి.

మాధవి మెల్లగా జగన్నాథంగారి ప్రక్కన కూర్చుంది.

"ఏమండి?" అంది.

మాధవి మనసు జగన్నాధానికి తెలుసు. "ఏమిటి?" సిగర్ పొగ వదిలాడు నవ్వుతూ.

"వాడి మాటలు పట్టించుకోకండి. అమ్మ నాన్న లేని వాడు. తమ్ముడివైపు ఆ మాత్రం మాట వేయకపోతే బావుంటుందా? అమ్మాయి ఇష్టపూర్తిగా చంద్రానికే ఇచ్చి పెళ్ళి చేద్దాం" అనునయంగా అంది.

"అందుకే నిన్ను దేవత అన్నాను," అంటూ కౌగలించుకోబోయాడు. "సరే లెండి ఎవరయినా చూస్తారు" గభాలున లేచింది మాధవి.

# 3

రెండంతస్తుల మేడముందు కారాపాడు జగన్నాధం. చుట్టూ ప్రహరి, లోపల బోగన్ విలియ, క్రోటన్ చెట్లు అందంగా వున్నాయి. తోటమాలి చెట్లను కత్తిరిస్తున్నాడు.

"రఘుపతి వున్నాడా?" జడ్జి జగన్నాధం ప్రశ్నించాడు.

"వున్నారండి" వినయంగా చెప్పాడు తోటమాలి కేశవులు.

జగన్నాధం కర్రవూపుకుంటూ లోపలకు నడుస్తుంటే లాన్ లో వున్న రఘుపతి పిలిచాడు. "యిక్కడున్నావా? ఏమిటి అంత అర్జంటుగా కబురు పంపావ్?" ఎదురుగా కూర్చుంటూ అన్నాడు.

"ప్రతినెల దేవేంద్రనాథ్ కి యాభైవేలు కడుతున్నాను గదా. నీకు తెలిసే వుంటుంది," రఘుపతి అన్నాడు.

"అవును."

"రేపే కట్టవలసిన ఆఖరురోజు. రాత్రి నాకు బి. పి.

చాలా ఎక్కువయింది. కదల్లేని పరిస్థితిలో వున్నాను. శ్రమ అనుకోక మిత్రుడుగా చిన్న సహాయం చెయ్యాలి."

"చెప్పవయ్యా ఏమిటి సస్పెన్స్?"

"ఏంలేదు. నా బదులు ఆ డబ్బు తీసుకొని నువ్వెళ్ళి కట్టిరావాలి" అనునయంగా అన్నాడు.

జగన్నాధం నవ్వాడు "యీమాత్రానికేనా? ఆడబ్బు యిలా యివ్వు నేను కట్టేసి వస్తాను."

రఘుపతి "థాంక్స్" అంటూ మెల్లగా లేచి లోపల నుండి బాక్స్ తెచ్చి అందించాడు. "యాభైవేలు కాగితం మాత్రం తీసుకో."

కారు స్టార్ట్ చెయ్యబోతూ జగన్నాధం అన్నాడు. "నీ దగ్గర యాభైవేలు తీసుకున్నట్లు కాగితం యివ్వద్దు."

"భలేవాడివయ్యా నీమీద ఆ మాత్రం నమ్మకం లేక పోతే నిన్నే ఎందుకు రమ్మంటాను" నవ్వాడు రఘుపతి.

జగన్నాధం కారులో బయలుదేరాడు.

మధ్యాహ్నం రెండుగంటలయింది. వేసవికాలం కావటం చేత రోడ్లమీద రద్దీలేదు. కారు వేగంగా మలుపు తిరుగు తూంది. తారురోడ్డుమీద పాములా జారిపోతుంది.

ఎదురుగా దూరంగా ఒక ఆకారం రోడ్డుమీద మధ్యగా నిలబడివుంది. సడన్ బ్రేక్ వేశాడు. కారు ఆగి పోయింది.

"పరమేశం" అప్రయత్నంగా అన్నాడు.

పరమేశం నవ్వాడు "ఎక్కడనుండి?"

"నాతోరా పరమేశం నీతో ఒక విషయం మాట్లా డాలి."

"నీతోనా? భలేవాడివి న్యాయమూర్తి. చంపి పార

వేస ఆసలు హత్య జరగలేదని తీర్పు యివ్వగలవు. సారీ వెళ్ళిరా.''

''అదికాదు పరమేశం.''

''ప్రస్తుతం పరామర్శించాలని పిలిచాను. వెళ్ళిరా'' నవ్వుతూ వెళ్ళిపోయాడు పరమేశం. జగన్నాథం ఏదో మాట్లాడాలని అనుకున్నాడు. ఆ అవకాశం పరమేశం యివ్వలేదు.

# 4

కారు యింటిముందు ఆపి, కారుదిగి డోర్ వేసి వెనుక సీట్లో పెట్టిన బాగ్ చూశాడు. మతిపోయినట్లయింది. ఆ సీట్లో తను పెట్టిన యాభైవేల బ్రీఫ్‌కేసు లేదు. డోర్ తెరిచి ఆత్రుతగా వెతికాడు. గుండెల్ని ఎవరో పట్టేసి నట్లనిపించింది.

''ఏమిటండీ?'' మాధవి వచ్చింది.

అప్పటికే ముఖంనిండా చెమటలు పోశాయి. ''యాభై వేలు మాధవి, యాభైవేలు'' కంగారుగా వణికి పోతున్నాడు.

''ఏభైవేలా? ఏమిటండి?'' విస్తుపోయింది.

''బ్రీఫ్‌కేసులో పెట్టి యీ వెనుక సీట్లో పెట్టాను. యాభైవేలు ఎవరో కొట్టేశారు మాధవి'' గొంతు జీర పోయింది. ''రేపే ఆఖరురోజు ఆ డబ్బు కోర్టులో కట్టాలి. ఎలా?''

''ఎవరి డబ్బండి? ఎందుకు కట్టాలి?'' మాధవి బాధ ఏడుపుగా మారుతూంది.

జరిగింది చెప్పాడు జగన్నాథం.

''దారిలో ఎక్కడయినా కారాపారా?''

"లేదు. ఆ పరమేశం కనిపించాడు."

"అయితే పరమేశం మీతో మాట్లాడుతూవుండగా ఎవరో వెనుకనుండి డబ్బుకొట్టేసివుంటారు. రేపటిలోగా యాభైవేలు ఎక్కడ తేగలం. నా నగలమ్మివేయండి."

"లాభంలేదు మాధవి. నగలన్నీ అమ్మినా యిరవై వేలు-కంటె ఎక్కువరావు." ముఖంనిండా చెమటలుపోశాయి. ఆరాటం, ఆతృత, భయం బాధిస్తుంది. "ఇప్పుడేం చేస్తారు?"

"చస్తాను."

"ఏమిటండి ఆ మాటలు?"

"నీవు తెలీదు మాధవి, రఘుపతి ఎంత నమ్మకంగా అన్నాడో తెలుసా? యిన్నాళ్ళు న్యాయమూర్తి జగన్నాథం అంటే నీతికోసం ప్రాణాలు యివ్వటాని కయినా సిద్ధపడ్డ మనిషి. ఈ నాడు అదంతా ఏమయిపోతుంది?"

"పోలీసు రిపోర్టు యివ్వండి."

"వద్దు మాధవి. దానివల్ల డబ్బు తిరిగి వస్తోందో లేదోగాని, పరువుపోతుంది."

"మరిప్పుడేం చేస్తారండి?"

"అదే తెలియటం లేదు. పోనీ మా అన్నయ్య దగ్గరకు వెళ్ళివస్తాను. ఒక పాతిక వేలయినా యివ్వమంటాను."

"కూతురు పెళ్ళిచేసి ఆయన యిబ్బందుల్లో వున్నాడు గదా! ఏమంటారో" బాధగా అంది మాధవి.

"మన ప్రయత్నం మనం చెయ్యాలి గదా!"

## 5

రిలాక్స్‌గా కూర్చున్న అనసూయ దగ్గరకు జోగులమ్మొచ్చింది. "అమ్మా మీకోసం ఎవరో వచ్చారు?"

అనసూయకు చిరాకు వేసింది "ఎవరే" అంది.

"ఎవరో చెపితే మీ ముఖం మారిపోతుంది."

"అయితే చెప్పొద్దు జగన్నాథంగారు" అని చివాలున లేచింది. జోగులమ్మ నవ్వి వెళ్ళిపోయింది.

డ్రాయింగ్ రూము కర్టెన్ తొలగించి లోపలకు వచ్చాడు జగన్నాథం. "ఎన్నిరోజుల కొచ్చారు? నన్ను మరచిపోయారా?" బాధగా అంది.

"లేదు అను. యీమధ్య తీరిక లేదు."

"పోనివ్వండి యీ రోజయినా వచ్చారు. అదే పది వేలు" లోపలకు నడవబోయింది. "అను. ఒక మాట అడుగుతాను."

"అడగండి అక్క్ర దేవుండి అడగాలా?"

"లేదు" అంటూ పడకగదిలోనికి నడిచాడు.

"కూర్చోండి కాఫీ తెస్తాను."

జగన్నాథం చెయ్యి పట్టుకున్నాడు "వద్దు అను. నా మనసు బాగుండలేదు."

అనసూయ విస్తుపోయింది.

"యింత కాలంలో యీ మాట ఎప్పుడూ వినలేదు."

"అవును. యీ వేళ నా పరువు ప్రతిష్టకు భంగం కలగబోతుంది" గంభీరంగా అన్నాడు.

"నాకు తెలుసండి. యీ డాన్సర్ అనసూయతో మీ సంబంధం ఎప్పుడో ఒకప్పుడు బయటపడుతుంది. మీ పరువు పోతుంది."

"అదేంకాదు అనసూయ. ఎవరేమన్నా, ఎన్నన్నా నీవు నా ప్రియురాలివే. నిన్ను కాదనలేను, దూరం కాలేను. యీ రోజు సమస్య అదికాదు. చాలా క్లిష్ట సమస్య. నాకు

యాభై వేలు కావాలి.''

''యాభై వేల రూపాయలా?''

''అవును. యీ రోజు అవసరం అలాంటిది.''

''నాట్యం నేర్పించి బ్రతికే నాకు యాభైవేలు ఎలా వస్తాయండి. నా దగ్గర అంత డబ్బు ఎక్కడుంది? ఒక అవసరం కొరకు మూడువేలుంచాను. కావలిస్తే తీసుకు వెళ్ళండి.''

''మూడు, యాభైవేలలో ఎంత. పోనీలే అనసూయ నా ప్రయత్నం నేను చేస్తాను.'' దగ్గరకు తీసుకున్నాడు.

''ఏమండి మీకు అవసరమయిన సహాయపడలేని దుర దృష్ట వంతురాల్ని. మీ డబ్బు తీసుకోవడమే గాని___'' ఆమె కళ్ళలో నీరు నిండాయి.

''నానా అదేంకాదు. ఒక జడ్జి హోదాలో యాభై వేలు కూడబెట్టలేని నేను, అనాధవయిన నీ దగ్గర ఎలా వుంటాయి. బాధపడకు అను''.

''మరి ఎలా సంపాదిస్తారు.''

''భగవంతుడున్నాడు. నా ప్రయత్నం నేను చేస్తాను'' అనసూయ కళ్ళు తుడిచాడు.

## 6

డైనింగ్ టేబులుదగ్గర మాలినికోసం జగన్, మాధవి ఎదురుచూశారు. మేడమీదనుండి గబ గబ క్రిందికి వచ్చింది. అప్పటి వరకు మాలిని ఏం చేస్తుందా అనుకుంది మాధవి.

మాలిని ఎవరితో మాట్లాడకుండా భోజనం ముగించింది. మాలిని మౌనానికి కారణం తెలియని మాధవి అడగాలను కుంది.

జగన్ భోజనం ముగించి ముందుగా లేచి వెళ్ళి పోయాడు.

"డాడి భోజనానికి రాలేదా?" మాలిని అడిగింది.

"కోర్టునుండి రావటంతో డాడి ఏడి అని అడిగేదానివి భోజనం ముగించాక డాడి జ్ఞాపకం వచ్చాడన్నమాట." మాధవి నిష్ఠురంగా అంది. మాలిని విసురుగా చూసింది.

"మా డాడి దేవుడని ఇన్నాళ్ళు అనుకున్నాను" ఆ స్వరం కఠినంగా వుంది.

"అంటే ఇప్పుడు దుర్మార్గుడనుకున్నా వన్న మాట."

"మమ్మీ" అంది మాలిని. "నీ దృష్టిలో మీ డాడి దుర్మార్గుడయినా నాకు మాత్రం దేవుడు" స్పష్టంగా అంది మాధవి.

"అయితే సరి" మాలిని గబగబ బెడ్ రూంలోనికి వెళ్ళి పోయింది. మాధవి కొన్ని నిముషాల తర్వాత మాలిని గది లోనికి వెళ్ళింది.

"యింతకీ విషయం చెప్పలేదు" మాధవి అంటూనే వెంబడించింది.

"చెపితే నీ గుండెలు పగిలిపోతాయమ్మా."

"నా గుండె నీ అంత కఠినమయింది కాదు పగల టానికి."

"పరమేశం నీకు తెలుసా?" సూటిగా అడిగింది.

మాధవి నవ్వింది. "అయితే అనసూయ గురించికూడా తెలిసివుండాలి."

చటుక్కున చూసింది మాలిని "అనసూయ నీకు తెలుసా?"

"తెలుసు."

"అనసూయకు మా నాన్నకు సంబంధం వుందనికూడా

తెలుసా?'' కటువుగా అంది.

''జీవితంలో ఓడిపోయిన ఆడది అనసూయ. జీవితంలో తప్పటడుగు వేసిన యువతి ఆమె. ఆనాటి యువతి విషయంలో మీ నాన్న తన ప్రేమను చంపుకోలేక పోయాడు.''

''అంటే ఆయన వుంపుడుగత్తెని సమర్థిస్తున్నావా?''

''భార్యగా నన్ను ఆరాధించే పవిత్రమూర్తి ఆయన. ఆమెకు దగ్గరయినంతమాత్రాన నన్ను దూరం చేసుకోడు. ఆ నమ్మకం నాకుంది. సాటి స్త్రీ జీవితం గురించి—''

''జాలిపడి నీ భర్తను దూరం చేసుకుంటావా?''

''ఆయన తొలిప్రేమ కథకు నేను అడ్డం అయినా అనుభవాల విషయంలో అడ్డం కాకూడదు. నేను కాని స్తే ఆయన నాకు యింకా దూరమయ్యే అవకాశంవుంది'' మాధవి అంటూంటే మాలిని మరీ రెచ్చిపోయింది.

''పెళ్ళికి ఎదిగిన కూతుర్ని నేనుండగా, ఒక జడ్జి హోదాలోవున్న నా తండ్రి యిలా చేయటం నేను సహించను.''

''ఏం చేస్తావ్?''

''నిలదీసి అడుగుతాను.''

''అప్పుడు ఓడిపోయేది నువ్వే మాలిని. ఏ స్త్రీ అయినా మగవాడ్ని శాసించి దారికి తేలేదు. అనునయంగా దారికి తీసుకురావటం అలవరచుకోవాలి. నా భర్త హృదయం నాకు తెలుసు. నీవు తండ్రిగా ఆయన్ని చూశావ్. కాని నేను భర్తగా చూశాను'' అంటూ వెళ్ళి పోయింది మాధవి.

మాలిని ప్రాన్పడిపోయింది.

# 7

సర్కార్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరుతూవుండగా అత్యాతగా ఒకమ్మాయి కంపార్టుమెంట్‌లో ప్రవేశించింది.

ఆ పెట్టెలో జగన్నాథం ఒక్కడే కూర్చున్నాడు. చెదిరిన తల, లోతుకుపోయిన కళ్ళు, నీరసంగా ఆమెవైపు చూసి తల తిప్పుకున్నాడు. ఆమె అతని ఎదురుగా కూర్చుంది.

ఆ కంపార్టుమెంటులో ఆ యిద్దరే ప్రయాణీకులు.

ఆమె వయస్సు పాతికపైన వుంటాయి, చేతికి గాజులు, రెండవ చేతిలో వాచీవుంది. ముఖాన బొట్టు. మెడలో మంగళసూత్రం వున్నట్టులేదు.

"ఎక్కడవరకు వెళతారు?"

"మద్రాసు" ముక్తసరిగా అన్నాడు.

"నేను మద్రాసేలెండి. మా వారు మద్రాసులో పని చేస్తున్నారు."

జగన్నాథం ఆమె మెడవైపు చూశాడు. మాంగల్యం లేకపోవటం ఒకరకమయిన ఫేషను అనుకున్నాడు.

"మిమ్మల్నెక్కడో చూసినట్లుంది."

అతను మాట్లాడలేదు.

"మీరేం చేస్తుంటారు?" మళ్ళీ అడిగింది.

"జడ్డి జగన్నాథం నా పేరు!" గంభీరంగా అన్నాడు. ఆమె ముఖం రంగులు మారి మౌనంగా కూర్చుంది.

జడ్జి జగన్నాథం డబ్బు గురించే ఆలోచిస్తున్నాడు.

ఆమె వారపత్రిక తీసి చదువుతుంది.

రైలు సాగిపోతుంది.

"గౌరవనీయులతో ప్రయాణంచేయుటకన్న తప్పు లేదు."

జగన్నాథం చూశాడు.

"మీరు జడ్జియే యిక్కడకూడా జడ్జిమెంట్ యిస్తు న్నట్లువుంటే ఎలా చెప్పండి?"

"చూడమ్మాయ్ నా మనసేం బాగోలేదు. నీకు యిష్టం లేకపోతే మరొక కంపార్టుమెంట్ మారు, లేదా నేను మారిపోతాను."

"అంత శ్రమ ఎందుకులెండి" మూతి ముడుచుకుంది.

జగన్నాథం సిగర్ వెలిగించాడు. ఆమె ఆదోలా చూసింది.

"నీకు అభ్యంతరమా?" అడిగాడు.

"లేదు. నేను సిగరెట్టు వెలిగిస్తే మీకు అభ్యంతరమా?" అందామె. వులిక్కిపడ్డాడు. ఆమె, అతని ప్రమేయం లేకుండా వేలెట్‌లోనుండి సిగరెట్ తీసి వెలిగించింది.

జడ్జి జగన్నాథానికి బోలెడంత చిరాకేసింది.

మనసు బాగోలేనప్పుడు యిలాంటి జంతువులు ఎక్కువగా తగులుతూవుంటాయి అనుకున్నాడు. సిగర్ పారేసి మంచినీళ్ళు త్రాగి కళ్ళుమూసుకున్నాడు.

క్రమంగా నిద్రపట్టేసింది. నిద్రలో డబ్బుగురించి కల' ఆ కలలోనే పెదవులు వణకుతున్నాయి.

అన్నయ్య డబ్బు లేదనటం, తను తిరిగి రావటం' యీ భైవేల సమస్య.

## 8

గబాలున కళ్ళు విప్పాడు. మద్రాసు సెంట్రల్ స్టేషన్.

రైలు ప్లాట్ ఫారంపైన ఆగి రెండు నిమిషాలయివుంటుంది. ఎదురుగా ఆఅమ్మాయి లేదు. బాక్స్ తీసుకున్నాడు.

బరువుగా వుంది.

విస్తుపోయాడు. ఆ బ్రీఫ్ కేసు తనది కాదు ఆ అమ్మాయి దయివుంటుంది. బ్రీఫ్ కేసు మార్చి వేసింది.

ఎవరో దొంగలరాణి బాక్స్ కాజేసింది. తన బాక్స్‌లో ఏమున్నాయి గనుక, చిరాగ్గా దిగి స్టేషనంతా కలయ చూశాడు. ఆ అమ్మాయి జాడలేదు. స్టేషన్ బయటకు వచ్చాడు.

"సార్ టాక్సి...టాక్సి" అంటూనే టాక్సివాడు చేతిలోని బ్రీఫ్ కేసు అందుకున్నాడు. జగన్నాథం ఎక్కి కూర్చున్నాడు.

పది నిమిషాల్లో యిల్లు చేరింది.

బ్రీఫ్ కేసు తీసుకొని లోపలకి నడిచాడు.

"ఏమయిందండి?" మాధవి అడిగింది. "ఏం కాలేదు. మన నుదుటివ్రాత బాగోలేదు. తమాషా చూడు యీ బ్రీఫ్ కేసు మారిపోయింది. నా కేసులో వేలువున్నాయని ఒకమ్మాయి నా కేసు తీసుకుపోయింది."

"అయ్యో డబ్బుంటే కొంప మునిగేది. తెరవండి."

"మంచి చీరలేమయినా వున్నాయనా?"

"భలేవారండి" అంటూ హామర్ తెచ్చింది. "ఏముండి దానికి కట్టినదారం తెగివుంది."

"కేసు మార్చినప్పుడు తెగివుంటుంది" అంటుండగానే క్లిప్ మీద చిన్నదెబ్బ కొట్టింది. క్లిప్ వూడి పడిపోయింది. పెట్టె తెరిచింది.

ఇద్దరు స్టన్ అయిపోయారు.

వరుసగా పేర్చిన డబ్బు కట్టలు. "ఏమిటండి యిదీ?"

"యింత డబ్బు ఆ అమ్మాయి ఎందుకు వదిలింది?"

ఇద్దరికి మతులు పోయాయి. ఏం చెయ్యాలో తోచ లేదు. "యిప్పుడేం చేద్దాం?"

"ఆ యాభైవేలు కట్టేయండి."

"వద్దు మాధవి. పాపం, ఆ అమ్మాయెవరో?"

"ఆ అమ్మాయి అచూకి తెలిస్తే అప్పుడే ఎలాగో సర్ది చెప్పి యివ్వవచ్చు."

"పరాయి సొమ్ము. జడ్జిగా యిలా చేయటం తప్పుకదా మాధవి" అయిష్టంగా అన్నాడు.

"అలా అనుకుంటే ఎలా యింకా రెండు గంటలే టైముంది. డబ్బు కట్టకపోతే మీరు, మీ పేరు ప్రతిష్టలు ఏమవుతాయి?"

జడ్జి, యీ సమస్యను ఎలా జడ్జిమెంట్ చెయ్యాలో అర్థంకాలేదు.

# 9

దేవేంద్రనాథ్‌కు డబ్బు యిచ్చి తిరిగి బయలుదేరాడు' జడ్జి జగన్నాథం మనసు పరిపరివిధాలుగా వుంది. తను తప్పుచేశాడు. మనసులోనే అప్పటికి అరవైసార్లు అను కున్నాడు అంతకంటె మార్గంలేదు.

పుట్‌పాత్ మీద నిలబడి టాక్సీకోసం వెతికాడు.

టాక్సి రావటంలేదు. ఎదురుగావున్న డ్రింక్ షాపు లోనికి వెళ్ళాడు. బేరర్ ఛార్టు అందించాడు. చార్టు తీసు కొని, 'బాదంపాలు ఒకటి' అన్నాడు. ఎదురుగా అద్దా లలో నుండి ఒక ముఖం పదిముఖాలుగా కనిపిస్తుంది.

ఎవరో అపరిచితుడు ఎదురుగా కూర్చున్నాడు. "మీకు బాదంపాలంటే యిష్టమా?" అడిగాడు. జగన్నాథం చిరాగ్గా చూశాడు. "ఏమిటి అలా చూస్తున్నారు. మీరు

నా టాక్సీలోనే స్టేషన్ నుండి యింటికి వెళ్ళారు."

"అలాగా" ముక్తసరిగా అన్నాడు.

"ఈ పేపరు చూడండి," అందించాడు.

పేపరులో ఒక కాలం చూసి విస్తుపోయాడు.

ధనలక్ష్మి విజయవాడ నుండి మద్రాసుకు వస్తుండగా ఒకేరకం బ్రీఫ్ కేసు తారుమారు చేసి దొంగపలాయనం. బ్రీఫ్ కేసులో రెండు లక్షలరూపాయలు నగలు, డబ్బు వున్నాయి.

"అయితే ఏమిటంటావ్?"

"నేనేమంటాను. ఆ డబ్బుతో మీ అవసరాలు తీర్చుకున్నారు. నా అవసరంకూడా తీర్చివేస్తే బాగుంటుంది" అతనన్నాడు.

"ఏమిటి మతిలేని మాటలు."

"రెండు లక్షలు కళ్ళచూసిన మీకే మతిలేకుండా వుండాలి. ఆ బాక్స్ మీరే తీశారు అదేదానికి సాక్ష్యం" అంటూ జేబులో నుండి అట్టముక్క తీశాడు. దానిపైన ధనలక్ష్మి పేరు, విలాసం వుంది. "యిది ఆ బాక్స్‌నుండి నేనే తెంపివేశాను. బుకాయిస్తే లాభంలేదు. మీ అవసరాలు మీరు తీర్చుకోండి, నాకు కావలసింది ఒక్క పది వేలు. క్రొత్త టాక్సీకి డబ్బు చాల్లేదు."

"బ్లాక్ మెయిలా?"

"ఇలాంటి పేర్లు నాకు తెలియవు. రిక్వెస్టుగా అడుగుతున్నాను. ఆపై మీ యిష్టం."

"ఆ బాక్స్‌లో డెబ్బైవేలకంటె ఎక్కువలేవు."

"ఎంతుంటే నాకెందుకు నాకు కావలసింది పదివేలు."
బేరర్ డ్రింక్ తెచ్చాడు.

జగన్నాథం బాక్సులో నుండి పదివేలు తీసి యిచ్చాడు "ఆ కార్డుయివ్వు" అడిగాడు "భలేవారండి. ఈ కార్డు మీకిస్తే అడ్రసు మరిచిపోతానా? నథింగ్, ఆర్. ధనలక్ష్మి, చంగన్ స్ట్రీట్, అరుంధతి నగర్, మద్రాసు 600 012. వస్తాను" అని అతను లేచి గబగబ వెళ్ళబోయి ఆగాడు. "నా పేరు గుర్తించుకోండి. సి యు" వెళ్ళి పోయాడు.

జడ్డి జగన్నాథం చూస్తూవుండటం తప్ప ఏం చేయలేక పోయాడు.

మెల్లగా బయటకు వచ్చాడు. సిగర్ వెలిగించాడు.

ఎదురుగా బస్‌స్టాపులో పేపరు చదువుతున్నాడు పరమేశం.

మనిషి చాలవరకు మారినట్లున్నాడు. నీటైన బట్టలు వేసుకున్నాడు. కళ్ళకు అద్దాలున్నాయి. తల, గడ్డం మాత్రం మారలేదు. అతను తనను చూశాడా? చూసి చూడనట్లు వూరుకున్నాడా? ఆలోచిస్తుండగానే బస్ రావటం అతను బస్ ఎక్కి వెళ్ళిపోయాడు.

జగన్నాథం బరువుగా నిట్టూర్చి దగ్గరలో వస్తున్న టాక్సీని పిలిచి ఎక్కాడు. "టి. నగర్ పోనివ్వు" అన్నాడు.

కొన్ని నిముషాలలో టి. నగర్ అనసూయ డాబా ముందు ఆగింది టాక్సీ. టాక్సీకి డబ్బులు యిచ్చి లోపలకు నడిచాడు. లోపల అంతా ప్రశాంతంగావుంది.

డ్రాయింగ్ రూము కలయచూశాడు.

ఎవరివో బూట్లు విప్పివున్నాయి. పడకగదిలోనుండి మాటలు విన్పిస్తున్నాయి. మెల్లగా అడుగులు వేసి కర్టెన్

కాస్త తొలగించి చూశాడు. మెదడు మొద్దుబారి పోయింది.

అనసూయ ద్రాక్షపళ్ళు తినిపిస్తుంది. ఇద్దరు దగ్గరగా కూర్చున్నారు. ఆ రెండో మనిషి ఎవరో కాదు తనకాబోయే అల్లుడు ఇన్ స్పెక్టర్ చంద్రం. తన గుండెను రంపంతో కోసినట్లయింది. తల తిరిగిపోయింది.

"యింకా ఎన్నాళ్ళు యీ ముసుగులో" అన్నాడు.

"నీ పెళ్ళి అయ్యేవరకు" బుగ్గలు నిమిరింది.

జడ్జి జగన్నాథం అక్కడ నిలబడలేకపోయాడు. వళ్ళు తూలిపోతున్నట్లయింది. కాళ్ళు నిలదొక్కుకుని రోడ్డు మీదికి నడిచాడు. టాక్సీని పిలిచి ఎక్కి కూర్చున్నాడు.

ఇన్నాళ్ళు తన్నుతప్ప మరో పురుషుడి ముఖం తెలియదనుకున్న అనసూయ యింత నీచురాలా? ఇన్ స్పెక్టర్ చంద్రం యింత దుర్మార్గుడా? ఛి, ఛి తన జీవితంలో భయంకరమయిన రోజులు ప్రారంభమయ్యాయి.

ఇన్నాళ్ళు సంపాదించిన డబ్బు ఆ దుర్మార్గుడికి యిస్తుందన్నమాట.

టాక్సీ యింటిముందు ఆగింది. టాక్సీదిగి డబ్బులు యిచ్చి లోపల కెళ్ళబోయాడు. "నమస్తే సార్" చక్రవర్తి అన్నాడు.

"నువ్వా! యిక్కడికెందుకొచ్చావ్."

"మీరు యిచ్చిన పదివేలు చాలలేదు. యింకో ఐదు వేలయినా తీసుకుపోదామని" చక్రవర్తి నవ్వాడు.

"నా దగ్గర డబ్బులేదు."

"తప్పండి. నేను భగవంతుడిలాంటి వాడ్ని మీ దయ నాకు వుండాలి. ఎంత అడిగాను కేవలం ఐదువేలు."

అతనితో సంభాషణ మంచిది కాదని ఐదువేలిచ్చి గబగబ లోపలకు వెళ్ళిపోయాడు.

"ఎవరండి అతను?" వరండాలోనుండి చూసిన మాధవి అడిగింది.

జగన్నాధంకి ఏం చెప్పాలో తోచలేదు. "పద చెబుతాను" అంటూ లోపలకు దారితీశాడు.

# 10

"ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదు." కటువుగా గంభీరంగా అన్నాడు జడ్జి జగన్నాధం.

"ఎందువల్ల?" సూటిగా అడిగింది మాలిని.

"చంద్రం గురించి నీకు తెలిసింది తప్పు."

"మీకు తెలిసిన రైటు ఏమిటో?"

"మాలిని" అరిచాడు "నీవు పబ్లిక్ ప్రాసిక్యూటర్ అయినంత మాత్రాన నాతో అర్గ్యుమెంట్ చేయక. యిది కోర్టుకాదు. చంద్రం ఒక వేశ్యతో వుండగా నేను చూశాను."

"మీరు వేశ్యదగ్గరకు ఎందుకెళ్ళారు?" కళ్ళలోనికి చూసి అడిగింది. జగన్నాధం ఖంగుతిన్నాడు. వెంటనే మాటరాలేదు. అయినా గొంతు పెగల్చుకొని "అది నీకు అనవసరం."

"నా భర్త విషయం నాకు చాలా అవసరం."

"ఇంకా నీకు భర్తకాలేదు."

"ఏది ఏమయినా నా భర్త మీలాంటి వాడుకాదు."

"అంటే నీ అభిప్రాయం."

"అనసూయ అనే అమ్మాయితో మీకు సంబంధం వుంది." చురుకుతగిలినట్లు చూశాడు. "అయితే నా గురించి

చాలా తెలుసుకున్నవన్నమాట. నా తప్పులు నా భార్య లెక్క పెట్టలేదు."

"కొన్ని విషయాలు భార్య అడగకపోవచ్చు, కాని కన్నబిడ్డలడుగుతారు" సూటిగా అంది.

"నీకు సంజాయిషీ చెప్పవలసిన అవసరం నాకు లేదు" అంటూనే ద్వారం వైపు తిరిగాడు.

ద్వారందగ్గర టాక్సీవాడు వినయంగా నమస్కారం పెట్టాడు.

జడ్డి జగన్నాథం గబగబ వెళ్ళాడు. "ఏం కావాలి?"

"తమరు చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నారు. నిలబడతాలెండి. మీరు కానివ్వండి."

"అవసరం లేదు చెప్పు."

"మరేంలేదు. టాక్సీవ్యాపారం లాభసాటిగా లేదు."

"అందుకు నన్నేం చెయ్యమంటావ్?"

"మీరే అలా సెలవిస్తే ఏం మాట్లాడగలను. ఏదో తమ దయలో లారీ కొనాలనుకున్నాను. ఒక పాతిక వేలు యిస్తే."

"పాతిక వేల రూపాయలా ఎక్కడ దొంగతనం చెయ్యమంటావ్?" కోపంగా అన్నాడు.

"అంత శ్రమ మీకెందుకండి మీ యింట్లోనే వుందిగా. మళ్ళీ వస్తాను చూసివుంచండి!"

"నా దగ్గర డబ్బులేదు. అరిచి గీపెట్టినా చిల్లిగవ్వ యివ్వను."

"చిల్లిగవ్వలు, చింతపిక్కలు నాకెందుకులెండి. ఏదో నాకు భగవంతుడు ఒక చెంచాడు జాలి యిచ్చాడు కాబట్టి ఏదో పరక అడుగుతున్నాను. ఆలోచించుకోండి. మళ్ళీ

పదినిమిషాల్లో వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు. ఎదురుగా జగన్ టాక్సీ దిగాడు.

అప్పుడే లోపలకి వస్తున్న జగన్ అడిగాడు "ఎవడు మామయ్యా వాడు?"

జగన్నాథం చటుక్కున సమాధానం యివ్వలేదు. క్షణం ఆగి "ఏదో వుద్యోగం కావాలట—జగన్ నీవు, మాలినికి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాను. ఎవరికి యిష్టమున్నా లేకపోయినా యిది నా నిర్ణయం."

"క్షమించండి మామయ్యా."

"జగన్" విస్తుపోయాడు.

"అవును మామయ్యా. ఇష్టంలేని భార్యతో ఏ భర్త కాపురం చెయ్యలేడు. మాలిని యిష్టప్రకారమే పెళ్ళి జరిపించండి" మౌనంగా లోపలకి వెళ్ళిపోయాడు.

# 11

గడియారం మూడు గంటలు కొట్టింది.

ఆఫీసురూంలో కూర్చున్నాడు జడ్జి జగన్నాథం. ముఖంలో అంతులేని బాధ, విపరీతమయిన అలసట, ఆవేదన కళ్ళుమూసుకుని కూర్చున్నాడు. మాధవి వచ్చింది. అతన్ని చూస్తూనే కళ్ళలో నీరు నిండాయి. దుఃఖం పొర్లుకువచ్చింది.

ఏదో అలికిడి అయినట్లు గబాలున కళ్ళు తెరిచాడు "మాధవి, ఏడుస్తున్నావా?" ఆత్రృతగా అడిగాడు.

"భోంచెయ్యండి."

"ఆకలిగాలేదు మాధవి."

"ఆకలిలేదని అంటకుండా ఎలాగండి? రండి ఒక్క ముద్ద తిందురుగాని" జగన్నాథం మెల్లగా లేచాడు.

మాధవి దగ్గరగా వచ్చాడు "నువ్వు ఫోంచెయ్యలేదు గదూ!"

మాధవి మాట్లాడలేదు.

"పద, వడ్డించు వస్తాను."

మాధవి వెళ్ళిపోయింది.

జడ్జిజగన్నాథం ముఖం రంగు మారిపోయింది. గబాలున సొరుగులాగాడు. సొరుగులో రివాల్వర్ వుంది. వణికేచేత్తో అందుకున్నాడు. కోటుజేబులో పెట్టుకున్నాడు.

"మె ఐ కమిన్ సర్" ద్వారం దగ్గర నిలబడి అన్నాడు చక్రవర్తి.

జడ్జిజగన్నాథం సూటిగా చూసి "రా" కటువుగా అన్నాడు.

"డబ్బు అప్పుడే అందిందా?"

"కాదు. నీ చావు" అంటూ రివాల్వర్ గురిపెట్టాడు. చక్రవర్తి దగ్గరగా నవ్వాడు. "నా గుండె యీప్రక్క కాదు మిస్టర్ జగన్నాథం, నాకుడివైపు గుండెవుంది కొందరికి అలాగేవుంటుంది."

"ఏవైపునవున్నా నిన్ను చంపకుండా వదలను."

"అమాయక జగన్నాథం దొంగతనానికి కేవలం ఐదు సంవత్సరాలలోపతే జైలుశిక్ష కాని హత్యకు నీకు తెలుసు గదా" అంటూ గబాలున చేతిపైకొట్టాడు. అలా చేస్తాడని జగన్నాథం అనుకోలేదు.

రివాల్వర్ క్రిందపడిపోయింది.

"ఈ రివాల్వర్తో మాలాంటి వాళ్ళ పని. ఇప్పటికి డబ్బు అందనపోతే క్షమించి వదులుతున్నాను. ఈ రాత్రి తొమ్మిది గంటలకు - సెంట్ పీటర్సు చర్చి దగ్గరగావుంది

మా యిల్లు. ఇంటిముందు కొబ్బరిచెట్లు జంటగా వుంటాయి తిన్నగా వచ్చి డబ్బుయిచ్చి పరువు కాపాడుకో. డబ్బు పోతే సంపాదించుకోవచ్చు. పరువుపోతే ఎట్లా సంపాదిస్తావ్'' వెళ్ళబోయి ఆగి వెనుతిరిగి ''అన్నట్లు నీ ప్రియురాలు అదే అనసూయ, ఆమె గురించి మరొక విషయం కూడా చెప్పాలి.''

''ఏమిటది ఆ విషయం నీకెలా తెలుసు?''

''భగవంతుడులాంటి వాడినని చెప్పానుగా తినబోతూ రుచి అడగటమెందుకు. అక్కడికిరా మాట్లాడదాం'' వెళ్ళిపోయాడు చక్రవర్తి. జగన్నాథం నిశితంగా చూస్తుండిపోయాడు.

ఆలోచిస్తే యిదేదో మిస్టరీలా అనిపించింది.

భోంచేస్తున్నప్పుడు రెండువైపుల చూసి ఎవరూ లేదని తీర్మానించుకొని అన్నాడు ''మాధవి.''

''ఏమిటండి?''

''ఇదంతా నాకేదో అనుమానంగావుంది.''

''అనుమానమా? ఏ విషయంలో.''

''ఎవరో నాపై కక్షపూని యిలా సాధిస్తున్నారని అనుమానంగావుంది మాధవి. మొదటినుండి ఆలోచిస్తే డబ్బు పోవటం, ఆ అమ్మాయి డబ్బున్న బ్రీఫ్‌కేసు వదిలి వేయటం, అందులో వున్నది డెబ్బై వేలయితే రెండు లక్షలని పేపరులో వేయటం.''

''నాకు అలాగే అనిపిస్తుందండి. ఎవర్నయినా డిటెక్టివ్‌ను కన్సల్ట్ చేస్తే.''

''ఇంతకథ జరిగాక. నో. నో. ఈ వేళతో వాడి అంతు తేల్చివేస్తాను. ఆ చక్రవర్తిగాడు నేను బొమ్మనను కున్నాడు.''

"ఏం చేశాడు మామయ్యా" జగన్ గదిలోనికి వస్తూనే అన్నాడు.

ఇద్దరు తొట్రుపడ్డారు. చటుక్కున ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు.

"ఏం లేదురా. ఎవడో రికమండేషన్ లెటర్ తెచ్చి వుద్యోగం యిప్పించమన్నాడు. ఆ రికమండ్ చేసిన వ్యక్తి ఎవరో నాకు తెలియదు" అన్నాడు జగన్నాధం.

"వుద్యోగం లేదంటే పోలా. ఎందుకు వాడితో రాద్ధాంతం" నవ్వుతూ వెళ్ళిపోయాడు.

# 12

రాత్రి ఎనిమిది గంటలయింది.

చిన్నగా కురుస్తున్న తుంపర, వీధి దీపాలు నిశ్చలంగా తడుస్తున్నాయి. ఆకాశమంతా తెల్లని మబ్బు కమ్మివుంది. అక్కడక్కడ వురుములు, అక్కడక్కడ మెరుపులు. చేతిలో గొడుగు తీసుకుని రోడ్డుపైకి వచ్చాడు.

అప్పుడే అటుగా వస్తుంది టాక్సి. "సెంట్ పీటర్స చర్చ్" అని చెప్పి ఎక్కి కూర్చున్నాడు. భూమి చల్ల బడింది కాని, జగన్నాధం మెదడు వేడెక్కిపోయింది. జేబులోని సిగరెట్ తీసి వెలిగించాడు.

కొన్ని నిమిషాల తర్వాత సెంట్ పీటర్స చర్చిముందు టాక్సి ఆగింది. "మళ్ళీవస్తానుండు" అంటూ తలెత్తి చూశాడు.

చర్చి వెనుకగా కొబ్బరిచెట్లువున్న అగ్గిపెట్టలాంటి మేడ. లోపల లైటు వెలుగుతుంది. గొడుగు తెరిచి మేడ వైపు నడిచాడు. తలుపు దగ్గరగా వేసివుంది.

"చక్రవర్తి" పిలిచాడు. లోపలనుండి సమాధానం రాలేదు.

మెల్లగా తలుపు తోశాడు. కిర్రుమంటూ తెరుచుకుంది. లోపలంతా నిశ్శబ్దంగావుంది. గదంతా చిందరవందరగావుంది. గోడుగునుండి నీరు కారుతూనేవుంది. ఆలోచిస్తూనే ముందుకు నడిచాడు.

సోఫాలో రివాల్వర్ వుంది. ఆలోచిస్తూనే రివాల్వర్ తీసికొని జేబులో పెట్టుకున్నాడు. ఎడమవైపు గదిలోనికి నడిచాడు. టేబులుపైన బ్రీఫ్ కేసుంది. విస్తుపోయాడు. అది తన బ్రీఫ్ కేసు 'అక్కడికెలా వచ్చింది?' అనుకున్నాడు.

ధనలక్ష్మి యితనికి తెలుసా? ఇద్దరు కలిసి ఈ నాటకం ఆడారా? మరి డబ్బులెందుకిచ్చినట్లు? అయోమయంగా వుంది. బ్రీఫ్ కేసులో అన్ని తన బట్టలు, పాకెట్ నోట్స్ వున్నాయి. అది వుంచాలా? తీసుకుపోవాలా? ధనలక్ష్మి బ్రీఫ్ కేసు యిక్కడ పడేస్తే తనకు సమస్యే వుండదు గదా!

అవతల గదిలో అలికిడి అయింది. గబగబ వెళ్ళి చూశాడు. పిల్లి అరుచుకుంటూ పారిపోయింది. వెనుతిరగకుండా ఎదురుగావున్న మరొక గదిలోనికి నడిచాడు.

బెడ్ పై పడుకున్నాడు చక్రవర్తి. "చక్రవర్తి... చక్రవర్తి" పిలిచాడు. సమాధానం రాలేదు. తట్టి పిలిచాడు. ఐస్‌ను తాకినట్లయింది. నిశితంగా చూశాడు చక్రవర్తి చనిపోయివున్నాడు.

గుండాగిపోయినట్లయింది. మెదడు మొద్దుబారిపోయింది.

గబగబ బయటకువచ్చాడు.

ఆతృతగా, కంగారుగా టాక్సి ఎక్కి "పోనివ్వు" అన్నాడు.

టాక్సీ కదిలింది.

చక్రవర్తి ఎలా చచ్చిపోయాడు? ఆత్మహత్యా? లేక హత్యా?

హత్య ఎవరు చేస్తారు. వందల ఆలోచనలతో మెదడు బరువెక్కిపోయింది.

# 13

రాత్రి పన్నెండు గంటలయింది.

మూడుసార్లు మంచినీళ్ళు త్రాగి, ఆరు సిగరెట్లు వెలిగించాడు. మనసు పిచ్చెక్కినట్లుంది. తనకు స్మశానంలో వున్నట్లు అనిపిస్తుంది. ఆ వేదన, ఆందోళన, కంగారులో మతి స్థిరంతప్పిపోతుంది. ఉండివుండి శరీరం వణికిపోతుంది. భయం సుళ్ళుతిరుగుతుంది. మాధవికి చెప్పాలా? వద్దా అన్న సందేహం.

బజర్ మ్రోగింది.

ఉలిక్కిపడ్డాడు. అంతలోనే సమర్థించుకున్నాడు. పోలీసులు యింత తొందరగా ఎందుకొస్తారు? అసలు తనే రిపోర్టు యిచ్చివుండవలసింది. అనుకుంటూనే మెల్లగా వెళ్ళి తలుపులు తెరిచాడు. వాన తుంపరగా పడుతూనే వుంది.

ఎదురుగా చంద్రం. "నువ్వా ఎందుకొచ్చావ్?" కఠినంగా అడిగాడు. ఆలోపు మాలిని, మాధవి, జగన్ వచ్చారు.

"మీ ఇల్లు సోదాచెయ్యాలి" అన్నాడు గంభీరంగా ఇనస్పెక్టర్ చంద్రం.

"వాట్ డు యు మీన్ ఇది జడ్జిజగన్నాథం ఇల్లని తెలీదా?" కఠినంగా అన్నాడు.

"ఐయామ్ సారిసర్. టాక్సీడ్రైవర్ చక్రవర్తిని చంపి

నందుకు మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను'' ఇనస్పెక్టర్ చంద్రం అన్నాడు.

పిడుగుపడ్డట్లయింది. ''చంద్రం ఏమిటి నువ్వనేది మా నాన్న హత్యచేశారా?'' మాలిని అంది.

''అవును. మీ రివాల్వర్ యిస్తారా లేక...'' యిల్లు సోదా చేయమంటారా అనబోయాడు.

''అవసరం లేదు యిస్తాను'' అంటూ విసురుగా లోపలకు వెళ్ళి రివాల్వర్ యిచ్చాడు. ''యు ఆర్ అండర్ అరెస్టు సర్'' అన్నాడు చంద్రం.

''లేదు ఆయన హత్యచేయలేదు. నా భర్త అలాంటి వాడుకాదు చంద్రం,'' అంటూ బావురుమంది మాధవి.

''క్షమించండి. నా డ్యూటీ నేను చేస్తున్నాను'' చంద్రం అన్నాడు. ఆ మాటకు మాలిని శిలయిపోయింది. ''చూడండి, మీ యిల్లు ఒకసారి సోదా చెయ్యాలి'' ఇనస్పెక్టర్ చంద్రం అన్నాడు.

''అలాగే'' మాధవి అంది.

ఇనస్పెక్టర్ లోపలకు నడిచాడు. ప్రతిగది నిశితంగా చూశాడు. ఒక్కొక్క గదిలో ఒక్కొక్క వస్తువును చూశాడు. ఆఫీసురూంలో బ్రీఫ్ కేసు కనిపించింది. అది తీసుకొని వచ్చాడు.

''ఈ కేసు ఎవరిది?''

''మాదే'' అన్నాడు జగన్.

''ఐ. సి. హత్య జరిగిచోట ఒక కేసువుంది. అందులో జడ్జి జగన్నాథంగారి బట్టలు, పుస్తకాలు వున్నాయి. దర్యాప్తులో యిది అవసరం. ఇది ధనలక్ష్మి కేసు.''

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

జడ్జిజగన్నాథం అరష్టయిపోయాడు.

# 14

"జడ్జి చేసిన హత్య:—
ప్రఖ్యాత న్యాయమూర్తి జగన్నాథం, చక్రవర్తి అనే టాక్సిడ్రైవరును హత్యచేశాడు. కేసు విచారణ ప్రారంభ మవుతుంది."

పేపరు చదివి ప్రక్కన పెట్టింది మాలిని. నౌకరు తెచ్చిన కాఫీ తీసుకొని ఆఫీసుగదిలోకి నడిచి కాఫీ మాధవి ముందు పెట్టింది. "కాఫీ తీసుకోమమ్మా" అంది మాలిని. చదువుతున్న పుస్తకంలోనుండి తలెత్తి చూసింది. "ప్రాసిక్యూటర్ గా రాజీనామా యిస్తున్నానమ్మా" అంది మాలిని.

మాధవి ఆశ్చర్యంగా చూసింది. "ఎందుకు?"

"నేను ప్రాసిక్యూటర్ గా నా తండ్రే హత్య చేశా డని గ్రుచ్చి చెప్పాలి. కని పెంచిన తండ్రిని అలా చెప్పటం..." కళ్ళలో నీరు నిండాయి.

"నీవు వృత్తిధర్మం నిర్వర్తించు. కురుక్షేత్రం సంగ్రామంలో తనవాళ్ళను చంపలేనని అర్జునుడు అస్త్ర సన్యాసం చేసినప్పుడు కృష్ణుడేమన్నాడు. 'నీ విధి నీవు నిర్వర్తించు ఫలితం నాకొదిలేయ్" అన్నాడు. అలాగే పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా నీ విధి నీవు నిర్వర్తించు. డాక్ లో నిలబడింది నీ తండ్రి అనే విషయం మరిచిపో. ఒక ముద్దాయిగా ఆలోచించు."

"అది కాదమ్మ."

"చట్టం దృష్టిలో తన, పర భేదంలేదు. న్యాయం దృష్టిలో అందరూ ఒకటే వెళ్ళు. ఒక్కమాట భారత స్త్రీగా నా మాంగల్యం నిలుపుకోవలసిన అవసరం

బాధ్యత నాకుంది. నా భర్త నిర్దోషి అని నాకు తెలుసు. నా నమ్మకాన్ని మానవులు చెరపలేరు.''

''జీనియస్ లాయరును ఎవర్నయినా?''

''మీ నాన్న వాదించుకోలేరా?''

''అరెస్టయిన ముద్దాయి వాదించుకోవటం కష్టంగదా!''

''అవును. ఆ విషయం నేను ఆలోచిస్తాను. నేను చేసిన పూజలు ఫలిస్తే నా భర్త నిర్దోషి అవుతాడు.'' మాధవి కళ్ళలో నీరు నిండాయి. మాలిని వెళ్ళిపోయింది. బయట కారాగిన శబ్దం.

ఇనస్పెక్టర్ చంద్రం వచ్చాడు. ''క్షమించండి'' అన్నాడు వినయంగా.

''నిన్ను క్షమించవలసింది నేను కాదు.''

''అదేమిటండి?''

''చంద్రం ఈ విచారణ పూర్తి అయ్యేవరకు నీవు యిక్కడకు రావటం మంచిదికాదు. ముద్దాయి యింటికి వేరే కారణాల్ని క్రోడీకరించుకొని మామూలు మనిషిగా రావటం నేను అంగీకరించను వెళ్ళిరా'' అంది మాధవి.

# 15

కోర్టు యావత్తు కోలాహలంగావుంది.

పత్రికా విలేకర్లతో, ఫోటోగ్రాఫర్లతో, యితర లాయర్లతో కోర్టు నిండుగావుంది. ప్రాసిక్యూటర్ మాధవి కేసు రిఫర్ చేస్తుంది.

ముద్దాయిగా జగన్నాధాన్ని డాక్‌లో నిలబెట్టారు.

ప్రేక్షకులలో గుసగుసలు వినిపించసాగాయి. విధి ఎంత విచిత్రమయింది. అదే కోర్టులో తీర్పు చెప్పిన జస్టిస్ జగన్నాధం, తీర్పుకోరకు కోర్టులో నిలబడ్డాడు అనుకున్నారు.

ఒక ప్రక్క లాయరు మాధవి.

గడియారం పది గంటలు కొట్టింది.

న్యాయమూర్తి రాకను సూచించాడు కోర్టుగుమాస్తా. కోర్టుయావత్తు నిశ్శబ్దమయింది. సీలింగ్ ఫాన్ శబ్దం తప్ప మరేమి వినిపించటంలేదు. న్యాయమూర్తి న్యాయ సింహాసనం అధిష్టించాడు.

"జూలై 6 వ తేదీన, జరిగిన టాక్సిడ్రైవర్ చక్రవర్తి హత్యకేసు. ముద్దాయి జగన్నాధం విచారణ ప్రారంభం" గుమస్తా సూచించాడు. డాక్యుమెంట్స్ జడ్జిముందు వుంచారు.

ప్రాసిక్యూటర్ మాలిని తండ్రివైపు చూసింది. కళ్ళు చెమ్మగిల్లాయి. అయినా గొంతు సవరించుకొని చెప్పటం ప్రారంభించింది.

"మిలార్డ్! ది జంటిల్ మన్ అఫ్ ద జ్యూరి!! యీ డాక్ లో మీ ముందు నిలబడ్డ ముద్దాయి ఒకప్పుడు జస్టిస్ జగన్నాధం. నలుగురిలో పరువు ప్రతిష్టగల యీ మనిషి ఒక దొంగతనం, అది కప్పిపుచ్చుకో నేటందుకు ఒక భయంకరమయిన హత్య చేశాడు.

కొన్నాళ్ళ క్రితం అంటే కొన్ని రోజులక్రితం జూన్ 13 తేదీన ముద్దాయి జగన్నాధానికి రఘుపతి యాభైవేల రూపాయలు యిచ్చి దేవేంద్రనాథ్ కు యివ్వమన్నాడు. ఆ రోజు ఆ డబ్బు యివ్వలేదు. ఎందువల్ల యివ్వలేదు?

ఒక మనిషికి దురవాట్లు వుంటే వేలకువేలు మంచి నీళ్ళుగా కరిగిపోతాయి. అలాంటి దురవాట్లలో జగన్నాధానికి ఒక వుంపుడుగత్తెవుంది. తన ఆస్తి అంతా ఆమెకు ధారాదత్తంచేసినట్లు ఈ డబ్బు ఆమెకు యిచ్చి

ఆ యాభైవేలు పూడ్చటానికి రైలులో దొంగతనం చేశాడు.

"మిలార్డ్! రైలులో ఏం జరిగింది. ధనలక్ష్మి అనే యువతి రెండులక్షల ఖరీదు చేసే డబ్బు, నగలతో బయలు దేరింది. రెండులక్షలు ఖరీదుచేసే ఆ బ్రీఫ్ కేసులాంటి ఒక బ్రీఫ్ కేసు తన దగ్గరవుంది. బ్రీఫ్ కేసులు తారుమారు చేసి చాకచక్యంగా రెండులక్షలు కాజేశాడు. యీ విషయం పేపరులో ప్రకటించబడింది.

"అయినా ముద్దాయి చలించలేదు. అతను నీతివంతు డయితే, న్యాయమూర్తి అయినట్లయితే ఆ డబ్బు తిరిగి యిచ్చేవాడు. అలా యివ్వకపోగా అది తన స్వార్థానికి వినియోగించుకున్నాడు.

"యీ రహస్యం చక్రవర్తికి తెలుసు. ఎలా అంటే? చక్రవర్తి దగ్గర ధనలక్ష్మికి సంబంధించిన కార్డు వుంది. బ్రీఫ్ కేసునుండి ఆ కార్డు తెంపి, పేపరులో వార్త చూసి చక్రవర్తి బ్లాక్ మెయిల్ చేయడానికి పూనుకున్నాడు. జగన్నాథం ఎంత డబ్బు యిచ్చాడన్నది తెలియని విషయం.

"చక్రవర్తి ప్రవర్తనతో విసిగిపోయాడు జగన్నాథం. అతన్ని ఏ విధంగానయినా చంపాలని తీర్మానించు కున్నాడు. చక్రవర్తిని తృప్తిపరచటం తనవల్ల అయ్యే పని కాదు కాబట్టి, చక్రవర్తి పోలీసు రిపోర్టు ఇచ్చినా తనకే నష్టం అని చక్రవర్తిని చంపటానికి రివాల్వర్ తీసుకుని వెళ్ళాడు.

"మిలార్డ్ జూలై 6వ తేదీ రాత్రి తొమ్మిదిగంటల సమయంలో చక్రవర్తికి తనకి వాగ్వాదం జరిగింది. యిద్దరు

కలియబడ్డారు. అదే సమయంలో రివాల్వర్‌తో కాల్చి చంపాడు ముద్దాయి జగన్నాధం.

"చక్రవర్తిని హత్యచేయటానికి ముద్దాయి జగన్నాధానికి తగిన కారణం వుంది. హత్యకు పూర్వం జరిగిన సంఘటనల దృష్ట్యా ఆలోచిస్తే జగన్నాధం చంపాడని రూఢి చేసుకోవచ్చు. హత్యకు ముందు, హత్య జరిగిన తరువాత ఏఒక్కరూ చక్రవర్తి యింట్లోకి వెళ్ళలేదు అని, ముద్దాయి ఒక్కడే చక్రవర్తి బ్రతికి వుండగా, చనిపోయాక చూసినవాడని యీ హత్య జగన్నాధం చేశాడని ప్రాసిక్యూషన్ చెపుతుంది. కోర్టువారు అనుమతిస్తే యీ విచారణకు అవసరమయిన సాక్షులు, రుజువులు ప్రాసిక్యూషన్ ప్రవేశపెడుతుంది." అంది ప్రాసిక్యూటర్ మాలిని.

"జగన్నాధం నీ తరుపున లాయరెవరు?" జడ్జి ప్రశ్న.

"ఐ మె బి పర్మిటెడ్ టు డిఫెండ్ ది ఎక్యూస్డ్ మిలాడ్" అంది జస్టిస్ జగన్నాధం భార్య మాధవి.

కోర్టు యావత్తు విస్తుపోయాయి. భర్త తరపున వాదించటం లక్షల కేసుల్లో ఒకటి కావచ్చు. అంతకంటె తల్లి, కూతుళ్ళ వాగ్వాదం మరీ విచిత్రంగా వుంది.

జగన్నాధం తలెత్తి కూతురువైపు భార్యవైపు, చూశాడు. యింకో సమయంలో అయితే ఎంతో సంతోషించేవాడు. కాని యిప్పుడు తన స్థితి వేరు.

"ప్రాసిక్యూటర్ గారు కేసు ప్రారంభించవచ్చు." అన్నాడు జడ్జి.

మాలిని గొంతు సవరించుకొని, "ప్రాసిక్యూషన్ మొదటి సాక్షిగా యీ కేసు దర్యాప్తు చేసిన ఇన్‌స్పెక్టర్ అంద్రాన్ని కోర్టువారు అనుమతితో పిలుస్తున్నాను" చంది.

ఇనస్పెక్టర్ చంద్రం విట్నెస్ బాక్స్‌లో ఎక్కి ప్రమాణం స్వీకరించి వుద్యోగర్హతల్ని తెలియపరచి డైరీ తీశాడు.

"జూలై 6వ తేదీన సెంటిపీటర్స్ చర్చి దగ్గర చక్రవర్తి అనే వ్యక్తి హత్య చేయబడ్డాడని ఫోను రావటంతో హుటాహుటిగా అక్కడకు వెళ్ళాను."

"యీ విషయం మీకెలా తెలిసింది?"

"ఒక మగమనిషి ఫోన్ చేశారని కంట్రోల్ స్టేషన్ కానిస్టేబుల్ చెప్పాడు. ఆ తరువాత హత్య జరిగినచోటుకు వెళ్ళాను. ఒక జత అడుగులు అన్ని గదులలోనికి నడిచినట్లున్నాయి. హత్యముందు వర్షం కురిసివుండటంవల్ల యీ అడుగు జాడలు కనిపించాయి."

"మరెవరు ఆ స్థలంలోనికి వెళ్ళలేదు అన్నమాట."

లేదన్నట్లు చెప్పాడు ఇనస్పెక్టర్.

"అని ఎలా నిర్ధారణగా చెప్పగలరు?"

"సాయంకాలం ఆరుగంటలనుండి వర్షం ఏకధాటిగా కురుస్తుంది. డాక్టర్ రిపోర్టు ప్రకారం హత్య ఎనిమిదిన్నర, తొమ్మిదిన్నర మధ్య జరిగివుండాలని తేలింది. ఆ తరువాత ఫోటోగ్రాఫర్ల సహాయంతో ఫోటోలు తీయించాను. పాథాలజిష్టు వేలిముద్రలు తీశాడు. హతుడు రివాల్వర్ అంటే వెబ్‌స్టర్ .48 రివాల్వర్ బుల్లెట్ వల్ల చనిపోయాడని, అది రైట్ వెంట్రికల్ ఆఫ్ ద హార్ట్‌లో దూసుకుపోవటంవల్ల మరణించాడు. స్టెయినింగ్ గుర్తులను బట్టి అప్పటికి గంట, గంటన్నరలోపు కాలంలో ప్రాణం పోయివుండాలన్నారు డాక్టర్."

"అది ఎక్సిబిట్ చేశారా?"

"ఎక్సిబిట్ 'ఏ'గా రివాల్వర్ బుల్లెట్, ఎక్సిబిట్ 'బి'గా జస్టిస్ జగన్నాథం దగ్గర వున్న రివాల్వర్ ఎక్సిబిట్ చేయటం జరిగింది."

"అది జడ్జి రివాల్వర్ అని ఎలా నిర్ణయించారు?"

"ఆయనే ముద్దాయిగా నిర్ణయించలేదు. కాని ఆ గదిలో ఒక బ్రీఫ్ కేసు వుంది. అందులో డ్రెస్, డాక్యుమెంట్స్‌ను బట్టి జస్టిస్ చక్రవర్తికి సంబంధం వుందనుకున్నాం."

"అనుమానించటానికి యిదొక్కటే కారణమా?"

"కాదు. యీ నగరంలో .48 వెబ్‌స్టర్ రివాల్వర్లు పన్నెండుగురికి వున్నాయి. వాటిలో జస్టిస్ జగన్నాథం ఒకరు. ఆయన రివాల్వర్ చూశాక అందులో ఒక బుల్లెట్ లేకపోవటం, రివాల్వర్ బేరల్ గుండు పేల్చటంవల్ల వచ్చే వాసనను బట్టి జస్టిస్ జగన్నాథం అది వినియోగించి వుండాలనుకున్నాం."

"బ్రీఫ్ కేసు ఆయన అక్కడ వదిలివేశాడా?"

"అవును. అది ఎక్సిబిట్ 'సి'గా ప్రవేశపెట్టాం."

"ధనలక్ష్మి రెండులక్షలగురించి మీ అభిప్రాయం."

"సాక్ష్యాన్నిబట్టి ధనలక్ష్మి, జగన్నాథం ఒకే కంపార్టుమెంట్‌లో ప్రయాణం చేయటం బ్రీఫ్ కేసు మార్చటం రెండులక్షలు తస్కరించటం జరిగింది."

"అది ఎలా నిర్ణయించారు."

"ధనలక్ష్మి బ్రీఫ్ కేసు జగన్నాథం యింట్లోనేవుంది."

"అది కాక మరేమయినా చెప్పగలరా?"

"రఘుపతి యిచ్చిన యాభై వేలు ఆ రోజు కట్టకుండా మూడవరోజు కట్టాడు. అది రఘుపతి యిచ్చిన కరెన్సీ

కాదు వేరే కరెన్సీ."

"ధనలక్ష్మి బ్రీఫ్ కేసు, ఆమె అడ్రసుకార్డు ఎక్సిబిట్ చేశారా?"

"ఎక్సిబిట్ 'డి'గా ఎక్సిబిట్ చేశాను. వాటిపై గుర్తులు పెట్టాను."

"అతని వ్యక్తిత్వం గురించి మీ దర్యాప్తులో తెలిసిందేమిటి?"

"అతనికి అనసూయ అనే స్త్రీతో అక్రమ సంబంధం వుందని, అనసూయను అడగటంతో నిజమేనని ఆమె అంగీకరించింది."

"క్రాస్ చేసుకోవచ్చు." మాలిని, తల్లివైపు చూసింది. మాధవి మెల్లగా లేచి ఇనస్పెక్టర్ దగ్గరకు నడిచింది. "ఆరుగంటలనుండి వర్షం కురవటంవల్ల బయటనుండి ఎవరు లోపలకు వెళ్ళినా తెలుస్తుంది."

"అవును."

"మధ్యాహ్నంపన్నెండుగంటలకే ఎవరయినాలోపలకు వెళ్ళారనుకోండి, వర్షం కురుస్తుండగా వచ్చినా అడుగులు పడవుగదా!"

"పడవు." ఇనస్పెక్టర్ అన్నాడు.

"హత్య ఎక్కడ జరిగింది?"

"హాలు మధ్యలో."

"శవం ఎక్కడుంది?"

"బెడ్ పైన."

"అక్కడకు నడిచివెళ్ళిందంటారా?"

"అబ్బె కాదండి శవాన్ని ముద్దాయి తీసుకువెళ్ళి బెడ్ పై పడుకోబెట్టాడు" ఇనస్పెక్టర్ అన్నాడు.

"గుడ్. ఆ అవసరం ముద్దాయికి ఏమిటో ఆలోచించి చెప్పగలరా?"

"ఎవరయినా చూస్తారేమో అని అలా చేసివుండవచ్చు."

మాధవి నవ్వింది. "రివాల్వర్‌తో కాల్చినప్పుడు అంత శబ్దం వచ్చినప్పుడు ఎవరూ చూడలేదు. కాని యింటి మధ్యలో శవాన్ని ఎవరయినా చూస్తారని బెడ్ పై వేశాడు. అయినా ఎవరో చూసి మీకు రిపోర్టు యిచ్చారు."

"అబ్జక్షన్ మిలాడ్! అక్కడ ఏం జరిగిందో ఎలా జరిగిందో సాక్షికి తెలియవలసిన అవసరం లేదు."

"నో మిలాడ్. ఎలా జరిగినా ఇన్వెస్టిగేషన్ ఆఫీసరుగా వూహ అవసరం ఏమిటి అన్నది ప్రశ్న."

"అభ్యంతరం అంగీకరిస్తున్నాం." మాలిని కూర్చుంది.

మాధవి గొంతు సంవరించుకొని "జస్టిస్ జగన్నాథం బ్రీఫ్ కేసుతో చక్రవర్తి దగ్గరకు వచ్చాడా? లేక బ్రీఫ్ కేసు లేకుండా వచ్చాడా?"

"బ్రీఫ్ కేసుతో వచ్చి అక్కడ మరచిపోయివుండాలి."

"బ్రీఫ్ కేసులు మార్చి దొంగతనం చేశాడంటున్నారు."

"అంటే చక్రవర్తి దగ్గర నుండి తీసుకొనివుండాలి."

"చక్రవర్తికి బ్రీఫ్ కేసు ఎలా వచ్చింది?"

"చక్రవర్తి, ధనలక్ష్మితో పరిచయం పెట్టుకొని వుండాలి."

"గుడ్ అసలు ధనలక్ష్మి ఎవరు? ఎక్కడవుంది?"

"తెలీదు."

"అంటే దర్యాప్తు చేయలేదా."

"చేశాము. పోలీస్ రిపోర్టు యిచ్చిన ఆమె ఆ అడ్రసు దగ్గర లేదు."

మాధవి జడ్జివైపు తిరిగి "మిలార్డ్! యీ సాక్షిని కొంత విచారణ తరువాత ప్రవేశ పెట్టవలసినదిగా కోరుతున్నాము" అంది.

మాలిని లేచి "నో మిలార్డ్ తగిన కారణం లేకుండా ఒక సాక్షిని రెండుసార్లు ప్రవేశ పెట్టడం జరగదు."

మాధవి నవ్వింది. "మిలార్డ్! ఇనస్పెక్టర్ చంద్రం కొన్ని విషయాలు స్థూలంగా పరిశీలించలేదు. ఒక మనిషి రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో ఫోన్ చేశాడు. అత నెవరు? అతనికి ఎలా తెలిసింది? హత్య ఎలా చూశాడు? పోతే ధనలక్ష్మి ఎవరు? అసలు డబ్బు, నగలు రెండు లక్షలు పోయాయా? కేవలం రిపోర్టు యిచ్చి మౌనంగా వూరుకుంది. దానిగురించి దర్యాప్తు చేయమని ఎవరిని కోర లేదు. అంటే పోయినవి రెండులక్షలా? రెండు వేలా? వాటిని ముద్దాయి ఎక్కడ అమ్మాడు? ఈ వివరాలు సేక రించలేదు.

ఇకపోతే చక్రవర్తికి, ధనలక్ష్మికి సంబంధం ఏమిటి? హత్య జరిగినచోటునుండి శవం ఎందుకు మార్చబడింది? యివన్నీ అనుమానాలే కదా!"

జడ్జి నవ్వాడు "యు ఆర్ రైట్. కొంత విచారణ అనంతరం యీ సాక్షిని ప్రవేశ పెడతాం" అన్నాడు.

మాలిని మాట్లాడలేదు.

ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా గవర్నమెంట్ సర్జన్ విట్నెస్ బాక్స్‌లో నిలబడి ప్రమాణంచేసి పుర్వో గార్హతల్ని తెలియచేశాడు. "జూలై 6వ తేదీన చక్రవర్తి

హత్యగురించి మీకు గుర్తుంది కదూ!''

"ఉంది. ఆరోజు రాత్రి పదిన్నర గంటల ప్రాంతంలో ఇనస్పెక్టర్ చంద్రం సెంట్ పీటర్స్ చర్చి వెనుకకు రమ్మని ఫోన్ చేశారు. అక్కడకు వెళ్ళాను. ఆ యింటి బెడ్ రూంలో శవంవుంది. ఆవ్యక్తి పిస్తోలుతో చంప బడ్డాడు. బుల్లెట్ రైట్ వెంట్రికల్ ఆఫ్ ద హార్ట్‌లో నుండి దూసుకుపోవటంవల్ల రక్తం ఎక్కువగానే కారింది. అదే రక్తం హాలులో ఒకచోట అరచేతి వెడల్పున కారి వుంది.''

"ఆ శవాన్ని పోష్టుమార్టం చేశారు?''

"చేశాను. శవం గుండెలో పిస్తోలుగుండు వుంది.''

"అది యిదేనా?'' ఎక్సిబిట్ 'ఎ'గా చూపిన బుల్లెట్ చూపించాడు.

"ఇదే దీనిపై మార్కు చేశాను.''

"హత్య ఎప్పుడు జరిగింది చెప్పగలరా?.'

"8-30కీ, 9-30కి మధ్య జరిగివుండాలి.''

"ఎలా నిర్ణయించారు?''

"శవం యొక్క స్టెయినింగ్‌నుబట్టి, రిగర్ మార్టిస్ గుర్తుల్నిబట్టి చెప్పగలను'' డాక్టర్ అన్నాడు.

"హంతకుడు గురి తెలిసినవాడయివుండాలంటూరా?''

"అవసరంలేదు. బుల్లెట్ చాలా దగ్గరనుండి కాల్చ బడింది.''

"తరువాత శవంవున్న చోట హత్య జరిగిందా, లేక శవాన్ని మార్చటం జరిగిందంటూరా?'' పి. పి. మాలిని ప్రశ్న.

"హాలుమధ్యలో రక్తం వుండటంవల్ల అది, హంతుడు

'బి' గ్రూపుకు చెందినది కావటంవల్ల కొంత అనుమానించ వచ్చు. పోతే బుల్లెట్ రంధ్రం, పైన షర్టు గుడ్డకయిన రంధ్రం పడుున్న శవానికి ఒకేలా లేవు. షర్టు రంధ్రం బుల్లెట్ రంధ్రానికి మూడు అంగుళాలు పైకి జరిగింది కాబట్టి శవాన్ని లాక్కొచ్చి బెడ్ పై వేశారని అనుమా నించవచ్చు."

"క్రాస్ ఎగ్జామినేషన్ చేయవచ్చు" అంది పి. పి.

లాయరు మాధవి లేచి నుంచుంది. కోర్టులో ఒక విధ మయిన సంచలనం చెలరేగింది. "శవం హాలులోనుండి బెడ్ రూంలోకి లాక్కొచ్చి వేశారన్నారు" అంది మాధవి.

"అవును."

"అయితే ముద్దాయి అడుగులు కొన్ని చెడిపోయి వుండాలి."

"అవును శవాన్ని ఎటుతిప్పినా రక్తం కారివుండేది దారిలో అయివుండేది. శవాన్ని వెల్లకిలావుంచే చేతులు క్రింద చేతులు వేసి లాక్కొచ్చివుండాలి. అలాంటప్పుడు ముందు నడిచినవ్యక్తి పాదముద్రలు చెడిపోయే అవకాశం వుంది."

"శవానికి గాయాలుగాని కలయబడ్డట్టు సూచన లున్నాయా?"

"ఉన్నాయి. నలిగిన పాంటుగాక, కొత్త చొక్కా మెడ భాగంలో ఎవరో బలవంతంగా చింపటంతో చిరిగింది కాబట్టి వీపుభాగంలో కమిలిన దెబ్బను బట్టి కలబడివుండాలి."

"హంతుడు పడుకొనివుండగా రివాల్వర్ పేలిందా?

నిల్చునివుండగా పేలిందా?'' మాధవి అడిగింది.

''పడుకొనివుండగా పేలింది. ఏమంటే రక్తం క్రిందకు కారలేదు ప్రక్కకు కారింది కాబట్టి, పడుకొనివుండగా హత్య జరిగింది.''

''హతుడితో కలియబడటానికి ముద్దాయి బలవంతుడయి వుండాలా?'' అడిగింది.

''కలియబడటానికి బలవంతుడయివుండాలి. కాని, రివాల్వర్ పేల్చడానికి బలవంతుడుకానవసరం లేదు'' డాక్టర్ అన్నాడు.

''థాంక్స్ డాక్టర్'' అంది మాధవి.

కేసు మరునాటికి వాయిదా వేయబడింది.

# 16

మాధవి, జస్టిస్ జగన్నాథం గదిలో కూర్చుని కేసు స్టడీచేస్తుంది. బయట కిటికిలోనుండి కొబ్బరిఆకుల మధ్య వెన్నెల కనిపిస్తుంది. కళ్ళు తీక్షణంగావున్నాయి. ముఖం గంభీరంగా వుంది. దిక్కుతోచనట్లు అయోమయమయిన ఆలోచనలు.

''సిస్టర్'' అంటూ జగన్ గదిలోనికి వచ్చాడు. తల తిప్పి ఏమిటన్నట్లు చూసింది. ''నీకోసం ఎవరో వచ్చారు'' అన్నాడు.

''రమ్మను'' అంది మాధవి. అతను లోపలికి వచ్చాడు.

ట్వీడ్ సూటులో ఎర్రగా, అందంగా, హుందాగా వున్నాడు. వయసు ముప్పైవుంటుంది. నవ్వుతూవుండే పెదవులు, నిశితమయిన చూపులు, సన్నని మీసకట్టు ''నమస్తే'' అన్నాడు.

''నమస్తే కూర్చోండి. మీరు జడ్జిగారికోసం వచ్చారా?''

"అవునండి పేపరులో చూశాను." అంటూండగానే జగన్ వెళ్ళిపోయాడు.

"క్షమించండి. మీకోసం నేను రావలసింది" అంది మాధవి.

"చెప్పండి. మీకు కాలం తక్కువ. రాకపోకలకి కాలం ఖర్చు చేస్తే ఎలా? యింతకీ విషయం ఏమిటి?"

"మా తమ్ముడు వున్నాడని అలా అన్నాను."

"నాకు తెలుసు. మీరు అలా అనలేదనుకోండి. నేను డిటెక్టివ్‌నని ఆయనకు తెలిసిపోతుంది. కమ్‌టుది పాయింట్. ఈ విషయంలో నా సహాయం ఏం కావాలి? అంటూ సోఫాలో వెనక్కు వాలి కూర్చున్నాడు ప్రఖ్యాత డిటెక్టివ్ చక్రధర్.

"ఈ కేసులో కనిపించని యిద్దర్నీ, కనిపించే యిద్దర్ని అనుమానించాల్సివుంటుంది. మొదట మా జగన్, రెండు రఘుపతి. కనిపించని యిద్దరు పరమేశం, రెండు ధనలక్ష్మి వీరితో చక్రవర్తికి సంబంధం వుండివుండాలి."

"వీళ్ళ నలుగురూ ఎవరు?"

వివరించి చెప్పింది మాధవి.

"యీ కేసుగురించి చదివినా, కేసులో సాక్ష్యాల్ని బట్టి చూసినా ఒక విషయానికి, మరొక విషయానికి ఏదో సంబంధం వుండివుండాలనిపిస్తుంది" అన్నాడు చక్రధర్.

"నాకూ అదే అనుమానం. కోర్టులో ఎంత వాదించినా నేల విడిచి సాము చెయ్యాం అవుతుంది."

"సరే మీ కార్యక్రమం మీరు కానివ్వండి. నేను ఒక సారి జస్టిస్ జగన్నాథంగారితో మాట్లాడి నా దర్యాప్తు నేను చేస్తాను."

"చక్రధర్ నా భర్త నిర్దోషి. నీ శాయశక్తులా ప్రయత్నించు" కళ్ళు చెమ్మగిల్లాయి.

"మీరేం బాధపడకండి. ఈ కేసులో విజయం మనదే" హుషారుగా కదిలాడు చక్రధర్.

మాధవి విస్తుపోయింది.

# 17

"మిలాడ్ ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా అనసూయను కోర్టువారి అనుమతితో పిలుస్తున్నాను." అంది మాలిని.

అనసూయ విట్నెస్ బాక్స్‌లోనికి ఎక్కి ప్రమాణం స్వీకరించింది.

"చూడండి, జగన్నాథంతో మీకు అక్రమ సంబంధం వుంది కదూ!" మాలిని అడిగింది.

కోర్టు యావత్తు గుసగుసలు చెలరేగాయి, "వుంది" అంది తలవంచి అనసూయ.

"మీకు జగన్నాథం చాలాసార్లు డబ్బు ఎక్కువగా యిచ్చేవాడు కదూ!"

"లేదు."

"అబద్ధం, మిలాడ్ యీమె ఒక వేశ్య..."

"అబ్జక్షన్ మిలాడ్! మై లెర్నెడ్ ఫ్రెండ్ ప్రాసిక్యూటర్ మాలినిగారు అనసూయను వేశ్య అని సంబోధించటం సహించదగ్గ విషయం కాదు. ఏమంటే ఆమె వేశ్య అని రుజావుచేయటానికి తగిన కారణాలు చూపాలి. కారణం లేకుండా సాటి స్త్రీని వేశ్య అనటం సమంజసం కాదు."

"నో మిలాడ్! ఒక వ్యక్తికి భార్య వుండగా ఆ

వ్యక్తితో సంబంధం పెట్టుకున్న యువతిని ఏమనాలి?”

జడ్జికి ఏమనలో తోచలేదు. మాధవి గంభీరంగా అనసూయ ముఖంలోనికి చూసింది. “మిలార్డ్ సమయం వచ్చింది కాబట్టి వివరించక తప్పదు. అనసూయ అనబడే యీ స్త్రీ జస్టిస్ జగన్నాథం మొదటి భార్య.”

కోర్టులో బౌంబు పేలినట్లుంది. అందరి కళ్ళు అనసూయను జగన్నాథాన్ని చూశాయి.

“జస్టిస్ జగన్నాథం పెళ్ళి ఒక గుళ్ళో జరిగింది. ఆ తరువాత ఆమె ఏమయిందన్నది ప్రశ్న కాదు. ఏడేళ్ళు కనిపించని యీమె చనిపోయిందని ‘ప్రిజమ్షన్ ఆఫ్ డెత్ సర్టిఫికెట్’ తీసుకొని ఆయనకు స్నేహితురాలిగా వున్న మాధవి అనే నన్ను పెళ్ళి చేసుకున్నారు.” ఖండితంగా అంది మాధవి.

“అభ్యంతరం అంగీకరిస్తున్నాను.”

మాధవి మౌనంగా కూర్చుంది.

మాలినికి ఏమడగలో తోచలేదు.

“క్రాసు చేసుకోవచ్చు” అంది.

మాధవి చటుక్కున లేచి “నో క్వచన్” అంది.

ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా రఘుపతి విట్నెస్ బాక్స్‌లో ఎక్కాడు. ప్రమాణం చేశాడు. “చూడండి మీరు యాభైవేలు, దేవేంద్రనాథ్‌కు యివ్వమని యిచ్చారు కదూ!”

“అవును.”

“ఆక్షోజే డబ్బు కట్టాడా?”

“లేదు మూడో రోజు కట్టటం జరిగింది.”

“క్రాస్ చేసుకోవచ్చు” అంది.

మాధవి, రఘుపతి ముఖంలోనికి చూసింది. "చూడండి మీరు యాభైవేలు జగన్నాథం గారికి యిచ్చారు కదూ!"

"అవును."

"యివ్వ లేదంటాను."

"అబద్ధం యిచ్చానండి భగవంతుడు సాక్షి."

"మీరు యాభైవేలు యిచ్చినట్లు సాక్ష్యం ఏమన్నా వుందా?"

"లేదండి."

"అంటే జగన్నాథంగారిపై మీకంత నమ్మకం వుందన్నమాట."

"అవునండి" అన్నాడు రఘుపతి "అంటే నీవు నాకు డబ్బు యివ్వలేదని ఆయన ఒక్క మాటంటే మీరేం చేయలేరు."

"అవునండి."

"దట్సాల్ మిలాడ్."

ప్రాసిక్యూటర్ "తరువాత సాక్షిగా జగన్నాథం గారి భార్యను కోర్టువారి అనుమతితో పిలుస్తున్నానంది."

మాధవి నల్లగౌనుతీసి చైర్ పైన వేసి విట్నెస్ బాక్స్‌లో నిలబడింది. ప్రమాణం చేశాక మాలిని, మాధవి దగ్గరకు వచ్చింది.

"చూడండి మీభర్త యాభైవేలు పోగొట్టానన్నారు. మీరు నమ్మారా?"

"భారతదేశంలో ఆదర్శ స్త్రీ కొంతకాలం కాపురం చేశాక భర్త మనస్తత్వం తెలుసుకుంటుంది కాబట్టి నేను నమ్మాను."

"ఆ డబ్బుకోరకు మద్రాసు వెళ్ళారా."

"అవును."

"డబ్బు తెచ్చారా."

"అవును."

"ఎక్కడదని మీరడగలేదు?"

"ఎవరో అనామకురాలు బ్రీఫ్ కేసు వదిలి తన కేసు తీసుకు వెళ్ళిందన్నారు. ఆ బ్రీఫ్ కేసులో డబ్బు అవసరానికి వినియోగించాం. ఆమె వివరాలు తెలిస్తే యివ్వాలనుకున్నాం."

"ఆ డబ్బెంత?"

"రెండు వేలు." మాధవి అంది.

"కాదు రెండు లక్షలు."

"మీరు చూశారా?" సూటిగా అడిగింది మాధవి.

మాలిని వెంటనే "నేను చూడవలసిన అవసరంలేదు."

"చూడండి. రెండు లక్షలు పోయిన మనిషి ఎలా వుంటుంది? పోలీస్ డిపార్టుమెంట్ను ఎలా వత్తిడి చేస్తుందో వూహించవచ్చు. పేపరులో ప్రకటించిన ఆమె ఏమయిందో తెలియనపుడు పోయినవి రెండులక్షలవుచ్చు, రెండు వేలవచ్చు."

"చక్రవర్తి బ్లాక్ మెయిల్ చేస్తున్నాడని మీకు తెలుసా?"

"తెలుసు."

"హత్యజరిగిన రాత్రి అంటె జూలై 6వ తేది రాత్రి మీ భర్త ఎన్నిగంటలకు బైటకు వెళ్ళారు."

"ఎనిమిది గంటల ప్రాంతం."

"క్రాసు చేసుకోవచ్చు." అంది మాలిని. మాధవి నవ్వింది. "నో క్వశ్చన్" అంది విట్నెస్ బాక్స్లోనుండి దిగివస్తూ.

ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా టాక్సీ డ్రైవర్ శ్రీపతి విట్నెస్ బాక్స్‌లోకెక్కి ప్రమాణం స్వీకరించాడు.

"నీ పేరు?" మాలిని ప్రశ్న.

"శ్రీపతండి." అన్నాడు శ్రీపతి.

"జూలై 6వ తేది రాత్రి ఒక వ్యక్తి నీ టాక్సీలో సెంట్ పీటర్స్ చర్చి కెళ్లాడు కదూ!"

"అవునండి."

"అతను యీ కోర్టులో వున్నాడా?"

"అయ నేనండి" అంటూ జగన్నాథాన్ని చూపించాడు.

"తిరిగి ఎంత సేపట్లో వచ్చాడు," మాలిని అడిగింది.

"పది నిమిషాల్లో వచ్చారండి."

"అప్పుడా మనిషి ఎలా వున్నాడండి?"

"కంగారుగా భయంగా వున్నాడండి."

"క్రాస్ చేసుకోవచ్చు." అంది పి. పి. మాలిని.

మాధవి అతని ముఖంలోనికి చూసి "చూడు శ్రీపతి, జగన్నాథం వెళ్ళేటప్పుడు గాని, తిరిగి వచ్చేటప్పుడుగాని చేతిలో ఏమయినా వుందా?"

"గొడుగు తప్ప మరేం లేదండి."

"మీరు ఆగినచోటు లైటు క్రింద కదూ!"

"కాదండి. ఆ ప్రాంతంలో లైటు లేదు."

"అయితే ఆ మనిషి కంగారు, భయం నీ కెలా తెలిసింది?" అడిగింది. శ్రీపతి గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది "తెలీదండి."

"నో క్వశ్చన్ మిలార్డ్" అంది మాధవి.

జడ్జి టైము చూసి "యింకా ఐదు నిమిషాలే వ్యవధి వుండటంచేత ఈ కేసు విచారణ వాయిదా వేస్తున్నాను" అన్నాడు.

# 18

డిటెక్టివ్ చక్రధర్ బయలుదేరాడు.

రఘుపతి యింటికి కొద్ది దూరంలో మేకప్ మార్చుకుని కూర్చున్నాడు. ఆ సమయంలో మాధవి అయినా సరే అతను చక్రధర్ అని అనుమానించటానికి అవకాశం లేదు.

రాత్రి తొమ్మిది గంటలయింది.

వీధి రెండువైపుల చూశాడు.

తన నెవరూ గమనించటం లేదు. చటుక్కున గోడ దూకి లోపల ప్రవేశించాడు. ఆ యింటి చుట్టూ చెట్లు వుండటంచేత వెలుగుతున్న ఒక్క లైటు సరిగా కనిపించటం లేదు. చెట్ల చాటుగా ఆ మేడ వెనుక భాగంలోనికి వెళ్లాడు.

వెనుక రేకుల షెడ్ వుంది. అది కారు షెడ్ కాదు. మనుషులు వుంటున్న యిల్లు. అందులో తోటమాలి కేశవులున్న సంగతి చక్రధర్‌కి తెలుసు. నక్కుతూ కిటికీ దగ్గరకు నడిచాడు. లోపలనుండి మాటలేవో వినిపిస్తున్నాయి.

జేబులోనుండి రివాల్వర్ తీసి తలుపు తట్టాడు.
తోటమాలి కేశవులు తలుపు తెరిచాడు.

గబాలున లోపల ప్రవేశించి తలుపు బిగించాడు చక్రధర్.

"ఎవరు?" కంగారుగా అన్నాడు కేశవులు. "అరవక నాకోసం పోలీసులు తిరుగుతున్నారు." అంటూ రివాల్వర్ చూపాడు. లోపలవున్న కేశవులు భార్య, కేశవులు బిగుసుకు పోయారు. కొంత సైకాలజీ అర్థమయింది డిటెక్టివ్ చక్రధర్‌కి.

"చూడు కేశవులు. రఘుపతిగారు వూళ్ళోలేరా?"

తెలిసినట్లు అడిగాడు.

కేశవులు భయంగా చూసి "లేరండి" అన్నాడు.

"అయ్యో నీవు అరష్టయి పోతావే."

కేశవులు వణకిపోయాడు "ఎందుకండి?"

"ఆరోజు జగన్నాధంకి బ్రీఫ్ కేసులో డబ్బు యిచ్చారు కదూ!"

"అవును."

"జగన్నాధం కారులో ఎక్కాక రఘుపతితో మాట్లాడుతూవుండగా వెనుకనుండి బ్రీఫ్ కేసు తీసింది నీవే కదూ!"

"నీ కలా తెలుసు?" కేశవులు కంగారుగా అనటం, కేశవులు భార్య ఏడవటం ప్రారంభించింది.

"మరేం భయంలేదు. నేను జైలునుండి పారిపోయి వచ్చేముందు అనుకుంటున్నారు."

"నా కేం తెలీదండి. ఆయనలా చేయమన్నారు చేశాను."

"ఎవరు చేయమన్నా శిక్షతప్పదు. నీకు శిక్ష పడకుండా వుండాలంటే వెంటనే పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి జరిగింది ఇన్‌స్పెక్టర్‌తో చెప్పు. అటు శిక్షయినా పడుతుంది. లేదా. ఈ రహస్యం బయట పడుతుందని రఘుపతి నిన్ను చంపేస్తాడు."

కేశవులు భార్య ఏడవటం ప్రారంభించింది. కేశవులు పోలీస్ స్టేషన్‌కు బయలుదేరాడు.

అదే అవకాశం అనుకొని రఘుపతి యింట్లో ప్రవేశించాడు చక్రధర్. ఎవ్వరూ లేకపోవటం వల్ల యింట్లో ప్రతి అంగుళం సోదాచేసి అవసరమయిన కాగితాలు తీసుకున్నాడు.

# 19

మాధవి కోర్టులో ప్రవేశించటం, జడ్జి రావటం ఒకే సారి జరిగాయి.

ప్రాసిక్యూషన్ అంతిమ ఉపన్యాసం ప్రారంభం కాబోతుందనగా, మాధవిలేచి "మిలార్డ్! ప్రాసిక్యూషన్ సాక్ష్యాలు కొన్ని నిరాధారమయినవి. ఆధారాలు, సాక్ష్యాలు ప్రాసిక్యూషన్‌లో ప్రవేశపెట్టలేకపోయారు. యీ విచారణలో అసలు జరిగిందేమిటి? ఎలా జరిగింది? ఎవరు చేశారు? ఎందుకు చేశారన్నది సవివరంగా వివరిస్తాను." అంది మాధవి.

"ప్రొసీడ్."

"బై రిక్వెష్టు. యీ కేసులో ముఖ్యమైన సాక్షి ధనలక్ష్మి వస్తుంది కాబట్టి, హంతకుడెవరో తెలుస్తుంది కాబట్టి ఏ ఒక్కరు బయటకు వెళ్ళటానికి వీలులేదు." అనటంలో జనంలో సంచలనం కలిగింది.

రఘుపతి దారులు వెతుక్కోటానికి సిద్ధపడ్డాడు.

"మొదటి డిఫెన్సు సాక్షి తోటమాలి కేశవులు." అనటంతో, తోటమాలి కేశవులు బ్రీఫ్ కేసు ఎలా తస్కరించింది వివరించి చెప్పాడు.

రఘుపతికి ముచ్చెమటలు పోశాయి. ధనలక్ష్మి కూడా కోర్టుకి రావచ్చు. కేశవులు పనిమీద వూరు వెళ్ళాడని భార్య చెప్పటం, తను నమ్మంగా కోర్టులోనికి రావటం, విష వలయంలో చిక్కుకున్నట్లయింది. చటుక్కున పారి పోబోయాడు, ఇన్‌స్పెక్టర్ చంద్రం పట్టుకున్నాడు.

కోర్టులో పెద్ద ఎత్తున సంచలనం జరిగింది.

"ఆర్డర్ ...ఆర్డర్" అన్నాడు జడ్జి.

"మిలాడ్ అండ్ ది జంటిల్ మన్ ఆఫ్ ద జ్యూరి! ఇది చాలా విచిత్రమయిన కేసు. ఈ కేసులో పూర్వాపరాలు సాక్ష్యాధారాలతో సహా వున్నాయి. యిది క్రొత్తరకపు వ్యాపారం. ఎలాంటిది?

"బ్లాక్ మెయిల్ చేయటానికి సొసైటిలో అందరూ తప్పులు చేయరు. చేసినా అందరు అగంతకుల కళ్ళపడరు. రఘుపతి, యీ సమాజంలో పెద్దమనిషి.

పెద్దమనిషిగా చెలామణి అవుతున్న యీ వ్యక్తి ఏం వ్యాపారం చేస్తున్నాడు? తను దేవేంద్రనాథ్‌కి ప్రతినెల డబ్బు బాకీవున్నానని చెప్పటం, తను ఎన్నుకున్న వ్యక్తి అంటె ఏ జగన్నాథం గారిలాంటి వాడ్నో పిలిచి యాభై వేలు యివ్వటం, వెంటనేనో లేక అవకాశాన్నిబట్టి దారి లోనో ఆ డబ్బు కొట్టెయ్యటం చేస్తాడు.

మధ్యవర్తిగా వెళ్ళిన వ్యక్తి డబ్బు యివ్వగలిగితే సరి లేదా యాభై వేలు లాభంకాదా? సూట్ కేసు మార్పిడి లాంటిది చేసి ఆడబ్బు అందించి చక్రవర్తిద్వారా బ్లాక్ మెయిల్ చేయించటం అప్పుడు యాభై వేలు పెట్టుబడితో ఎంతయినా సంపాదించవచ్చు.అలాంటిదే జడ్జి జగన్నాథం గారి విషయంలో జరిగింది" క్షణం ఆగింది మాధవి.

అందరి కళ్ళు నిశితంగా చూస్తున్నాయి. 'మాధవి యింత తెలివిగలదా?' అన్న ప్రశ్న జగన్నాథంలో తలెత్తింది.

"మిలాడ్ జడ్జి జగన్నాథం విషయంలో అదే జరిగింది. రఘుపతి తన బ్లడ్ ప్రెషర్ ఎక్కువయిందని దేవేంద్ర నాథ్‌కు డబ్బు కట్టమని జగన్నాథాన్ని కోరాడు. జగన్నాథం అంగీకరించి టాక్సీ ఎక్కాక జగన్నాథంతో

రఘుపతి మాట్లాడుతూ వుండగా తోటమాలి కేశవులు వెనుకనుండి బ్రీఫ్ కేసు తీసివేశాడు.

ఆ తరువాత ఏం జరిగింది. డబ్బుకోసం అష్ట కష్టాల అనుభవంతో మద్రాసు బయలుదేరాడు జగన్నాధం. ధనలక్ష్మి, రఘుపతి పంపిన వ్యక్తి. ట్రెయిన్ లో ప్రయాణం చేసింది, జగన్నాధానికి డబ్బు అందించింది. యాభై వేలు దేవేంద్రనాథ్ కు ముట్టాయి. యిరవై వేలు జగన్నాధానికి మిగిలాయి.

అయితే రఘుపతి వూహించినంత లక్షాధికారి కాదు జగన్నాధం. బ్లాక్ మెయిల్ లో ఎక్కువ డబ్బు ముట్ట లేదు.

ఇకపోతే హత్యవిషయం. రఘుపతికి చక్రవర్తికి మాట మాట పేచి వచ్చింది. ఒకరికొకరు అంతు చూస్తామని అన్నారు. ఈ విషయంలో తోటమాలి కేశవులు సాక్ష్యం. ఆ వుద్దేశంతోనే హాతుడయిన చక్రవర్తి, జడ్జి జగన్నాధం దగ్గర రివాల్వర్ తీసుకున్నాడు.

అయితే కథ అక్కడ అడ్డం తిరిగింది. వర్షానికి ముందు రఘుపతి టాక్సీలో చక్రవర్తి యింటికి వెళ్ళాడు. అందుకు సాక్షి సెంట్ పీటర్స్ చర్చి, ఎవాంజలిస్ట్ సాక్ష్యం. ఆ తరువాత రఘుపతి రివాల్వర్ తో చక్రవర్తిని కాల్చాడు ఆ తరువాత శవాన్ని బెడ్ రూం చేర్చి బెడ్ పై పడుకో బెట్టాడు.

ఎందుకు యిలా చేశాడు? వెరిసింపుల్ జడ్జి జగన్నాధం వస్తాడని రఘుపతికి తెలుసు. ముందుగదిలో ప్రవేశించిన వెంటనే శవాన్ని చూస్తే వెంటనే పారిపోతాడు కాబట్టి, జగన్నాధం ఆ యింట్లోకి వచ్చినట్లు సాక్ష్యం కావాలి.

అందుకే బెడ్ రూంలో శవాన్ని వుంచాడు.

ఇదేమి తెలియని జగన్నాథం ప్రవేశించాడు. హాలులో సోఫాలో వున్న రివాల్వర్ చూశాడు. అది తనదే కాబట్టి తీసి జేబులో వేసుకున్నాడు. రఘుపతి వూహ యిప్పుడు కరక్టయింది. ఒక్కొక్కగది చూసిన జగన్నాథం లోపల బెడ్ రూంలో వున్న చక్రవర్తి శవాన్ని చూశాడు.

ఆ శవం ఏ కారణంవల్ల చనిపోయింది జగన్నాథంకి తెలీదు. ఎందు వల్లంటే శవం గుండెలవరకు దుప్పటి కప్పి వుంది. చక్రవర్తి రివాల్వర్ షాట్ తో చనిపోయాడని వూహించలేదు. ఏది ఏమయినా తిరిగివచ్చాడు. అంతా తెలిసిన రఘుపతి కంట్రోల్ స్టేషన్ కి ఫోన్ చేశాడు. జగన్నాథంఅరస్టయ్యాడు. కాని జగన్నాథం హత్య చేయ లేదు.

ఈ కోర్టులో మరొక విషయం మనవి చేస్తున్నాను. జడ్జి జగన్నాథం వ్యక్తిత్వం గురించి, అనసూయ అనబడే స్త్రీ ఆయన మొదటి భార్య, ఆయన పెళ్ళి అయ్యాక ఒక బిడ్డ కలిగింది. ఆ బిడ్డనే మాలిని. మాలిని నా కూతురు కాదు. అనసూయ బిడ్డ.

యీ యిద్దరి పెళ్ళి పరమేశానికి యిష్టం లేదు. కారణం అతని మిత్రుడికి తన చెల్లెల్ని యివ్వాలనే వుద్దేశం. పరమేశం వేరే కారణంవల్ల జైలుకు వెళ్ళాడు. పరమేశం మిత్రుడు వైకుంఠం అనసూయపై పగవూనాడు. ఒక రాత్రి జడ్జి జగన్నాథం లేని సమయంలో గూండాలవల్ల అనసూయను తీసుకుపోయాడు. అంతే కాదు ఆమెను వేశ్యగా అమ్మివేశాడు.

పంజరంలో పక్షిలా, విష వలయంలో చిక్కుకు పోయిన అనసూయ ఏడాది క్రితంవరకు తిరిగి రాలేక

పోయింది. ఏడాది క్రితం వచ్చి భర్తను చూసింది. తన స్థానంలో మాధవి వుంది. తను పతితకాబట్టి మాధవితోనే బ్రతకమంది.

అయితే జగన్నాథం ఆమెపై వున్న మమకారం చంపుకోలేక పోయాడు. ఇక్కడొక రహస్యం చెప్పాలి. తిరిగివచ్చిన అనసూయ తన భర్తకోరకేగాక, తన తమ్ముడు కొరకు వెతికింది, అతనే ఇన్స్పెక్టర్ చంద్రం.

మిలాడ్. యీ కడపటి కథ యిక్కడ చెప్పటానికి కారణం జగన్నాథం బహిరంగంగా నిందితుడేగాక, వ్యక్తిత్వం లేని మనిషిగా రూపొందించబడ్డాడు. కాని అది పరిస్థితుల ప్రాబల్యమే అని చెప్తున్నాను. యీ కేసుకు సంబంధించిన సాక్ష్యాలు డిటెక్టివ్ చక్రధర్ వివరిస్తారు.'' అంది మాధవి, తన కథనం ముగిస్తూ. మాలిని నిశ్చేష్టురాలైంది.

కోర్టు యావత్తు గుసగుసలు ప్రారంభమయ్యాయి.

చక్రధర్ వివరాలను బట్టి రఘుపతి అంగీకరించిన విధానాన్ని బట్టి, జడ్జి జగన్నాథం నిర్దోషి అయ్యాడు.

తర్వాత మాలినికి, చంద్రానికి వైభవంగా పెళ్ళి జరిగింది.

పెళ్ళికి ప్రముఖులంతా వచ్చారు. అందరూ మాధవి కోర్టులో చూపిన ప్రతిభను కొనియాడారు. అంత మేధావి అయిన భార్య లభించినందుకు తనెంత అదృష్టవంతుడో అని పొంగిపోయాడు జడ్జి జగన్నాథం.

—: ఐ పో యిం ది :—




[ఏడవ భాగము]

నాలుకతో పెదాలను తడుపుకున్నాను.

నన్ను ఈరోజు ఆహారంగా వాడుకుంటారా ఈ నర మాంసభక్షకులు??

వాతావరణాన్కి వణుకుతోంది అలసిపోయిన నా శరీరం. వున్నట్టుండి నా చూపు ఓచోట ఠక్కున ఆగింది. చలి కాచుకుంటున్న ఓ నరమాంసభక్షకుడి మెడలో మెరుస్తూ ఏదో కనబడుతోంది.

ఏమిటది? తెచ్చిపెట్టుకున్న శక్తితో కళ్ళు పెద్దవి చేసాను.

మైగాడ్!...

బంగారపు గొలుసు? స్వస్తిక్ చైన్?

అంటె?

శాన్యోరా?

ఏదో తుఫాను నా శరీరంలో కదిలినట్లు ఒళ్ళంతా వణికింది.

సందేహం లేదు.

ఆ గోల్డ్ స్వస్తిక్ చైన్-శాన్యోరా కుసుమకోమల మైన శంఖంలాంటి మెడచుట్టూ అలంకరింపబడి ఉండేది.

ఈ రాక్షసుడి మెడలోకెలా వచ్చింది??

అంటే...

శాన్యోరాని రాత్రే మిగతావాళ్లు...చం...పు...కు తి...న్నా—రా? మోజుపుట్టి ఈ దుర్మార్గుడు ధరించి ఉంటాడు.

సందేహం లేదు. అనాగరికులు తమ విజయానికి చిహ్నంగా యిలాంటి పనులే చేస్తుంటారు.

ఆ ఆలోచన రాగానే నా హృదయం నిప్పులా కాలింది!

కాళ్ళ దగ్గర్నుంచి కణతలదాకా, వర్ణించలేని విచారం విద్యుచ్ఛక్తి తరంగాల్లా ప్రవహించింది!

హిమాలయ పర్వతాలన్నీ కలిసి ఒక్కసారిగా చటు క్కున నా గుండెల మీద కూర్చుని అధః పాతాళంలోకి నన్ను నొక్కేస్తున్నట్లనిపించింది.

నిస్సహాయ స్థితిలో కళ్ళమ్మట కన్నీళ్ళు జలపాతంలా కారిపోతున్నాయి.

తడితో నా కళ్ళు మసకలు కమ్ముతున్నాయి.

సూర్యుడూ, చంద్రుడూ ఈ లోకంలోని ప్రజలూ, ప్రపంచమంతా, ఏ ప్రళయంలోనో కల్సిపోయి, కరిగి

పోయినట్లు కనిపిస్తోంది...

ఏదీ లేని ఆ నిర్మల నిశీధిలోంచి శాన్యోరామూర్తి నా వేపు జాలిగా చూస్తూ, నవ్వి మాయమైంది.

తల తిప్పి భుజాలతో కన్నీళ్ళు తుడుచుకున్నాను.

శాన్యోరాని ఒంటరిగా వదిలి ఎంత పని చేసాను!

హే భగవాన్!

ఇన్నాళ్ళూ నాకు అండదండగా ఉండి కష్టాలు పంచుకున్న శాన్యోరా యిక లేదా?

ప్రభుత్వానికి ప్రక్కలో బల్లెంలా తయారైన గూఢచారిణి శాన్యోరాకి ఈ దిక్కులేని చావే శరణ్యమైనదా?

నా గతిమాత్రం ఏమిటిప్పుడు. నన్నూ ఏ సాయంత్రానికో తినేస్తారు ఈ రాక్షసులు.

నాలో ఉక్రోషం అవధులు దాటింది.

కసిగా పళ్ళు నూరాను.

ఆ క్షణంలో నాలో పుట్టిన కోపానికీ ఆవేశానికీ పగ్గాలు లేవు.

శాన్యోరాని చంపిన నరమాంస భక్షకుల్లో ఒకడినైనా ముఖ్యంగా ఆ స్వస్తిక్ గొలుసు ధరించి గర్వపడుతూన్న నరమాంస భక్షకుడినైనా చంపకుండా నేను చావకూడదు.

కనీసం ఆ అవకాశం నా కియ్యి భగవాన్!

చెమర్చిన కళ్ళతో మౌనంగా రోదించేను.

దాహం విపరీతంగా బాధిస్తోంది నన్ను.

మౌనంగా చలి కాచుకుంటున్నారు నరమాంసభక్షకులు- భక్షిణిలూ.

సూర్యుడు అప్పుడే తూర్పున ఉదయిస్తున్నాడు.

"రేయ్" అర్చాను నోరు పెగుల్చుకుని.

ఆ కేక విని...నరమాంసభక్షకులు నా వేపు ఓసారి చూసి మళ్ళీ తలలు తిప్పుకున్నారు.

అప్పటిదాకా పాలిచ్చిన ఆ 'స్త్రీ'—తల్లి రాక్షసి, బాలరాక్షసుడిగాడ్ని నేల మీద పడుకోపెట్టి పైకి లేచింది.

నా మెదడులో ఆశ తళుక్కుమంది.

"దా...హం..." అర్చాను మళ్ళీ.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు, నా భాష వాళ్ళ కర్థం కాదు, కదా అని.

తల ఊపాను దగ్గరకు రమ్మని.

తల్లి రాక్షసి చిన్న చిన్న అడుగులతో నా వేపు నడిచింది.

ఆమె నడకకు అనుగుణంగా స్తనాలు కదులుతున్నాయి.

బంధించబడిన నా దగ్గరగా వచ్చిందామె.

'దాహం' అన్నట్లు పెదాలు తడుపుకుంటూ సంజ్ఞ చేసాను.

ఆ సైగ, ఆ ఆటవికురాలికి అర్థం అయిందో లేదో తెలియదు కాని బలమైన, ఎత్తయిన నా దేహాన్ని చేతితో నిమురుతూ వికృతంగా నవ్వింది.

తేళ్ళూ, జర్రులూ ఒంటి మీద పాకినట్లయింది నాకు.

ముందు నా ప్రాణం దక్కించుకోవాలి.

నా మెదడులో ఓ ఆలోచన మెరిసింది.

అది తప్పో కాదో ఆ క్షణంలో చర్చించ దల్చుకో లేదు నేను.

నోటితో చటుక్కున తాటికాయిలా ఉన్న కుడి స్తనం మొన అందుకున్నాను.

చివ్వున వచ్చాయి పాలు నా నోట్లోకి...

వదల్లేదు నేను...

స్తనాగ్రాన్ని పళ్ళ మధ్య బిగించి, మొండిబలంతో పాలు పీల్చసాగాను. రుచి కూడా గ్రహించకుండా, గబ గబా కంఠ నాళాన్ని తడుపుకోసాగాను. నాలుగైదు గుటకలు వేసాను.

కెవ్వున అరిచి వెనక్కి గింజుకుందామె.

కోపంతో బుసలుకొడుతూ బాధగా స్తనాన్ని చేతితో రుద్దుకుంది.

నా ప్రాణం కాస్త కుదుటబడింది.

తడిసిన పెదాలు నాలుకతో తడుపుకుంటూ గర్వంగా నవ్వాను.

అంతే!

రివ్వున ముందుకు వచ్చి నా కుడిభుజం పళ్ళతో పట్టుకుందామె.

కోరలు చర్మంలో దిగబడ్డాయ్! అది అంతకుముందు 'జోనా' మందు వేసిన గాయపడ్డ భుజం!

దిశలు దద్దరిల్లేలా పిచ్చికేక పెట్టాను.

కేక పూర్తయ్యేసరికి భుజంలోంచి పిడికెడు మాంసం కొరికేసిందామె!

దాన్ని నమిలి మింగుతూ నావేపు చూసిందా రాక్షసి!

"సైతాన్ కా బచ్చా..." వెర్రిగా అరుస్తున్నాను కట్లమధ్య గింజుకుంటూ.

దారుణమైన దృశ్యం!

నా శరీరంలో మాంసం నా కళ్ళముందే తినడం??

రక్తం ధారలుగా కార్తోంది భుజంలోంచి.

అప్పటిదాకా చలి కాచుకున్న స్వస్తిక్ గొలుసు ధరించిన నరమాంసభక్షకుడు పైకిలేచి తల్లి రాక్షసివద్దకు వచ్చి కోపంగా ఏవో సైగలు చేసాడు కీచుగా అరుస్తూ.

ఆ సైగలు నా కర్థమైనాయి.

"ఈ ఆహారం అందరికీ! వెనక్కి రా," అని దానర్థం.

ఆమెను లాక్కుపోయాడు గొలుసు ధరించిన నరమాంస భక్షకుడు.

రక్తం కార్తోనే ఉంది.

బంధనాలు కొంచెం సడలించుకొని గాయపడ్డభుజాన్ని చెట్టుకు అదిమి పెట్టాను.

మళ్ళీ స్పృహ తప్పింది నాకు.

* * *

ఆ రోజంతా నా కెలాంటి ఆహారం నరమాంసభక్షకులు పెట్టలేదు.

నా పొట్ట వెన్నెముకకు అతుక్కుపోయింది.

మండే ఆకలి నాలో కోపాన్ని గబగబా రగుల్చుతోంది.

కట్లు విప్పితే నేనే మనిషిని నమిలి మింగేసేలాగున్నాను.

ఆకలి బాధ భరించలేక అప్పుడప్పుడు నోటితో కొమ్మలు అందుకొని ఆకులు నవుల్తున్నాను.

నోరు వగరుగా కావడం తర్వాత ఉమ్మేయడం జరుగుతోంది.

గతరాత్రి నుంచి అలాగే చెట్టుకు బంధించ బడడంవల్ల కాళ్ళు విపరీతంగా పీకుతున్నాయి.

వాటిల్లో శక్తి సన్నగిలుతోంది.

భుజానికి అయిన గాయంనుండి రక్తం యిప్పుడు ప్రవహించడంలేదు.

గడ్డకట్టింది రక్తం.

నోటికి అందిన ఆకులు రెండులాగి గాయంమీద అంటించేను నోటితో.

దట్టమైన ఈ ఆఫ్రికా అడవుల్లో నన్ను రక్షించడానికి ఎవరు వస్తారు?

ఇన్నాళ్ళూ నాకు తోడుగా ఉన్న శాన్యోరా.

నా కళ్ళు చెమర్చాయి.

ఆ గొలుసు ధరించిన నరమాంసభక్షకుడ్ని ఎలా చంపటం?

మెల్లగా చీకటి పడ్తోంది.

మృత్యువు ఆసన్నమౌతోంది!!

రాత్రికి నన్ను చంపి నరమాంసభక్షకులంతా విందు చేసుకుంటారు!

మిలటరీ క్రమశిక్షణలో పెరిగిన నా కండలు తిరిగిన శరీరాన్ని బ్రతికుండగానే కండ కండలుగా కొరికి తింటారు.

గుండెలు గుబగుబ లాడుతున్నాయ్.

మరోగంట మృత్యుద్వారంలో నిస్సహాయుడిగా బందీ అయి అలా నిలబడిపోయేను.

ఉన్నట్టుండి ఉలిక్కిపడ్డాను.

వచ్చేసారు!

ఎక్కడెక్కడో తిరిగి నరమాంసభక్షకులంతా, సాయంత్రానికి ఒకరి వెనకాల ఒకరు వచ్చారు నెమ్మదిగా.

అందరూ ఓసారి నా వేపు చూసేరు ఆనందంగా.

ఎదురుగా భోగి మంటలాంటిది ఉదయాన్నించిసన్నగా మండుతోంది.

నడుచుకుంటూ వచ్చిన వారిలో ఇద్దరు నరమాంస భక్షకుల చేతుల్లో నాల్గడుగులు పొడవుగల ఆకారంలో చెక్కబడి ఉన్న దుక్కల్లాంటి బలమైన కొమ్మలు కన్పించాయి.

ఎందుకవి?...

ఏం చేస్తారు నన్ను వాటితో?

నా మెదడులో తేలుకొండిల్లా ప్రశ్నార్థకాలు నిల్చాయి.

ఆ యిద్దరూ మంట కటూ ఇటూ నిల్చున్నారు.

ఊపిరి బిగపట్టి స్థాణువులా నిలబడి పోయి చూస్తున్నాను ఆ కార్యక్రమమంతా.

అయిదు నిముషాల్లో ఆ యిద్దరు నరమాంసభక్షకులూ మంట కటూ ఇటూ ఆ Y ఆకారం కొమ్మల్ని పాతారు.

కొమ్మల్ని ఆ స్థానాల్లో ఎందుకు పాతారు??

నా కర్థం అయిపోయింది.

వెన్నులోంచి చలి పుట్టుకొచ్చింది.

నన్ను బహుశా ఆ Y ఆకారం స్థంభాల మీద పడుకో పెట్టి జారిపోకుండా కట్టేస్తారు.

క్రమక్రమంగా కింద మంట ఎక్కువ చేస్తారు.

నా శరీరం ఉడికిపోతుంది.

ఉడికిన నా శరీరాన్ని అందరూ ఆనందంగా కొరుక్కు తింటారు.

నా ఒళ్ళు కంపించి పోతోంది.

భగవాన్! శత్రువుకి కూడా వద్దు ఈ చిత్రహింస!!

నా కళ్ళవెంట అప్రయత్నంగా వెచ్చటి అశ్రువులు బుగ్గలమీదుగా క్రిందికి జారాయి.

బొమ్మలతో మృత్యుశయ్య ఏర్పాటు చేసి యమభటుల్లా నరమాంసభక్షకులు నా దగ్గరగా వచ్చారు, గెంతులాంటి నడకతో.

నా కాళ్ళు గడగడ వణుకుతున్నాయి.

యిద్దరు నరమాంసభక్షకులు ముందు, చేతులూ కాళ్ళు ప్రత్యేకంగా కట్టి చెట్టునుంచి పాతకట్లు విప్పి నన్ను వేరు చేసారు.

"హెల్ప్! హెల్ప్!"

గింజుకుంటూనే అరిచాను, నాభి కదిలేలా.

నా అరుపులు ఆ వికృతారణ్యంలో బలహీనంగా ప్రతిధ్వనించాయ్.

ఎక్కడా పిట్టకూడా చప్పుడు చెయ్యలేదు.

నలుగురూ కల్సి నన్ను మంటలవేపు ఈడ్చుకెళ్ళసాగారు.

ఆరడుగుల దూరంలో మంట కనబడుతోంది.

స్ప్రింగులా గింజుకుంటున్నాను వెనక్కి ప్రాణభయంతో.

నా ప్రయత్నం ఎన్నోక్షణాలు సఫలం కావడం లేదు.

రాక్షస బలం వారిది!!

ఇలాగైతే వీలులేదని అర్థమైపోయింది వాళ్ళకి.

బంధించబడిన కాళ్ళని యిద్దరు చటుక్కున ఎత్తిపట్టుకున్నారు. స్ట్రెచర్‌లా మోసుకుపోసాగారు నన్ను.

ఇప్పుడు—

మృత్యువు అడుగు దూరంలో నిల్చుని ఉంది.

రెండు వేపుల్నుంచీ నన్ను బస్తాలా మోసుకెళ్ళి ఆ

కర్రల మీద పడుకోబెట్టారు.

కాళ్ళనీ, చేతుల్నీ సాగదీసి కర్ర చివరలకు తీగలతో కట్టేసారు.

సర్రున తగిలింది వీపుకి వేడి కింద మంటనుంచి.

భగవాన్!

ఎంత శిక్ష వేసావ్!

చావు ప్రసాదించినా సహజమైన మరణం ఇవ్వలేదు.

నడుంకద్ద ఆధారం లేదు.

కాళ్ళు, చేతులూ బంధించబడి ఉండగా మధ్య మంట సెగ మీదికి వ్రేలాడుతున్నాను. గాయపడ్డ భుజం...!!

తడిసిన చెక్కిళ్ళతో, వేలాడబడుతూ నిస్సహాయంగా అటూ ఇటూ చూసాను.

చేతిలోని ఓ కొయ్య పాత్రతో ఒకడు వచ్చి నా శరీరాన్ని నూనెలాంటి ద్రవపదార్థంతో తడిపాడు.

రాక్షసుడు! శరీరం వేగడానికా?

మిగతా నరమాంసభక్షకులు కొమ్మలూ, ఆకులు వేరు తున్నారు మంటలను మరింత ఉధృతం చెయ్యడానికి.

అందులో స్వస్తిక్ గొలుసు ధరించిన నరమాంస భక్షకుడు కూడా!...

శాన్యోరా! నన్ను క్షమించు! చివరి క్షణాల్లో కూడా నిన్ను చంపినవాడిపై కసి తీర్చుకోలేక పోయాను!

చెంపల మీదుగా జారి, కన్నీళ్ళు అగ్నిలో టప టపా పడుతున్నాయి.

* * *

సరిగ్గా అదే సమయంలో—

దూరంగా చెట్లమధ్య సరసర ధ్వని వినిపించింది.

ఆ ధ్వనితో సమానంగా ఏదో జంతువు అరుపు కీచుగా భీకరంగా వినబడింది.

అరణ్యం గడగడా వణికి పోయింది ఆ అరుపుకు.

సరసర ఆకులధ్వని...

కీచు కేక...

భూకంపం దగ్గరవుతున్నట్లు అదురుతోంది నేల.

చెవిలోని కర్ణభేరి పగుల్తుందా అన్నట్లుగా ఉన్నాయి ఆ భీభత్సపు కీచు కేకలు.

ఆకులు, కొమ్మలు ఏరుతున్న నరమాంసభక్షకులు ఆ పని ఆపి స్థాణువుల్లా నిలబడిపోయి చెవులు రిక్కించారు.

కుడివేపు చెట్లు ఫెళ ఫెళ విరిగి పడ్డాయ్!

వాటి మధ్యనుంచి రాసుకుంటూ వచ్చి, మేమున్న మైదానంలోకి తలపెట్టి భయంకరంగా అర్చింది ఓ ఆకారం!

ఉలిక్కిపడి అటువేపు చూసాను.

డినోసార్!

రాకాశితొండ!!

దాని ముఖం మీద పెద్ద పెద్ద గాయాలున్నాయ్!

చిక్కటి ఎర్రటి రక్తం ధారలుగా కార్తోంది.

నోటిలోంచి చొంగ, తీగలుగా జారుతోంది.

జరజరా ముందుకు మైదానంలోకి పాకింది ఆ భయంకర రాకాశి జంతువు!

అంతే!

నరమాంసభక్షకులు—

గుండెలు దాచుకుంటూ—

హాహాకారాలు చేస్తూ—

తోసుకొంటూ తొక్కుకుంటూ, వమ్ముకుంటూ—

అక్కడ్నించి ప్రాణభీతితో పరిగెత్తారు గెంతుకుంటూ. వారి వెనుకే జర్రున ముందుకి పాకి మంటను చూసి భయపడి దాని ప్రక్కగా దూసుకుపోయింది.

అలా కదిల్నప్పుడు మహాకాయంగల డినోసార్ శరీరం క్రింద వెనుకగా పరుగెడుతున్న నల్గురు నరమాంసభక్షకులు పడి, నలిగిపోయి అక్కడికక్కడే ప్రాణాలు విడిచారు.

అంతా క్షణాల్లో జరిగిపోయింది.

నా ప్రక్కగా దూసుకువెళ్ళిన రాకాశితొండంని ఆశ్చర్యంగా పరిశీలించాను. సుమారు వంద అడుగుల పొడవుంటుంది.

ముఖాగ్రం నుంచి, తోక_చివరివరకూ బలిష్ఠమైన పొలుసులు, రెండు ప్రక్కలా కొనదేరిన కవచభాగాలు. సన్నని, మెత్తటి, పొడుగాటి మెడ.

ఏదో జంతువుదాన్ని రెచ్చగొట్టి ఉంటుంది!
శరీరం మీద అక్కడక్కడా గాయాలున్నాయి.

అయితే రాకాశితొండ "శాకాహారి" అని చాలమందికి తెలియదు!!

అది_అవసరాన్ని బట్టి హింసించడం తప్ప ఏ జంతువునీ_ఏ మనిషినీ తినదు.

ఈ విషయం బుద్ధి వికసించని నరమాంసభక్షకులకి తెలియక పోవడం నాకు చాల మంచిది అయింది.

రెండు క్షణాల్లో డినోసార్ అమిత వేగంతో అడివిలోకి మాయమైంది.

ఒంట్లోని శక్తినంతా కూడదీసుకొని చటుక్కున కాళ్ళు విదిలించాను బలంగా.

కాళ్ళు రెండూ మంటలమీద పడ్డాయ్.

క్షణంలో ప్రక్కకు గెంతాను.

పది నిముషాలపాటు శ్రమించి చేతులకీ, కాళ్ళకీ బంధింపబడిన తీగలను కాల్చేసాను మంట మీద పెట్టి.

ఒళ్ళు విరుచుకొని నిలబడ్డాను అలసటగా.

హాయిగా గాలి పీల్చాను కాస్సేపు.

అన్నట్టు వాళ్లు నిప్పు ఎలా తయారు చేసారు??

దేర్ మస్ట్ బి సమ్ సోర్స్!

ఆ ప్రాంతమంతా కలయ తిరిగాను.

కొంత సేపట్లో నా శ్రమ ఫలించింది.

రెండు చెకుముకి రాళ్లు దొరికాయి ఓ చెట్టు మొదట్లో.

వాటిని పాంటు జేబులోకి తోసాను.

అప్పటికే శిధిలమై సగం పేలికలైన చొక్కా, సగ్రున చించి భుజంవద్ద గాయం చుట్టూ కట్టాను.

స్వేచ్ఛ పొందగానే నా బాధ్యతలు మళ్ళీ తేనెటీగల్లా మునురుకున్నాయ్ యిప్పుడెక్కడికి వెళ్ళాలి??

ఒంటరిగా...

నన్ను ఒంటరివాడిని చేసిన కాన్యోరా జ్ఞాపకం వస్తోంది...

నాకు సానుభూతి చెప్పే రెండో ప్రాణి ఈ కీకార ణ్యంలో లేదు.

కలతబారిన గుండెతో యాంత్రికంగా అడుగులు ముందుకు వేసాను.

* * *

కాటుకలా ఉంది చీకటి.

తినడానిక్కూడా లేదు.

ఆకలి విజృంభిస్తూనే ఉంది... పైగా దాహం...

నరమాంసభక్షకులు ఈ ప్రాంతాల్లోనే ఉండేవారు.

నీరు వారికీ అవసరమే.

కాబట్టి దగ్గర్లో ఓ చెరువు ఉండి ఉండొచ్చు.

కాని అది ఏ దిశలో ఉందో?

ఒంటరిగా ఈ చీకట్లో, ఈ భయంకర నిశీధ సమయంలో, గుండెలు గబగబ లాడించే చావు నిశ్శబ్దంలో వెతుక్కుంటూ ప్రయాణించడం అసాధ్యం!

కాని దాహం తీరేదెలా?

గబగబా ఓ చెట్టు వద్దకు నడిచాను.

ఆకుల మీద పడిన మంచు బిందువులను ఆత్రంగా చప్పరించేను. కాని అది పెదిమలు తడుపుకోడానికి మాత్రమే ఉపయోగపడింది. జీవితంలో మొట్టమొదటి సారిగా యింతటి క్షుద్బాధ, ఆకలి బాధ అనుభవిస్తున్నాను. తెల్లవారేదాకా ఆహారం వెతుక్కునే అవకాశం లేదు. ఎలాగో ఓపిక పట్టాలి.

అసలు ఆ చీకట్లో నడిస్తేనే భయంగా ఉంది.

కాలిక్రింద ఏ తీగ, మెత్తగా తగిలినా విష సర్పంలా అనిపిస్తోంది. మానసిక శక్తులను నెమ్మదిగా కూడకట్టుకున్నాను.

ఆ చెట్టెక్కి, అనువైన ప్రదేశాన్ని వెతుక్కుని, మెల్లగా నడుం వాల్చాను ఎదుటి కొమ్మలకు కాళ్లు దాపు పెట్టి.

అప్పుడప్పుడూ అడవి మృగాల అరుపులు దూరంగా... ఎలాగో... విన్పిస్తున్నాయి.

కాళ్ళకీ, చేతులకీ కాస్తంత స్వేచ్ఛ కలిగి, గాలి తగిలే

సరికి వెంటనే నిద్రపట్టేసింది.

సరిగ్గా ఓ మధ్య రాత్రిలో ఉలిక్కిపడి లేచాను.

కారణం!

దబ దబా పడుతోంది వర్షం.!

మరోక్షణాన్నే బద్ధకమంతా వదిలిపోయింది.

దబ దబా చినుకులు!

అప్పటికే తడిసిపోయాను పూర్తిగా.

మెరుపులు మెరుస్తున్నాయి.

గాలి రివ్వున వస్తోంది.

కొమ్మలు నిస్సహాయంగా కదులుతున్నాయి.

వర్షం చేయూతతో చలి విజృంభించి-విర్రవీగసాగింది. నాకు తెలియకుండానే నా దవడలు టకటకా కొట్టుకో సాగాయి. నిలువ నీడ లేదు.

కాదు-ఆశ్రయం లేదు.

ఆ వర్షంలో-ఆ చలిలో ఆ కొమ్మలమీద స్థాణువులా కూర్చుండి పోయేను. పాంటు, బూటు తప్ప శరీరాన్నే ఆచ్ఛాదన లేదు.

నా మీద ఎంత కక్ష కట్టావ్ భగవాన్.

ఒక నిస్సహాయుడిమీద నీ ప్రతిభ నిరూపించుకుంటు న్నావ్. పిచ్చివాడిలా దుబ్బులా పెరిగిన గడ్డాన్ని పీక్కు న్నాను...

వర్షం టపటపా పడుతూనే ఉంది నెత్తి మీద.

దాహం విషయం అప్పటికి గుర్తుకొచ్చింది.

అరచేతులు, దగ్గరగా పెట్టి చేతులు ముందుకు చాపాను. వర్షపు నీళ్ళు దోసిట నిండాయి.

ఆత్రంగా వాటిని తాగి కడుపు నింపుకున్నాను.

ఆ రాత్రంతా ఆ విధమైన నరకం అనుభవిస్తూ వర్షంలో అలాగే మెలుకువగా ఉండిపోయేను రేపు రాబోయే జ్వర తీవ్రతను అంచనా వేసుకుంటూ.

* * *

ఉదయాన్నే పూర్తిగా వర్షం తగ్గిపోయింది.

చెట్టు దిగి నిలబడి జుట్టంతా పిండుకున్నాను.

తడిసి పోయిన పాంటు విప్పి కొమ్మలమీద ఆరేసి అండర్ వేర్ తో నిలబడ్డాను.

బూటు కాల్లోంచి కత్తితీసి గడ్డాన్ని షేవ్ చేయడం ప్రారంభించాను. పది నిముషాల్లో ఆ పని పూర్తి అయింది,

ఆకలి బాధకు యిక తాళలేనని అప్పుడు గ్రహించాను!

సరిగ్గా అప్పుడే తుపాకీ విషయం జ్ఞప్తి కొచ్చింది.

అవును గుహ-పరిసరాల్లో అది ఉంటుంది.

తుపాకీ దొరికితే ఏ పక్షినో జంతువునో కొట్టి కడుపు నింపుకోవచ్చు. పైగా ఆత్మరక్షణ కది అతిముఖ్యం!

ఓ అరగంట చూసి సగం ఆరిన పాంటును చక చక ధరించాను.

సుమారు గంట తర్వాత నా ప్రయత్నం ఫలించింది.

గుహ కనబడింది.

పరిసరాలు క్షుణ్ణంగా పరిశీలించాను.

పొదల మధ్య కనబడింది అంతకు ముందు నరమాంస భక్షకుడు విసిరేసిన తుపాకీ!

తుపాకీ జాగ్రత్తగా పరిశీలించాను.

థాంక్ గాడ్! పొదల్లో మధ్య పడి ఉండడంవల్ల పైభాగం మాత్రం తడిసింది.

నీళ్లు బులెట్ ఛాంబర్‌లోకీ, బారెల్‌లోకీ వెళ్ళలేదు.

మాగజయిన్ ఛాంబర్ తెరిచాను.

W స్ప్రింగ్‌లో నాలుగు తూటాలు ఉన్నాయి.

మళ్ళీ దాన్ని ఫిక్స్‌చేసి సేఫ్టీకాచ్ లాక్ చేశాను.

అప్రయత్నంగా తలెత్తేసరికి అక్కడి చెట్టుమీద సగం కూలిపోయిన మంచె కనబడింది.

దానిమీదే మొదటి రాత్రి నేను పడుకున్నది.

ఒక్కడినేకాదు—కాన్యోరాతో.

యిప్పుడు కాన్యోరా...... నాతో లేదు.

నాతో కాదు అసలు లేనే లేదు.

షి వజ్ కిల్డ్ బై బ్రూటల్ కానబెల్ బాసర్డ్స్!

భయంకర్ జీవితానికో తీయని జ్ఞాపకం కాన్యోరా!

మాయని గాయం కాన్యోరా!

యిక ఆ ప్రదేశంలో ఉండాలనిపించలేదు నాకు.

పెద్ద పెద్ద అంగలతో గుహ దాటి పడమటవేపున నడిచాను.

మూడు మైళ్లు పైగా నడిచి వుంటాను.

అక్కడక్కడ దొరికిన పేరు తెలియని ఫలాలు తిన్నాను.

ఎండ తీవ్రంగా ఉండి చెట్లమధ్య నుంచి భూతలానికి తాకుతూంది.

రకరకాల కోతులు చెట్లమీంచి స్వేచ్ఛగా గెంతుతూ అక్కడక్కడ కన్పిస్తున్నాయ్.

చేతిలోని తుపాకితో ముందుకు నడుస్తూ ఆలోచిస్తున్నాను విపరీతంగా......

నా జీవితం ఎలా తెల్లవారుతుందో తెలియడంలేదు.

నా కళ్ళు ఓచోట ఠక్కున ఆగిపోయాయి. నొసలు

ముడిపడింది.

ఎదురుగా ఓ బోర్డు...

ఆశ్చర్యం!!!

నిర్జనారణ్యంలో బోర్డేమిటి అసలు??

దానిమీద యింగ్లీషులో వ్రాయబడ్డ అక్షరాలు నాలో ఆశారేఖలు చిగురింప జేసాయ్!

చదివాను—కళ్ళు నులుముకొని మళ్ళీ—కలకాదు.

దానిమీద ఈ విధంగా రాయబడివుంది. దారి చూపడానికి ఓ బాణం గుర్తుతో...

"మీకు ఆశ్రయం కావాలా? బాణంగుర్తు చూపబడిన దారిలో మరో రెండుమైళ్ళు నడవండి. అక్కడ మిగతా మార్గం తెలుసుకుంటారు."

* * *

మొదటి ఆధారం బోర్డు.

రెండోది యింగ్లీషుమాటలు.

అంటే యిక్కడో నాగరికుడు కాని నాగరికులు కాని ఉండివుండాలి.

ఆ ఆలోచన ఎడారిలో మంచినీళ్ళు దొరికినట్లు ఆహ్లాదంగా తట్టింది.

థాంక్ గాడ్! ఆనందం పట్టలేక కళ్ళు మూసుకుని, చేతులు ముడిచి భగవంతుడికి కృతజ్ఞతలు అర్పించుకున్నాను.

నాలో ఆశాదీపం ఉజ్వలంగా ప్రకాశించసాగింది.

ఒకసారి...

రెండోసారి...

ఎన్నోసార్లు మనసుతీరా చదివాను ఆ బోర్డు.

(సశేషం)



# క్రైమ్‌లో తమాషా

## పావలా వ్యాపారం

"మంచి కోవా వుందా?"

"ఉంది!"

"కె.జి. ఎట్లా?"

"పది రూపాయలు!"

"పది కె.జి. లివ్వండి!"

"జిలేబి కె.జి. ఎట్లా?"

"నాలుగు రూపాయలు!"

"నాలుగు కె.జి. లివ్వండి."

"గులాబ్‌జాము కె.జి. ఎట్లా?

"ఆరు రూపాయలు"

"ఆరు కె.జి. లివ్వండి."

ఇదేదో పెద్ద గిరాకే అనుకొన్నాడు షాపతను. "ఇంకేం కావాలండి?" అన్నాడు వినయంగా.

"ఇపుడన్నీ కలిపేయండి!" అన్నాడు అతను.

"కలిపానండి!"

"ఇపుడు దాంట్లోది నాకు పావలాదీయండి" అన్నాడు పెద్దమనిషి.

? ? ?

—'అరుణ', అమలాపురం.

## నిలువు దోపిడి?

ఇద్దరు దొంగలు ఒక బట్టల షాపులో జొరబడ్డారు.

అందులో ఒకడు తన తోటివాడితో "చూశావా, ఈ చీరల ధరలు! వీళ్ళ దుంపతెగ. దోపిడీ, నిలువు దోపిడీ!" అన్నాడు గుండెలు బాదుకుంటూ.

—ఎన్. సాయికృష్ణప్రసాద్, హైద్రాబాదు.

## ప్రఖ్యాత డిటెక్టివ్

డిటెక్టివ్ వైరాగ్యం కుర్చీలో వెనక్కి వాలి కళ్ళు మూసుకొని దీర్ఘాలోచనల్లో మునిగివున్నాడు. అతని చేతిలో ఓ గులాబీ రంగు కాగితం నలుగుతోంది.

రాత్రి 8 గంటలకు తను క్లబ్ నుండి ఒచ్చేసరికి ఇంట్లో బోయ్ లేడు. టేబుల్‌పై ఓ గులాబీ రంగు వుత్తరం మాత్రం వుంది.

అందులో!.........

"ఈ రాత్రి 12 గంటలకు నీ చావు తప్పదు!"

అని ఒకే ఒక వాక్యం వ్రాపి వుంది. క్రింద సంతకం లేదు. వెనుక ప్రక్క అడ్రస్ వ్రాయలేదు. ఆ వుత్తరం తన ఇంట్లోకి ఎలా వచ్చిందో? తెలియదు. ఎవరు వ్రాసారు? ఏమిటీ మిస్టరీ?

పైన ఫాన్ గిర గిరా తిరుగుతోంది. ఆ ఫేన్‌కు మల్లే డిటెక్టివ్ బుర్రలో ఆలోచనలు గిర గిరా తిరుగుతున్నాయ్.

ఇంతలో!.........

డిటెక్టివ్ అసిస్టెంట్ వికారం వచ్చి, "సార్!" అని పిలిచాడు.

మెల్లగా కళ్ళు విప్పి చూసాడు డిటెక్టివ్. ఎఱ్ఱగా అగ్ని గోళాల్లా మెరుస్తున్నాయ్ అతని కళ్ళు. చేతిలోని వుత్తరాన్ని అసిస్టెంట్‌కు మౌనంగా అందించాడు.

ఆ వుత్తరంలోని సారాంశాన్ని చదివి కోపావేశంతో బుసలు కొట్టాడు అసిస్టెంట్ వికారం.

అది చూచి చిరునవ్వుతో "అంత ఆవేశం పనికిరాదు వికారం! సమయస్ఫూర్తి, శత్రువులను ఎదుర్కొనే గుండె ధైర్యం, కావాలి" అని, అసిస్టెంట్‌కు తన ప్లాన్ వివరించాడు డిటెక్టివ్ వైరాగ్యం.

ఆ రాత్రి—

బెడ్ రూంలో స్ప్రింగ్ కాట్ మీద దుప్పటి కప్పుకొని పడుకొని వున్నాడు డిటెక్టివ్.

గదిలో జీరో వాట్ బల్బు వెలుగుతోంది. గోడ గడియారం ఠంగు ఠంగున 12 గంటలు కొట్టింది. డిటెక్టివ్‌లో ఏ చలనమూ రాలేదు. నిమిషాలు చక చకా దొర్లుతున్నాయ్.

1 గంట కొట్టింది గడియారం.

నిలువెత్తు స్టీల్ బీరువా తలుపు మెల్లగా తెరుచుకుంది. చేతిలో పిస్తోల్ పట్టుకొని బయటకు వచ్చాడు డిటెక్టివ్.

సరిగ్గా ఆ సమయంలోనే, మంచం క్రిందనుండి బయట పడి నిద్రకళ్ళతో, "సార్! ఎవరూ రారేమో!" తన సందేహం వెలిబుచ్చాడు అసిస్టెంట్ వికారం.

"నేనూ అదే అనుకుంటున్నాను!" అన్నాడు డిటెక్టివ్. వెంటనే మంచం వద్దకు వెళ్ళి విసురుగా దుప్పటి తొలగించాడు.

మనిషి ఆకారంలో వున్న తలగడలు సర్ది అసిస్టెంట్‌కు "గుడ్ నైట్!" చెప్పేసి నిద్రకుపక్రమించాడు.

మర్నాడు బోయ్ "సార్। నిన్న 6 గంటలకు ఎవరో ఒకతను, తనకు బెదిరింపు ఉత్తరం వచ్చిందని మీ దగ్గరకు వచ్చాడు, ఆ సమయంలో మీరు క్లబ్‌నుండి రాలేదు. నే నా ఉత్తరం తీసుకొని అతన్ని 8 గంటలకు రమ్మని చెప్పాను. అతను అయిష్టంగా వెళ్ళిపోయాడు. ఆ ఉత్తరం మీ టేబుల్ పై వుంచి, నేను ఇంటికెళ్ళిపోయాను।" అన్నాడు.

ఇది విని డిటెక్టివ్‌లిద్దరూ తెల్ల మొహం వేశారు ...

—ఏ. చంద్రశేఖరరావు, మథిలి.

## కాలునొప్పి!

ఓ ముసలాయన డాక్టర్‌వద్దకు వెళ్ళి ఇలా అన్నాడు:

"డాక్టర్ గారూ। నా ఎడమ కాలు చాలా నెప్పిగా ఉందండి."

డాక్టర్:-పెద్ద వయసు గదండి. అలాంటి బాధలు వస్తూనే ఉంటాయి.

ముసలాయన:-చిత్తం. మరి కుడి కాలుది కూడా అదే వయసు కదండీ। మరి దానికి రాలేదు. ఎందుచేత?

"దానికేముందండి. మందిస్తాను. పుచ్చుకోండి. ఇట్టే వస్తుం"దన్నాడు డాక్టరు. —శేషు, తుని.

## "కొబ్బరి బోండాల దొంగ"

పోలీస్ బంగారుకొండకి ఎప్పుడూ అధికార్లనుండి చీవాట్లే—ఏ కేసూ పట్టుకోలేదని. శ్రీ ప్రసాదరాజాగారి నుండి రిపోర్టు వచ్చింది—"రాత్రి తమ తోటలోని కొబ్బరి బోండాలు ఎవరో దొంగిలిస్తున్నారని। పట్టుకోవలసిందని." ఇకనేం-ఆ డ్యూటీ బంగారు కొండపై బడింది.

తోట మధ్యగా-అందంగా చిన్న బంగ్లా ముచ్చటగా వుంది. తాను వచ్చినట్లుగా ఇంటివారికి తెలియజేసి డ్యూటీ ప్రారంభించాడు బంగారు కొండ. ఎలాగైనా దొంగని పట్టి అందరి మెప్పు పొందాలి. అదే అతడి కోరిక.

చలి చంపేస్తున్నా, ఫ్యాక్టరీగొట్టంలా బీడీ వెచ్చదనంలో నిద్రని తోలేస్తూ దొంగకోసం ఎదురు చూస్తున్నాడు. అప్పుడప్పుడూ కొబ్బరి కాయలవైపు చూస్తున్నాడు.

అర్ధరాత్రి దాటింది.

అంతలో ఇంటిలోనుండి ఒక ఆకారం బరువు మోసుకుంటూ రావడం చూశాడు.

గబగబా అక్కడికెళ్ళి "ఎవర్నువ్వు? ఏమిటిది?" అని గద్దించాడు.

ఆ పురుషాకారం గజగజలాడుతూ మూట విప్పి చూపాడు. అందులో స్టీలు, వెండి సామాన్లున్నాయి.

బంగారు కొండకి కోప్మొచ్చింది. "వెధవ! ఇవెందుకురా దొంగతనం చేశావ్? కొబ్బరి బోండాలు, కాయలు దొంగిలించకపోయావ్? ఇవి గాబట్టి బతికిపోయావ్ పో.... వెధవన్నరెధవ—" అని నాలుగు తన్ని పంపేశాడు దొంగని. దొంగ వాయువేగంతో పరిగెత్తాడు బ్రతుకు జీవుడా! అనుకుని.

మర్నాడు రాజాగారు తమ స్టీలు, వెండి సామాన్లు దొంగిలింపబడ్డాయని రిపోర్టు చేశారు.

ఆ దొంగ సంగతి వివరంగా చెప్పాడు బంగారు కొండ. అయినా యస్. ఐ. ఎందుకలా తనపై విరుచుకు పడ్డాడో అర్థం కాలేదా చి(మ)ట్టి తండ్రికి!

—యం. విద్యుల్లత, విశాఖపట్నం-27.



